

ప్రతీక్షణము

శా॥ లగ్నంబెల్లి; వివాహముంగదిసె; నేలా రాఁడు గోవిందుఁ?డు
ద్విగ్నంబయ్యెడి మానసంబు; వినెనో వృత్తాంతమున్? బ్రాహ్మణుం
డగ్నిద్యోతనుఁ డేటికిందడసె? నాయత్నంబు సిద్ధించునో!
భగ్నంబై చనునో? విరించి కృతమెబ్భంగిన్ బ్రవర్తించునో?॥

మ॥ ఘనుఁ డాభూసురుఁడేగెనో నడుమ మార్గశ్రాన్తుఁడై చిక్కెనో?
విని కృష్ణుం డిది తప్పుగాఁదలఁచునో విచ్చేయునో? యీశ్వరుం
డనుకూలింపఁదలంచునో తలఁపఁడో? యార్యామహాదేవియున్
నను రక్షింపఁ నెఱుంగునో యెఱుఁగదో నాభాగ్య మెట్లున్నదో॥

భాగవతము.

1934 జనవరి
సంపుటి 6 సంచిక 11




# శ్రీ గాదె చూడికుడుతమ్మగారు

చం॥ పొడముట పాలసంద్రమును బోలినయింట; విధూపమానులై
తొడరినయట్టి సోదరులతో; మరి దివ్యసురూపరాశియై;
కడిపెడుపిల్ల; లుచ్చమగు కాపుర;మార్యవరుండు భర్త;యెం
దడగలుగంగరానిసిరి; యింతటి కెంతయు మంతుకెక్కఁ గం
పెడు సుగుణంబులం గలిగి యెల్లరకుం దలలోన నాల్కయై
పుడమిని బూరుషార్థముల మూటలఁగట్టుట మాటలా చెలీ॥

స॥ కృ॥ మూర్తి.

ఈశ్వర కటాక్షమువలన మనభారత భూమియం దార్యచరిత్రలు క్రమక్రమముగఁ దెలియఁ బడుచుండుట యొక గొప్ప శుభ సూచకముకదా! అందును మన యాంధ్ర నారీరత్నముల శుభోదంతములు తెలియుట మరింత విశేషమైన సంగతి. అందును స్త్రీ విద్యయనునది కర్ణశూలమై సంస్కరణ మనునది పరమాసహ్యమై యుండిన ముప్పది నలువదేండ్ల క్రిందటి కాలమునఁ గేవల మనాగరికమై యంధకారబంధురమై యల్లాడు చుండిన గంజాముమండలమున బరమ వైష్ణవకుటుంబమునందు జనించిన యొక స్త్రీవ్యక్తి, సర్వవిధముల నాగరకతావిశిష్టమై యొప్పుచున్న యిక్కాలమునందు జెప్పుకొనఁబడ దగియుండుట సామాన్య విషయముకాదు.

ఆ కాలమందగ్నిని కడిగికొనునట్టి యాచారవ్యవహారములు గల కుటుంబములలో నగ్రగణ్యమై యుండెడిది న్యాయపతి వారి కుటుంబము. ఇందు పరమవైష్ణవ శిఖామణియని పేరువడియుండిన నారాయణమూర్తి పంతులుగారి సంతానమున నొకత యీ మన చూడికుడుతమ్మగారు. ఈమె కింగ్లీషురాదు. ఆంధ్రభాషయందు సామాన్యమైన సాహిత్యము కలవారు. ఈ యమ జన్మమొందినది సం॥ 1869 ర ప్రాంతమున. 'అష్టవర్షాభవేత్కన్యా' న్యాయమున నీమెను గాదె రాఘవరావుపంతులు గారికిచ్చి పెండ్లి చేసిరి.

“శ్రీ రాఘవరావు పంతులుగారు మొదటి నుండియు విశాలహృదయులు కాబట్టి వారి యుద్బోధలవలన నీమెయు నిట్లు మారినది” యని యందురు కాని యామాట సున్న. భార్య కిష్టమున్నపుడే భర్త యేసంస్కారము నైనఁ జేయఁగలఁడు గాని లేకున్నచో నేమియుఁ జేయఁజాలఁడనుట రూఢి. “కోట శింగరాజు మాటవాసియెగాని గంగమాంబ చేత ఘనతకెక్కె” ననునది లోకానుభవ జ్ఞానవిశిష్టుడగు కవి చెప్పినది గాని వట్టి యూకదంపుకాదు. శ్రీ॥ శే॥ రాఘవరావు పంతులుగారు పొందియుండిన యౌన్నత్యమున కంతటికిని శ్రీ చూడమ్మగారే ముఖ్య కారకులు. “పంతులుగారు సీమకువెళ్ళి వచ్చినారు. వితంతూద్వాహము జేసుకొను వారి కూత యిచ్చినారు. నానా జాతుల వారితోఁగలసి భోజనము చేయుచున్నారు.” అను నీమొదలగు కారణములఁ జూపి “ప్రాయశ్చిత్తమును జేసికొనకున్న బహిష్కరింపఁబడుదు”రని కులగురువులు, బంధువులు, మిత్రులు వేయివిధములఁ జెప్పిరి కాని యాప్రాయశ్చిత్తకర్మమాత్ర మాయింట జరుగలేదు. ఏల? చూడమ్మగారి కిష్టము లేదు. “అనుబిడ్డ లింటికిరారు”—“పోనీ.” “ఇతర బంధువులు మన యింటికి రాకున్నారు!”—“పోనీ! వచ్చుచున్న వారే మన బంధువులు!”—“వంటవాఁడు మానుకున్నాడు!!”—“పో నీ—నే నేంజేయాలి? ఆపని నేనే చేసుకుంటాను” అని యిట్లు ధీరచిత్తయై నిలువఁబడినది కాఁబట్టియే పంతులుగారి “యాటలు సాగినవి”. లేకుండిన యెడ సంగతి సందర్భము లెట్లు మారియుండునో!! ఐదుగు రాడుపిల్లలును ముగ్గురు మగపిల్లలును గల యీ యిల్లాలి కెంత మంది బందుగులుండురో వేరుగఁ జెప్పఁవలెనా! ఇంత పెద్ద బంధుసమాజమునకు ఏకమాన్యయై యుండుట కీసతీమణి యెంతటి యుదారమతియై యుండవలెనో యోచింతుముగాక. వితరణ లేక బంధుప్రీతి కలుగదుకదా! స్వజనప్రీతి కింతవరకు వ్యయము చేయవలసి యుండినను స్వశాఖీయుల నొక కంటఁ గనిపెట్టియుండుట యీమె కొక నిత్యకృత్యము.

“ఆడవాళ్ల మీటింగుల”కు “హాః ఓ” మన్నవారిలో నీమె యగ్రగణ్య.

మహిళాసమాజమునకు మంచి మందిరము నొకదానినిఁ గట్టించి యిచ్చి బ్రహ్మపురి కొక సొమ్ము పెట్టిన దీ చూడమ్మగారే కదా! ఇది యిట్టులుండ విధివశమున నాక బలిపీటలమీఁదనే పెద్ద మనుమరాలి భర్త అపూర్వవ్యాధిగ్రస్తుఁడై పది పదునైదు దినములకు ముందే పరమపదించెను! అయ్యయ్యో!!! మాణిక్యమువంటి బిడ్డ! దాని బ్రతు కేమి కావలెను? ఇది మన సోదరీమణి చూడమ్మగారి చిత్తస్థైర్యము నొక యూపూపి విడచినది. ఆప్తబంధువుల నీకష్ట మాలగోలును బాలగోలు పెట్టించుచుండ నాచార్యపీఠములు మాత్ర "మచ్చా" యనజొచ్చినవి. 'బాలేందులేఖ'వంటి బేబీ యాకారము నానాటికి బడబాగ్నివలెఁ దోచ నారంభించినది. అంతఁ గొంతకాలమునకు ధైర్యోత్సాహములు పొల్లుపోనీక శ్రీ చూడమ్మగారు మరల నా బేబీకి వివాహ మొనరింపించెను. ఈవివాహమువలనఁ బుట్టిన కలవర మింతింతయని చెప్పుటకు వేయినాలుకలు చాలవు. ఇంతవరకింకను ఆయగ్ని రగులుచున్నదియే కాని సంపూర్ణముగాఁ జల్లారినది యనుటకు వీలులేదు. "లెక్కకు రానీయరు కార్య సాధకులు సౌఖ్యంబుల్ మహాదుఃఖముల్" అనునట్లు పుట్టెడుకూటి బలగముగల యీయిల్లాలు గుండెరాయిచేసికొని యుండుట మీదమీద పడియున్నదా? "యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరోజనాః సయత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే" యనునట్లు ఇట్టి గొప్పయింటివారు పూనుకున్నపుడే యే సంస్కారమైనను జక్కఁగాఁ జేయఁబడును. ఇందొక విశేషమున్నది. సంస్కారమను నెపమునఁ బనికిమాలిన పాశ్చాత్య పద్ధతు లీకుటుంబమునం దావగింజంతలైన లేవు. శ్రీమతి రంగనాయకమ్మగారు మొదలగు నాకు బిడ్డలుగాని, శ్రీయుత బలరామదాసుగారు మొదలగు మగబిడ్డలుగాని, తాము మనుమలనెత్తిన వారైనను శ్రీ చూడమ్మగారికి దాసానుదాసులే కాని వేరుకారు. వేషభాషల మార్చుకొనరు, వేడబంబులాడఁబోరు, విర్రవీగి సంచరింపరు. ఇవియంతయును శ్రీ చూడమాంబగారి తరిఫీదేకాని మరియొకటికాదు. ఆంగ్లము చదువలేదను చింతయేల? తెలివితేటలుగలవారి కీబాసల గోస యక్కర లేదుకదా!!

అది యట్టులుండనిండు. బేబీ యిపుడు బిడ్డల తల్లియైనది. శ్రీ చూడమ్మగారి పుత్రులు తమ తండ్రి తాతల కీర్తిని నిలువబెట్టఁగలవారై యున్నారు. శ్రీ రాఘవరావు పంతులుగారు సం. 1923ర ప్రాంతమున దివంగతులైనారు. వారి యైహికాముష్మికసుఖముల కాధారభూతయైన మన సోదరీమణి శ్రీ చూడమ్మగారి కిపుడు రమారమి యరువదినాలుగేండ్లుండును. గాదెవారింటి కజరామరమైన యశము నార్జించిన యీ సాధ్వి, గంజాముమండలమునకు వన్నెవాసులగూర్చిన యీ ధీరచరిత్ర, తన వంశమా చంద్రతారార్కమై వెలయ నితోధిక లోకోపకారిణియై చిరకాలము మనుగాత.

* * *

# అంటరానివాఁడు

శ్రీమాన్ మాడభూషి వేంకటరామానుజాచార్యులుగారు

ఘనమీనాకృతిఁదాల్చి యాదికమఠాకారంబునుంబూని దై
త్యునిఁద్రుంతున్ ఘనమంధరాద్రి భరియింతున్ బూన్కినం చుగ్రభూ
తనివాసంబు నగాధమైతగు సముద్రంబున్ బ్రవేశించి యె
వ్వని కంటంగనురానివాఁడు పరతత్త్వజ్ఞుండుగా కెవ్వఁడో.

బలిచేదానముపట్టువేళ వటురూపంబూని కుబ్జత్వమున్
దోలిరూపించియు, శింశుమారమొరయన్ స్థూలాకృతిన్ దేహమున్
వెలయన్ బెంచుచు మిన్నుముట్టి బహుళోర్ధ్వభాగమున్నిండి లో
కులకంటంగనురానివాఁడరయ నైకుంఠుండుగా కెవ్వఁడో.

హరియెవ్వాఁడు? మురాంతకుండెవఁడు? మాయాశీలుఁ డాచక్రి యా
పరుభూషించెదు కొల్తువంచుఁ గొమరున్ వారించుదేవారినిన్
నరసింహాకృతిఁదాల్చి యుగ్రనఖకోణశ్రేణిచేఁజీల్చి యె
వ్వరికంటంగనురానివాఁడు హరి సర్వజ్ఞుండుగా కెవ్వఁడో.

పురమున్ వీడి మహాటవీస్థలిని సమ్మోదంబునంజొచ్చి శా
బరకాంతార్పితముల్ ఫలంబులవి యభ్యాదాన పూర్వంబుగా
నరుదారన్ భుజియించి భక్తు గుహు, దాయన్ జేరి యెవ్వారికె
త్తఱి నంటంగనురానివాఁడు హరి సర్వజ్ఞుండుగా కెవ్వఁడో.

స్థిరతన్ దైత్యులు దేవతల్ నరులు నంతేవాసులై యేజగ
ద్గురుపాదాబ్జములాశ్రయించుచును సంతుష్టాత్ములై కొల్చి యా
హరినంటన్ సమకట్టుచుందు రతఁడే యంటంగరానట్టి స
త్పరమాత్ముం డికనంటరానినరుఁడెవ్వాఁ డిద్ధరామండలిన్.

* * *



శ్రీమతి గాదె మాడికుడుతమ్మగారు



శ్రీ దక్షిణేశ్వరాలయము
(కలకత్తాయొద్ద)
(డా॥ యస్॥ రాఘవేంద్రరావు,. L.M.&S.)



"గునలచ్చిమి" బొవుంది
(మి॥ క. సూ॥ నారాయణ, రంగూన్)



శ్రీమతి కౌసల్యాదేవిగారు

బికానీర్ సంస్థానమున పాఠశాలా పరీక్షకురాలై యుండి ప్రస్తుతమున లక్నో నగరమునందు క్రొత్తగా నెలకొల్పబడిన సరస్వతీబాలికా విద్యాలయమునకు గౌరవప్రధానోపాధ్యాయినిగా నియమింపబడెను.

(ఛా॥ చి॥ ఆర్. వెంకోబారావు.)

# స్త్రీ మహిమ

శ్రీమతి చిల్కపాటి సీతాంబగారు

ప్రపంచమున నన్ని దైవములకంటె మనుజునకు తల్లి యొక్కడగు దైవము. చరాచరములను ధరిత్రి ధరించినటుల పిండోత్పత్తి మొదలు తన యుదరమందు సంతానమును ధరించుచున్నది యెవ్వరు? తల్లి. అవ్వల దుస్సహవేదన, ప్రాణాపాయస్థితియందు ప్రసవమునొంది, యా సంతానము తనకు కడుపుతీపు గలిగించినదైనను కడుపుతీపియని దలంచి కరుణతో వానిని బోషింప కంకణము గట్టుకొనిన దెవ్వరు? తల్లి. హేయములగు మలమూత్రపురీషాదులకోర్చి వాతపిత్తశ్లేష్మపూరితమై అజ్ఞానచైతన్యమగు శిశువును పొదిగిటనుంచుకొని అమృతతుల్యమగు స్తన్యము నొసంగి వాని కాయువు జ్ఞానము నానాటికి వృద్ధిబొందించు ప్రేమమయస్వరూపిణి యెవ్వరు? తల్లి. మఱియు ప్రాతఃసాయంకాలములయందు శిశువును తొడలపైనుంచుకొని యుగ్గుపెట్టి దుర్బలములై సంకుచితములగు కాలు సేతులకు బలముగల్గి దార్ఢ్యము బొందులాగున నిమురుచు, వానిచేతులు ఫాలతలమున జోడించిపట్టి, దైవమా! నాపట్టికి బ్రహ్మయంత ఆయువు, సరస్వతివంటి విద్య, హిమవంతునంతటి ధైర్యము, వసిష్ఠుఁబోలిన వాక్సిద్ధి, పార్వతీదేవి బోలిన భక్తివైరాగ్యములు ననుగ్రహించి రక్షింపుమని వేడుకొను జ్ఞానమయస్వరూపిణి యెవ్వరు? తల్లి.

ఈ ప్రార్థనలవలన శ్రీ పరమేశ్వరుని విరాట్స్వరూపము, చతుర్ముఖజననము, ఆతని తపోమహిమ, ప్రపంచనిర్మాణము మొదలగు పురాణేతిహాసములు, క్రమముగా దెలియుచున్నవి. సరస్వతి సకలవిద్యాధిష్ఠానదేవతయనియు, విద్యాప్రదాయినియనియు బోధపడుచున్నది. తదుపరి హిమవంతుని యౌన్నత్యమును, అచలత్వమును, ఆతని పుణ్యగాథలతోగూడ ప్రకృతి నైసర్గికము, దృష్టాంతమగుచున్నది. వసిష్ఠు వాక్సిద్ధి నుగ్గడించుటతోన, శ్రీరామచంద్రుని దివ్యగాథలన్నియు భారతపీఠుల చరిత్రములతో ప్రత్యక్షమగుచున్నవి. పార్వతీదేవి జ్ఞానముచేతను, తపోబలమువలనను, భక్తిబలము పెంపునను, లోకేశ్వరుండగు శ్రీ పరమేశ్వరున కర్ధాంగియై శ్రీమన్నారాయణునకు మూలప్రకృతియైన యద్భుత దివ్యచరిత్రలన్నియు తెలియుచున్నవి. అందుచే నా శిశువునకు బాల్యమునుండి దైవభక్తి, తపశ్శక్తి, దేశభక్తి, మాతృపితృభక్తి, సత్కార్యాసక్తి మున్నగు సద్గుణము లలవడుచున్నవి. ఈ సత్కథాసుధాసారము వారి కుగ్గుబాలతోటి యుదరమునజొచ్చి ప్రతిరక్తనాళమునందును ప్రవహించుచుండును. తదుపరి గురువుల శిక్షాబోధలవలన వాని హృదయమునందు జ్ఞానము ప్రకాశమునొంది పండి కుడుగును. ఈలాభ మెవరివలన? విజ్ఞానవతియగు తల్లివలన! కావుననే దేవుని ముఖమునుండి తొలుదొల్తగా "మాతృదేవోభవ" అను శ్రుతి వెలువడినది.

ఇఁక నిట్టి తల్లి విజ్ఞానవతి గానిచో నిఁక నా శిశువు పశుప్రాఁబోలి వృద్ధినొందవలసినదేగదా? అజ్ఞానసాంగత్యమువలన వనాచారము, అలసత, అసూయము మున్నగు దుర్గుణము లలవడి వాని జన్మ నిష్ప్రయోజకమగును. ఇట్టిప్రజ లెంతమందియున్నను దేశమున కేమి లాభమున్నది? పురుషుడు సంతానముకొరకే స్త్రీని వివాహమాడుచున్నాడు. తన సంతతి తామరతంపరవలె వృద్ధినొంది జ్ఞానవంతులు బలవంతులుగా నుండవలయునని ముచ్చటపడుచున్నాడు. అందులకు ముందుగా స్త్రీకి చక్కని విద్యాబుద్ధులుగరపి యుక్తకాలమున ప్రేమతత్వమును బోధపరచి యది తనయం దనురాగవతియనియు ఐహికసంసారశకటమున వహించుటతో తన భారమును సగము వహింపగల సమర్థురాలనియు తెలిసికొనిన పిదప వివాహ మాడవలయును. ఇట్టి వివేకవతికి తనవలన గలిగిన సంతానము పుట్టినది మొదలు తల్లిచే తత్త్వాలోచితములగు బోధనములవలన జ్ఞానవం

తుడై, పౌరుడై సభాప్రవేశమున కర్హుడగును. కృషికుడు భూమిని ముందుగా సారవంతముజేసి విత్తనముల జల్లినట్లు, పురుషుడు తన క్షేత్రమును వివేకవతినిగా నొనర్చుకొని సంతానమును బడయవలయును. ఇట్టి సంతతికి జెందినవారే జ్ఞానవంతులై ధైర్యోత్సాహములతో దేశసేవ, లోకోపకారము, మున్నగు మహత్కార్యాచరణులగుదురు.

ఇట్టి ప్రయోజకులు నగరములందు దక్క గ్రామములలో నూటికొక్కరైన గనుపించుటలేదు. సాధారణముగా నాగరులకన్న గ్రామవాసులకే బలము, ధైర్యము, సాహసము మెండని చెప్పవచ్చును. పుట్టలోనున్న పాము నటులె చేతితోలాగి చంపునంతటి సాహసవంతులు. పొదలోనున్న పులిని చేతి కఱ్ఱతో తల బగులవేయునంతటి పోటుమానిసులు. కాని, వీరి బలము ధైర్యము తమ సేద్యపుపశువులతోపాటు హైన్యములుగా నెన్నదగియున్నవి. ఈ గ్రామముల కన్నడైన యొజ్జపాగాగలవారు వచ్చిరేని, వీరి యూడువారు పురుషులతో ఈ యధికారులు మన కేమి దండుగలు వేయుదురో? యేమి శిక్షలు విధింతురోగాన, వీరి కంటబడక మొగము దప్పించి యెటకేని బోండని పిరికిమందులుబోయుటలోడనే వారు ముల్లుగఱ్ఱలు భుజములపై నైచుకొని బ్రతుకుజీవుడాయని పొలములదారిబట్టుట ప్రత్యక్షముగ జూచుచున్నాము. ఇట్టివారు భూభారకారణులుగాక మాతృభూమి నెట్లు రక్షించుకొన సమర్థులగుదురు. ఈ విషమావస్థల కంతయు కారకులెవ్వరు? విద్యాగంధము, దేశపరిస్థితులు దెలసికొన నేరని వీరి స్త్రీలు గదా? తన కొడుకును బడికిబంపిన పంతులు గొట్టునని తల్లియు, మగని ఉద్యోగిజనులయెదుటికి బంపిన యేమి శిక్షలుచేయుదురోయని భార్యలు వీరిని గంపలువైచి కప్పిపుచ్చుచున్నారు. ఇక వారి జ్ఞానేంద్రియము లెట్లు ప్రకాశించును.?

ఈ స్త్రీలేవిద్యావతులై తమమగవారిని నాగరయువతులవలె దేశసేవకై ప్రోత్సహించినచో వీరు చిచ్చుల పిడుగులవలె విజృంభించి ఆంధ్రమాతృదాస్యము నెన్నడో దీర్చియుందురు! మహాత్ముని యాశయము లెన్నడో ఫలించియుండును. శ్రీరామచంద్రుడు సాక్షాన్నారాయణుడే. శంఖ చక్రములు, శేషుడు, శ్రీమహాలక్ష్మి ఆతనితోడనే భూమిపై యవతరించిరి. ఇన్నియున్నను కేవలము వానరుల సాయముననే గదా దుస్తరమగు సాగరమును దరించినది. తన కార్యములను దేవకార్యమును సాధించినది. అన్ని వ్రేళ్లు గలిపిననే పిడికిలియగును. ఇక స్త్రీలకున్న పట్టుదల, కార్యదీక్ష, సాహసము లంతగా పురుషులయందు గన్పించుటలేదు. ఈ గుణములకు తోడు ఉత్తమవిద్యల వీరభ్యసించియున్నచో పురుషులకు విజయకేతనములై కార్యములు సాధించుటకు తోడ్పడుటకు సందియములేదు. తొల్లి సత్యాదేవి తన విభుండగు శ్రీ కృష్ణభగవానునికి కుడిభుజమై లోకకంటకుడగు నరకాసురుని బరిమార్చినది. సుభద్ర తన మనోహరుడగు విజయునికి సారధియై సంగరమున విజయము కూర్చినది. మంత్రియై ద్రౌపది పాండవుల కాలోచనము చెప్పినది. సంయుక్త రణరంగమున వీరవిహారమొనర్చి తనపేరు నిల్పుకొన్నది. చంద్రావతి తన పెనిమిటి శత్రువులకోడి తిరిగివచ్చుటకు వగచి కోటతల్పులు మూయించి తన వీరాలాపములచే నతనిని మరల శత్రువులపై బురికొల్పి భర్తకు జయముగూర్చినది. పద్మిని అల్లాయుద్దీనుని తనధైర్యచాతుర్యములచే మోసగించి, కులమునకు, దేశమునకు వన్నె తెచ్చినది. నెల్లూరు తిక్కన సమరమున నరాతులచే పరాజితుడై తిరిగివచ్చిన సహించక వీరవనితయగు నాతని తల్లి మఱల తన కుమారుని పరుషవచనములతో కుపితునిజేసి సంగరమునకు సాగనంపినది. సీత, మఱియు సావిత్రి, దమయంతి, శకుంతల, శర్మిష్ఠ, ఆత్రేయి మున్నగు పతీమతల్లులు తమవైదుష్యముచే కోవిదులగు తమభర్తలకు గూడ ధర్మోపదేశకలై యిప్పటికి సమస్తలోకముల వారికి ప్రాతఃస్మరణీయలై దివ్యజ్యోతులవోలె దివ్యపథమున ప్రకాశించుచున్నారు. అట్టి స్త్రీరత్నములకు పుట్టి

నిల్లగుటచేతనే ఈవసుంధర రత్నగర్భయని సార్థక నామమున వ్యవహరింపబడుచున్నయది కాని యిటు వెనుక కాలవైపరీత్యమున కొన్నిసంవత్సరములు స్త్రీజాతి హైన్యతనొంది యుండినది. ఘోషాలు, అతి బాల్యవివాహములు, అక్షరప్రాప్తిలేకుండుట ఇట్టి సంకటములకులోనై కొందరివలన ఆడుజాతి అధమ జాతి యని పెద్ద ప్రవాదము లేర్పడి యుండినవి.

ఇట్టి తన పుత్రికారత్నముల కష్టజీవితముల జూచిన యాంధ్రమాత హృదయము కఱగి యుండబోలు. కన్నీరు మున్నీరుగా విలపించియుండును. కడకు సహింపలేక తన పుత్రులయొద్ద చేరి మీసోదరీమణుల నిట్టి నీచదృష్టులతో జూడక మీతో సమానమగు గౌరవముల మరల నొసంగుడు. ఈ నాయుద్దుల యాడుబిడ్డలు విజ్ఞానవతులై మీకుఁ దోడ్పడుచు నన్నుద్ధరింతురు. తల్లి నుపచరించుతేరి తనయులకన్న తనయలే సుమా యెక్కుడు శ్రద్ధ వహింతు'రని మందలించి యుండబోలు. తన్మూలమున మరల భారతీయ సోదరీమణులు మున్ను తాము గోల్పోయిన విద్య, జ్ఞానము, గౌరవములనుబొంది మాతృదేశమున కున్నతిఁ గూర్ప గంకణము గట్టుకొనిరి. కాని పల్లెటూళ్ల స్త్రీలు కింకను మునుపటి గ్రహచారములు ప్రతికూలముగనే యున్నవి. వారియజ్ఞాన పిశాచములు వదలుటకు మంత్రములు గాని మందులు గాని గనుగొన నెవ్వరు ప్రయత్నించుటలేదు. ఈ దేశమున నగరవాసినులగు విద్యావతులకంటె ప్రపంచ పరిస్థితుల నెఱుంగనేరని పల్లెటూళ్ల స్త్రీలే లెక్కకెక్కువగ నున్నారు. ఇట్టి వీరు తమ పుట్టుకలు కేవలము ప్రజావృద్ధికి మాత్రమే పాల్పరచి తమ కాచరణీయకార్య మిట్టిదని యెఱుంగక ప్రమత్తలై నిష్ప్రయోజనముగా కాలము గడపుచుండుట మిక్కిలి విచారకరమగు విషయముగా నున్నది. లౌకిక వ్యవహారము లెఱుంగని వారగుటచే వీరు గృహిణీధర్మములు గూడ చక్కగా నిర్వహించ కొనజేఁక కొఱమాలిన పనులతో సంసారములకు కొదువలుగూర్చుట—అందుపై కోపించి మగవారు కొట్టుట అలిగి వీరు బావులలో బడుట-యిట్టి యవాంతరములు పల్లెలలో తఱచు జరుగుచున్నవి. ఈయనర్థముల కన్నిటికి వీరి విద్యాహీనతయే ముఖ్యకారణము.

మంచి యుపాధ్యాయినులయొద్ద విద్య నేర్పించిన చో వీరు లౌకికజ్ఞానము నొంది గృహిణీబద్ధముల కర్హలై మాతృదేశము నుద్ధరింపగలరు. ఇందు దేశాభిమానులును, స్త్రీవిద్యాసక్తులును, నిష్పక్షపాతచేతస్కులును, నగు మహాశయులు గమనింపవలసిన విషయ మొండుగలదు. ప్రస్తుతము మనదేశమున ప్రయత్నించుచున్న వితంతూద్వాహములపట్ల ముఖ్యముగ పునర్వివాహమునం దాసక్తిగొనిన బాలికల మాట యటుంచి దేశసేవాచరణ సమర్థలై విద్యాసక్తలగు వితంతువులకు బాల్యముననే భగవంతుడు త్రెంపివైచిన సంసారబంధమును మరల చేసెడు త్రాటితో ముడివెట్టి తిరిగి సంసారసాగరమున నుంచఁ బ్రయత్నింపక అట్టి వారికి ఉన్నతవిద్యలం గఱపి గ్రామములయందు బాలికాపాఠశాలల కుపాధ్యాయినులుగ నియమించి విద్యావిషయమున వెనుకబడియుండు వనితాలోకము నుద్ధరింప దగుదురు. ఇందులకై యఖిల భారతీయ సోదర సోదరీమణులు ప్రయత్నింతురుగాక!



# విశ్వరూప గృహలక్ష్మి

శ్రీమతి వోరగంటి శ్యామలగారు

శ్యామల—అమ్మా! అక్కయ్యేదే?

పార్వతమ్మ—మన కంత అదృష్టమెక్కడమ్మ? ఆ భగవంతుడు నిన్ను మా కిచ్చేటప్పటికే, ఆయనకు కోపంవచ్చింది కాబోలు. అక్కవైనా చెల్లివైనా, అన్నవైనా, తమ్ముడవైనా—అన్నీ నీకు నీవే—నీకు మరెవరూ అక్కచెల్లెళ్లు అన్నదమ్ములు లేరు—మాకు నీకంటె మరొక రెవరూ లేరు.

శ్యామల—ఆ సంగతి నాకు తెలియదటే? ఇప్పుడే కాదూ, నీవు నాదగ్గర నిలుచుండగానే కాదూ, నాతో అక్కయ్య మంచంమీద కూర్చుని మాట్లాడింది?

పార్వతమ్మ—అయ్యో తల్లీ! నేను మీ అక్కయ్యనుచూడలేదే. ఆమె యెలా వుంటుందో ఓమారు చెప్పమూ? విని సంతోషిస్తాను.

శ్యామల—నేను పడుక్కున్నానా.—పడుక్కున్న కొంతసేపటికి నా పక్కలో కూర్చుని "చెల్లాయ్—చెల్లాయ్—లే అమ్మలే—నేను నీ అక్కయ్యను—నా పేరు గృహలక్ష్మి—నాపేర వుత్తరాలు వ్రాశావు కాదూ? అందుచేత నిన్ను చూచి నీతో ముచ్చట్లాడడానికి వచ్చాను. ఇంతేగాక, నేను దేశాలమ్మట, యింటింటికి వట్టినే తిరగడం లేదు. లోకహితవుకోరకు సంచారం చేస్తూవున్నాను. తెలియనివాళ్లకి తెలియచేస్తాను; తెలివిమాలినవాళ్లకి తెలివికలిగేటట్టు చేస్తాను; జబ్బువాళ్లకు మందులు—అవి దొరికేస్థలాలు చెప్తాను; విచారంలోవున్నవాళ్లని నవ్విస్తాను; అలకపొందిన భార్యాభర్తల అలకపోగొడ్తాను; వంటరానివాళ్లకు వంటలు నేర్పిస్తాను; లోకవిశేషాలు అందరికీ చెప్తాను; చెడ్డపనులు ఖండిస్తాను; మంచి పనులను విని, చూచి సంతోషిస్తాను; పిల్లలను, పెద్దవాళ్లను బుద్ధిమంతులుగా చేస్తాను; అందరికీ ఆనందం కలుగజేస్తాను. నేను లేని యిల్లు యిల్లేకాదు. నన్నక్కరలేదన్నవాళ్లెవరూవుండరు" అంది. ఆమె అందం యేమిటనుకొన్నావ్! ఆమె ముఖం చూచేటప్పటికి నా కళ్లు జిగేలుమన్నాయ్. గుండ్రని ముఖం; పెద్దనుదురు; కలవరేకుల్లాటి కళ్లు; నల్లచీమలబారులాంటి కనుబొమలు; సంపెంగపువ్వులాంటి ముక్కు; దానిమ్మగింజల్లాంటి దంతాలు; దొండపండువంటి పెదవులు; గుంటలుగల చెక్కిళ్లు; తెల్లజామిపండువంటి శరీరం; చేతిలో వీణ—చూడడానికి యెంతో ముద్దొస్తూవుందమ్మా.

పార్వతమ్మ—అయితే! నీతో మీ అక్కయ్య యేమయినా మాట్లాడిందా తల్లీ? వోమారు చెప్పు, నే వింటాను.

శ్యామల—మాట్లాడకేం—చెల్లాయ్! నీవు నాకు ముద్దొస్తూవున్నావంటూ నా రెండు బుగ్గలు ముద్దుపెట్టుకుంది. తర్వాత నా బొజ్జచూడు అని బొజ్జ చూపించింది. సినీమాలో తెరల్లాగ ఒకటి తర్వాత మరొకటి, మరొకటి తర్వాత మరొకటి—ఈలాగ యెన్నో చిత్రాలు కనబడ్డాయి. ఆ బొజ్జనిండా కథలే; ఆ బొజ్జనిండా ముద్దులే; ఆ బొజ్జనిండా ముచ్చట్లే; ఆ బొజ్జనిండా వినోదాలే; ఆబొజ్జనిండా అక్కలూ చెల్లెళ్ళే; ఆ బొజ్జనిండా ఔషధాలే; ఆ బొజ్జనిండా కవీశ్వరులే; ఆ బొజ్జనిండా సామెతలే; ఆ బొజ్జనిండా నీతులే; ఆ బొజ్జనిండా అమృతమే; ఆ బొజ్జనిండా ఆనందమే; ఆ బొజ్జనిండా చిత్రాలే; ఆ బొజ్జనిండా ఆటపాటలే; ఒకటేమిటమ్మా—ఇదివుందీ—అదిలేదు అనకుండా అన్నీ ఆ బొజ్జలోవున్నాయి. నాలాటి పిల్లలు ఆ బొజ్జలో ఎందరో ఆడుకొంటూ వున్నారు. చెల్లాయ్! చిత్రాలు చూశావా అంటూ ఆ బొజ్జమూసి నన్ను కోరినవాళ్ల యిళ్లల్లో నేను వుంటాను; నేను లేని యిల్లు యిల్లేకాదు. నేను మీ అందరికీ ఆనందం కలుగజేస్తూవుంటాను అని మళ్లీ చెప్పి, చెల్లాయ్ నీవు నన్ను మరచిపోక నాపేర ప్రతి నెలా వ్రాస్తూవుండమ్మా అందే! అమ్మా.

పార్వతి—సరేలే! మీ నాన్నగారితో చెప్పి మీ అక్కయ్యపేర కథలు వ్రాసుకోడానికి, తెల్లకాగితాలు, మంచి ఫౌంటెన్ కలం తెప్పించి యిస్తానులే. బువ్వ తిందుగాని రా.

శ్యామల—గృహలక్ష్మి అక్కయ్యనుకూడా పిలవవు! మే మిద్దరంకలసి బువ్వ తింటాం?

## మొదటి మెట్టు

ఆ నికుంజాలు పెద్దలై యెరయుచుండ
నాడు, లతలట్లు లల్లుకొన్నా ముమనము,
ప్రణయగీతాల కోయిలపాడుచుండ
నాదుహృదయము దోచుకొన్నావు నీవు.
ఆశుభోదయసమయాన బోసుకొనిన
ప్రేమధన మేమిజేసితో లేమ! నాడు
కొల్లగొన్నట్టి ముద్దులకుప్పలెల్ల
హృదయమునదాచుకొన్నా వెపదిలముగను.

కర్లపాలెం కృష్ణరావుగారు

కన్నులను దేలవైచుచుకాంత! నీవు
బడిలియాపార్శ్వభూమిని బడినయపుడు
హేళనముజేసె ననుగాంచి, యీగులాబి
సంశయంబేల? అడుగుము సత్యమేమొ?
ఈలతలెనాడు "శుభ"మని యిద్దఱికిని
సేసలను జల్లి మనల నాశీర్వదించె,
అంతనవకము లేదేమి? అతివ! నీకు
"నేనెకారణమందువా?" నేటిదశకు.

# నేటి హైందవస్త్రీలు : వారి ఆశయములు

ముడివిల్లి వెంకటనరసింహామూర్తిగారు, బి.ఏ.బి.యల్.

కొలది దినముల క్రిందట నే పంజాబునందొక కళాశాలలో (Modern women are less human than their predecessors) 'ప్రస్తుతపు స్త్రీలు, వారి ముందువారికన్న, తక్కువ దయాదాక్షిణ్యములు కలవారు' అను అంశమును చర్చించినారు. విద్యావంతు (స్త్రీపురుషులు) లనేకు లందు పాల్గొనిరి. వారిలో చాలమంది ప్రస్తుత స్త్రీల నడవడిని ఖండించిరి. వీరు ఉన్నత ఆంగ్లవిద్య నభ్యసించుటవలన, గృహమన్న నెట్టిదో, గృహకృత్యములన్న నెట్టివో మరచిరట. వీరికి (Modern women) ముందువారు గృహమును శుభ్రముగా నుంచుటయందు, పిల్లలను పెంచుటయందు, నిత్యగృహకృత్యములయందు భర్త సౌకర్యముల చూచుటయందు, భర్త కాపత్సమయమందు తోడ్పడుటయందు ప్రస్తుత స్త్రీలకన్న చాల నేర్పరులే. నేటి స్త్రీలకు పిల్లలను పెంచుట తెలియకపోవుటచే ఆయాలకప్పగించి, పిల్లల యారోగ్యమును చెడగొట్టెదరు. వీరు తమ చేతులతో పెంచని బిడ్డలపై ప్రేమ చాలా తక్కువగా యుండునని వేరే చెప్పనక్కరలేదు. అతిథిసత్కారములయందు పూర్వపు స్త్రీలు నేటి హైందవవనితలకన్న మిన్నలే. యూనివర్సిటీ డిగ్రీలను పొందిన వనితలు, తమ భర్త లనారోగ్యముగనున్న, తాము శుశ్రూష చేయుట చిన్నతనముగా నెంచి, నౌకర్ల నందు నియమించి, తాము చేత బేటు పట్టుకొని యేక్లబ్బుకో షికారు వెళ్లుదురు. వీరి పూర్వులిట్టి భర్తృప్రేమ జూపలేదే. భర్తల గౌరవము గాపాడుటకు గదా పూర్వము ఝాన్సి, అహల్య, మొదలగు వీరవనితలు యుద్ధరంగమున కేగిరి. బిడ్డల పెంచుటయందు, గృహకృత్యములందు, భర్తల సౌఖ్యములతమ సౌఖ్యములుగా జూచుటయందు, అతిథిసత్కారములయందు ప్రస్తుత స్త్రీలకన్న వీరి ముందువారు హెచ్చుజ్ఞానము కల్గియుండినందున, పంజాబుకళాశాల నందు "Modern women are less human than their predecessors" అని తీర్మానించుటలో నాశ్చర్యమేమియు లేదు.

క్రిందటి నెలలో కలకత్తాలో లండనునగరమున విద్య నభ్యసించిన యొక బెంగాలి ప్రొఫెసరగు చౌదరీగారి యధ్యక్షత క్రింద "Co-education" హిందూదేశమునకు వర్తించునా యను యంశము చర్చింపబడెను. కొలదిమంది తప్ప మిగతవారందరు ఏకగ్రీవముగా నిరసించిరి. ప్రొఫెసరుగారు Co-education వల్ల చాలా అనర్థము లున్నవనియు, తాము లండనులో నుండుతరి స్త్రీపురుషు లొక్కబడిలో జదువుట చూచితిమనియు, ఒకరినొకరు రాకర్షించుటకు గాను విలువగల నాజూకు దుస్తుల ధరించెదరనియు, ఒకరినొకరు తొందరపాటున ప్రేమించి వ్యభిచరించెదరనియు, అట్లు చేసియు నొకరినొకరు పెండ్లియాడక విడెదరనియు, నిట్లుగా వారిమానము పెండ్లికి పూర్వమే చెడగొట్టుకొనెదరనియు నుడివెను. అట్టి ఇంగ్లాండుదేశమున Co-education యందు విముఖత జూపుచుండ, హిందూదేశమున కట్టిది సరిపడదని నుడివిరి. ఇందుపై అమృతబజారు పత్రికయందు Co-education నిరసించుచు Editorial వ్రాసినారు. మహాత్మగాంధీగారు కూడ కొన్ని కట్టుబాట్లతోగాని Co-education వీలులేదని నుడివిరి. Co-education వల్ల నారీమణులకు విద్యాభివృద్ధికి తోడు Demoralisation కూడ వృద్ధియగును.

మిస్. బార్బరాకార్టులాండు (Miss Barbara Cartland, the Famous social novelist) తే. 22-10-33 దిన అమృత బజారు పత్రికయందు స్త్రీల ఆశయము లెట్టివి (What is woman's sphere) అను శీర్షిక క్రింద స్త్రీలు ఉన్నతవిద్య నభ్యసించి ఉద్యోగములు చేయుటవలన గౌరవము పొందనేరరనియు, స్త్రీలు ఉచితమగు విద్య నభ్యసించి గృహ యాజమాన్యము వహించుటవలన హెచ్చు గౌరవము పొందుదురనియు

వ్రాసెను. తే 29-10-33 దిన ఆపత్రికలోనే శ్రీమతి తిరులతాదేవి, బి.ఏ. గారు (షిల్లాంగు) "ఆడువారి ఆశయములు" (Sphere of women) అను శీర్షిక క్రింద యిట్లు వ్రాసిరి. "హిందూ స్త్రీలకు ఆంగ్లవిద్య చాలా నష్టకారి అని నేను చెప్పినపుడు నా సోదరీమణు లేమి యనెదరో నాకు తెలియదు. ఇంగ్లీషువారి ఆచారవ్యవహారములు, ఉద్దేశములు, మనలో చాలావరకు వ్యాపించుచున్నవి. దాని ఫలితమేమనగా మన దేశాచారములు మనము నేర్చుచున్న విద్యచే నాశమగుచున్నవి. మనము హెచ్చుడబ్బును సినీమాలకు, నాటకములకు, ఖర్చు చేయుచున్నాము. పాశ్చాత్యుల దురభ్యాసములను, సకాల అకాలములలో కూడ (Imitate) చేయ ప్రయత్నించుచున్నాము. మన సంఘమంతయు కర్త అయిపోయియున్నది. మన మీ నాగరికతకే మురిసిపోవుచున్నాము. కాని మనదేశ చరిత్రను చూచినట్టయిన పూర్వ స్త్రీల ఉద్యమములు, స్త్రీలపవిత్రత, నామట్టుకు నాకే ఆశ్చర్యము గల్గుచున్నది. మన పురాణగ్రంథములు వాటిని చాటుచున్నవి. ఆహా, మన దేశాచారములు, మన ఖ్యాతి గోల్పోతిమి కదా. కాని స్త్రీవిద్య అనవసరమని నేనెన్నడు తలపను. మీరు భావించవద్దు. హైందవ స్త్రీలు విద్యవల్ల నాంగ్లవనితలవలె నడువరాదు. ఎట్టివిద్య, పవిత్రమైన గుణములు, తెలివితేటలు వృద్ధిచేయునో, ఎట్టివిద్య దృఢమైన మనస్సునిచ్చునో, ఎట్టివిద్యచే స్త్రీ తన జీవనము తనంతటతాను నిల్పుకొనగలదో అట్టివిద్య స్త్రీల కావశ్యము. నా నిఘంటువునందు నవనాగరికత యనుపదము లేదు. నా కది యొకభయంకరమైన పదము. అది మన జీవితమును, ఆత్మను నాశము చేయును. మనము దాని బారినుండి కాపాడుకొనవలెను. ఇంతకూ మనము స్త్రీలము, పురుషులము కానేరము. అందుచే మనము "స్త్రీలమని" నేర్చుకొనవలెను. స్వాభావికమునకు మనము వ్యతిరేకముగా వెళ్ళరాదు. గృహము మనకు, తక్కిన ప్రపంచము పురుషులకొరకు నిర్మించబడినది. స్త్రీల స్థలమానందకరమైన గృహము. ఇచ్చట ఆమె గృహకృత్యములు, జీవితములో చేయువిధానము, సతీత్వము, మాతృత్వము నేర్చుకొనవలెను. అందువలననే హిట్లరువంటి మహానుభావుడు తనదేశములో స్త్రీలను, ఉద్యోగములనవదలి తమ గృహకృత్యములు నిర్వర్తించుటకు మరలుడని యాజ్ఞాపించిన మనకేమీ ఆశ్చర్యకరముగా నుండదు. మనము శీఘ్రముగా స్వాభావికమునకు మరలవలెను. లేనియెడ మనజాతి శీఘ్రముగా నశించును." ఆంగ్లవిద్య నభ్యసించి, యూనివర్సిటీడిగ్రీపొందిన తిరులతాదేవిగారే ఇట్టి ఉద్దేశమును వెలిబుచ్చినపుడు, అట్టి ఆలోచనలను మనము గౌరవించవలసినదే. ఇప్పుడిప్పుడు ఉన్నత ఆంగ్లవిద్య స్త్రీల కనవసరమని ప్రతివారును గ్రహించుచున్నారు. తిరువాన్కూరులో నిటుపైని స్త్రీలకు డిగ్రీకళాశాలను మూయవలసినదిగా సూచించిరి. Domestic science, యింటర్మీడియటు తరగతియందు బోధించవలసినదిగా కోరిరి.

కావున స్త్రీల కుచితమైన విద్య నేర్పుటకు స్త్రీ సంఘములు పాటుపడవలెను. కేవల మాంగ్లవిద్య నేర్పుటవలన పాశ్చాత్య స్త్రీల దేశాచారములలవడి దేశాచారముల నశింపజేయును. స్త్రీలకు ప్రత్యేక పాఠశాలలు స్థాపించి, వారి కనుగుణ్యమైన విద్యను నేర్పవలెను. అందు ముఖ్యముగా, నూలువడుకుట, కుట్టుపని, అల్లికపని, నిత్యగృహకృత్యములు Domestic science, సంగీతము, Motherhood, హిందీ బోధించవలెను. హిందూమతము, పురాణములు, అనాదినుండి హిందూనారీమణులు దేశమునకెట్టి సేవజేసిరో ప్రతిస్త్రీయు నేర్చియుండవలెను. పన్నెక్కిన పతివ్రతల చరిత్రల లెస్సగా తెలిసియుండవలెను.

# సంక్రాంతి వాసరము

సీ॥ గొబ్బి తట్టుచువేళ గుమిగూడి యందందుఁ దారిచెలంగు సందడి బెడంగు,
రమణీయ కబరీ భరమ్ములో మవ్వంపు దెలిమల్లెలను గూర్చు జిలుఁగు ఠీవి
జాతీయచిత్రకళా తృప్తినొడగూర్చు కలికి ముగ్గుల పూప గరువతనము
ప్రథమాగమప్రాణపతి సుందరాకృతి సిగ్గుమాపులఁజూచు సొబగుకలిమి
తెనుఁగు గుబ్బెతలందుఁ బ్రదీప్తినొంది
యొక యపూర్వ సౌందర్యాభ ప్రకృతినించ
కరము హృదయంగమంబయి గ్రాలుచుండు
భవ్యమోహన సంక్రాంతి వాసరంబు.

ఓలేటి నిత్యకళ్యాణమ్మ.

సీ॥ వదులైన వాల్జడ పాయలనొప్పారు పూలరెబ్బలు క్రింద రాలుచుండ
బంగారుజలతారు పరికిణీముడతలు మునుగాళ్ళఁ బెనఁగొని చెంగలింప
కంఠమండలికాశికాయపూసలదండ "సిల్కు జాకెట్టు"పై చిందులాడ
ఫాలభాగంబునఁ బసలీను 'చాచ్చుక్క' కనులకాటుకపైన కాంతిఁజింద
కరమునందున కుంకుమభరిణబూని
పిన్ని, చెల్లెండ్రు, తమ్ములు వెంటరాగ
పొరుగువారల పేరంటమునకుబిల్వ
అరుగుచుండెను పెండ్లియాశయిన ముగుద.

బి. ఆఁజనేయులు.

# వేఁడికోలు

సీ॥ ద్విముఖము కృష్ణవర్ణము విరూపము త్రినేత్రకము సప్తాయుధధరము సప్త
బాహువు కర్కశపాదంబు లంబాతిలంబగాత్రమ్ము దుర్లక్షణమ్ము
చర్మవస్త్రమ్ము పిశాచాధిపత్యము సింధూరయుతము త్రిశీర్షకమ్ము
విశ్వజలస్నాత మశ్వాధిరూఢమ్ము కుంతాయుధధరమ్ము కుంతలమ్ము
నై నసీమూర్తిమాకు భయానకమ్ముగాన మాకండ్లఁబడక ప్రాంగణములందు
దోసకాయల మెక్కితోడ్తోన రథవరము నధిష్ఠించి చనుమ సంక్రాంతిపురుష॥

హరి రాధాకృష్ణమూర్తి.

# ప్రార్థనము

శ్రీమతి పింజమూరి వేంకటరత్నమ్మగారు

ప్రార్థనమనఁగా మిక్కిలిగా కోరుట. ఎవరిని? ఎందునకు? అనునవి మనము పూరింపవలసిన సమస్యలు. భగవంతునే మనము అడుగవలయును. ఎందునకనఁగా అతఁడే మనకు సమస్తవస్తుసంధాయకుఁడు. నిరంతర దయాగుణుఁడు.

ప్రార్థనమునకు ముందుగా మనము భగవంతుఁడొకఁడున్నాఁడు, అతఁడు ప్రాణులొనర్చు సర్వకార్యములుచూచి వానికి తగిన ఫలముల నొసఁగుచుండును, అను నమ్మకము కలిగియుండవలెను. ఆనమ్మకములేనిదే ప్రార్థనము వ్యర్థమగును. భగవంతుఁడు ఏదోయొక లోకమున, ఒకదివ్య స్థలమున, రత్నఖచిత సింహాసనముపై ఆసీనుఁడై యుండి, మన మొరలువిని, తనకుఁదోఁచిన రీతిని ఫలములిచ్చుచుండునని కొందఱి మతము. కొందఱు "అదెట్లు సరిపడును? భగవంతుఁడు సర్వాంతర్యామి కాన అతఁడు మన హృదయములోనే యున్నాఁడు. అతనిని అక్కడనే పూజింపవలయును." అందురు. మఱికొందఱు (అద్వైతసిద్ధాంతముగలవారు) "మనలోనుండు జీవాత్మయే పరమాత్మ. అది యెప్పుడును పవిత్రమైనదియే. అపవిత్రత దేహమునకుఁగాని, ఆత్మకులేదు. అట్టి పవిత్రాత్మగల మనము, భగవంతునిలో భాగములమె కావున మనమే భగవంతులమని చెప్పవచ్చునుగదా? అట్టిచో ఇఁక ప్రార్థన మెవ్వరికి? ఎందులకు? "సోహంబ్రహ్మ" అను స్థితి చక్కఁగా అనుభవములోనికిఁ దెచ్చుకొనుటయే మనకర్తవ్యము" అని చెప్పుదురు. ఇంకనుంగొందఱు "ప్రార్థనమే మననిత్యజీవనము. మనము సర్వకాల సర్వావస్థలయందును ప్రార్థనము సలుపుచునే యుండవలెను. అదియే మన కాహారము నిద్ర మున్నగునవి" అని చెప్పుచు భౌతిక జీవనమునకై వలయు వస్తువులకు సైతము ప్రార్థనమే చేయుచుందురు. మూఢాత్ములమైన మనము ఎల్లవారి మాటలను నమ్ముదుము. అన్నియు ఆచరింపఁ జూతుము. తుదకు ముసలివాఁడు కొడుకు గాడిద కథవలె చెడిపోవుదుము. హిందూ మతములోనుండు మనము కనఁబడిన రాయి చెట్టు, పుట్ట, నది, సముద్రము—అన్నియు భగవత్స్వరూపములేయని నమ్మి పూజింతుము. సూక్ష్మదృష్టితోఁజూచిన అది తప్పు గాదు. అన్ని స్వరూపములు భగవంతునివే యను జ్ఞానము మనలో నిమిడియున్న అట్లుచేయుట తప్పుగాదు. కాని మూఢవిశ్వాసముతో ఏమిచేయుచున్నామో తెలియకయే ప్రతివస్తువునకు గంధపుష్పాక్షతలర్పించి కడపట ఒకటిరెండు గొప్పకోరికలు గోరి సంతుష్టిఁజెందుచున్నాము. అంతటితో తృప్తిఁజెందక దేవుఁడొకవర్తకుఁడని యెంచి అతనితో వ్యాపారసరణిని మాటాడఁ జూతుము. లంచములీయ యత్నింతుము. "ఓ దేవుఁడా! నీవు నాకీకార్యము సఫలము చేయుదువేని నీకింతసొమ్ము లేక యిన్నికొబ్బరికాయలు బహుమానముచేయుదు" మని పలుకుచున్నాము. మనము తలఁచినకార్యము

సఫలము కాకున్న ఆలంచములెవ్వియు నియ్యక దేవుని నోటిలో మన్నుగొట్టుచున్నాము. పైఁగా నిందించుచున్నాము. క్రైస్తవులు, "తలుపుగొట్టుము. అది నీకుఁ దెఱవఁబడును" అని చెప్పుదురు. అనఁగా నీ వేకోరిక గోరిన, దానిని దేవుఁడు నీ కిచ్చును అని యర్థము. కాని యేసుక్రీస్తు అట్టి యభిప్రాయము పొందినవాఁడు గాఁడు. మన మడిగినదెల్ల దేవుఁ డిచ్చుననిగాదు ప్రార్థనచేయుట. ప్రార్థనమువలన మన తలఁపులు ప్రతిఫలింపనేరవనియే యేసు నమ్మియుండెను. యేసు ప్రార్థనము కోరికలు గోరుటయుఁగాదు, తనలోఁ దా నేదియో మాటాడుకొనుటయుఁ గాదు, భగవంతునితో ముఖాముఖని సంభాషించి అతని దివ్య చిత్తవృత్తి యెట్లున్నదియో తెలిసికొని యటులే జరుగునుగాకయని తలఁచుట, ఆ తలఁపునకు లోపడుట. ప్రహ్లాదుఁడు చెప్పిన తొమ్మిది భక్తిమార్గము లెల్ల తెలుఁగుదురు.

మ॥ తనుహృద్భాషల సఖ్యమున్, శ్రవణమున్, దాసత్వమున్, వందనా
ర్చనముల్, చింతన, మాత్మలో నెఱుకయున్, సంకీర్తనంబున్"

అనునవి.

ఈమార్గములచే జగదీశ్వరు నారాధించుట యొకవిధమైన ప్రార్థనము. ఆ పరాత్పరుని సాక్షాత్కారము గావించుకొని ధ్యానముచేయుట యింకొకవిధమైన ప్రార్థనము. ఇది యన్నిటికంటెను అత్యుత్కృష్టమైనది. తనకుఁ గావలసిన భౌతికసుఖములకు దరఖాస్తు చేసికొనుచు చేయు ప్రార్థన మింకొకటిగలదు. క్రైస్తవులుచేయు ఆకాశప్రార్థన మిట్టిదియే. వారు, "ఆకాశమందున్న మా తండ్రీ! మా దినదినాహారము మాకిమ్ము. మా తప్పులను క్షమింపుము" అని ప్రార్థింతురు. ఇది తక్కువరకపు ప్రార్థనము. ఇట్టిరీతినే మనము పరులకొఱకుఁ జేయు ప్రార్థనములును గలవు. ఇతరులకై ప్రార్థనముచేయుట యెట్లని కొందఱనుమానింపవచ్చును. ఒకరోగి చాల నీరసముగా నుండి వైద్యశాలలోనున్నాఁ డనుకొనుఁడు. అతనికి భగవన్నామస్మరణ మొనర్చుటకైన తగిన బలముగాని, మనస్స్థైర్యముగాని లేదనుకొనుఁడు. అప్పుడు చెంతనున్నవారో, దూరముననున్నవారో, యతనింగూర్చి ప్రార్థనములు సలుపవచ్చునుగదా! ఆ ప్రార్థనములకు సత్ఫలముండకయుండునా? హుమాయూను చక్రవర్తికి చాల జబ్బుచేసినట్లును, అప్పు డాతనితండ్రి బేబరు చక్రవర్తి భగవంతుని ప్రార్థించి, ఆజబ్బు తనకుఁ బంపి వానికి ఆరోగ్యము చేకూర్చుమని కోరినట్లును, అటులే హుమాయూనునకు నెమ్మది గలిగి, బేబరు మృతినొందినట్లును వినియున్నాము. ఇటులే యెన్నియో యుదాహరణములు గలవు. ఈ ప్రక్రియచే భగవంతుని చిత్తము మనము మార్చివేయఁగలమని యెంచరాదు. పరమేశ్వర సంకల్ప మెన్నటికి మనము మార్పఁజాలము. మనము ప్రార్థించి, యాతని చిత్తవృత్తి యెఱిఁగి అతనితో నేకీభవించి, యాసంకల్పమును నెఱవేర్చినవార

మఱుదుము. జరుగునది యెట్లును జరుగక మానదు, భగవంతుని సంకల్పము మార్చ లేము గదా, మన కింక ప్రార్థనము లెందుల కని యడుగవచ్చును. ప్రార్థనమే లేకున్న మన మనస్సులు వికాసము నొందఁజాలవు, పరమేశ్వర హృదయము మెఱుఁగఁజాలవు, మనలను ఋజుమార్గమున వర్తింపఁజేయఁజాలవు, మనలోనుండు అంతశ్శత్రువులను జయింపఁజాలవు, మనకు శాశ్వతానంద మొసంగఁజాలవు.

ప్రార్థనమునకు మూఁడు గుణములు ముఖ్యములు. (1) దృఢవిశ్వాసము—పూర్ణమైన విశ్వాసముగలిగి యిది యిట్లు భగవంతుఁడు సలుపఁగలఁడు అని గట్టిగా నమ్మి ప్రార్థించిన ప్రార్థన మెప్పుడును వీటపోవదు. (2) ఒరులను క్షమించుట—నిన్ను నీ తప్పులను భగవంతుఁ డెట్లు క్షమింపవలయునని నీవు కోరుదువో, యట్లే యితరుల తప్పులకు నీ వితరులను క్షమింపవలయును. ఆ క్షమాగుణమున్నఁగాని నీ ప్రార్థనము సత్ఫలము గాంచనేరదు. (3) కల్మష రాహిత్యము—ప్రార్థనము వేళ మనస్సులో నెట్టి కలంకమును ఉండరాదు. ఒక యిల్లాలు, "స్వామీ! అన్నియు నెఱిఁగినవారికి అమావాస్యమరణము, ఏమియు తెలియని నాకు ఏకాదశిమరణమును దయచేయుము" అని ప్రార్థించినది. అది మనస్సులో కుళ్లుగలిగి చేసినదే గదా?

ప్రార్థనములో భగవంతుని మనము శాసింపరాదు. "భగవంతుఁడా! నీ వీ కార్యము చేయుము" అని పల్కరాదు. "భగవంతుఁడా! నీ చిత్తమునయెడల, ఈ కార్యమునందు నాకు తోడుపడి దానిని నెఱవేర్పు"మని చెప్పుట యుక్తము. లివింగ్‌స్టన్ అను పాశ్చాత్యుఁడు ఆఫ్రికాఖండమునకు వెళ్లి అక్కడి మూఢులను జూచి, "ఓ పరమేశ్వరా! ఈ యంధకారభూభాగములను తేజోవంతముగాఁ జేయుటలో నాకు సాయపడుము" అని ప్రార్థించినాఁడు గాని, తేజోవంతముగాఁ జేయుమని శాసింపలేదు. అతని ప్రార్థనము దేవుఁ డాలించి అతనికి సాయపడినాఁడు. ఆ దేశమునకు వెలుఁగు ప్రసాదించినాఁడు.

ప్రార్థనము ఒంటరిగాఁ గూర్చుండి, యెట్టి అలజడియు కలఁతయు లేకుండ శాంతచిత్తముతోఁ జేయవలెను. అప్పుడే అది మనకు ఆనంద మొసంగును. నిష్కళంక ప్రార్థన మొనర్చి యీవలకు వచ్చిన వారి మొగములు చూడుఁడు. అవి యెంత తేజోవంతములై యుండునో! అన్ని మతములలోను సాంఘికప్రార్థనములు గలవు. అవిమాత్రము సాధారణముగా తగిన ఫలము నీయఁజాలకున్నవి. సాంఘికోపాసనము నడుపువారు మిగుల సామర్థ్యము నొందియుండవలయును. సభలోనున్న యందఱిమనస్సుల నాకర్షించి, యందఱి చిత్తములను తన చిత్తమువలెనే

భగవంతునివంకఁ ద్రిప్పఁగలిగి, యుండుటకిఁ దగినకోరికలతో ఆకాంక్షలతో ప్రార్థింపఁ గలుగువారై యుండవలయును. ఇప్పుడు కొన్నిచోట్ల జరుగు ప్రార్థనములు చాల వఱకు దీర్ఘములై, వినువారికి నిద్రవచ్చు చుండునుగాని, తన్మయత్వము చేకూర్చ కున్నవి. నాకింగ్లీషురాదు. ఒకమహనీయుఁ డింగ్లీషుభాషలో ఉపాసన నడుపుచుండఁగా, నేనచ్చటనుండి యేమి యనుభవింపఁగలను? అట్లు జరుగుచున్నవి. గోష్ఠి ప్రార్థనమని బ్రాహ్మసామాజకులు చేయు ప్రార్థనము లోని శ్లోకముల యర్థము నెందఱు గ్రహించి చేయుచున్నారు? చాల కొలఁదిమందియే కదా? అర్థము తెలియక సంధ్యావందనము చేయు హిందువులకును ఆబ్రాహ్మలకును భేద మేమిగలదు? మొదట ఆరీతిని మాత్రో చ్చారణ మారంభించి, ఆవల అభివృద్ధి పొందిన మంచిదే. దేనిలోనైన సక్రమాభివృద్ధి యున్న అది యాచరింపఁ దగ్గదే.

స్వప్రయత్నమునందు లోపము లేక, పూనినకార్యమునందు దోషములేక, సర్వ జనసమ్మతమైన పనిని ఒకఁ డభిలషించి చేయు ప్రార్థనము ఫలవంతమై యొప్పును. కాని, యెవ్వరికిని సమ్మతముగాని దుష్ట కార్యము పట్టఁజేయు ప్రార్థనము ఫలింపదు. ఫలించినను, అది నిలువదు. ఎప్పుడో యొగ్గే చేకూర్పఁగలదు. దొంగతనము చేయఁ బోవువారు ప్రార్థనము సలిపి, మంచిదినము, మంచినక్షత్రము, మంచిశకునము చూచు కొని మఱి పోవుదురని వింటిని. అదియొక వేళ నెఱవేఱినను, ఈశ్వరచిత్త మదియని యెంచవచ్చునా? దుష్టకార్యములకుఁ గూడ భగవంతుఁడు తోడ్పడునా? ఆకార్యసిద్ధి కేవల కర్మఫలముగాని వేఱొండుగాదు.

ఇటులే ప్రార్థనమును గూర్చి తరచిన కొలఁది నెన్నియో విషయములుగలవు. వానినెల్ల నొక్కవ్యాసములోఁ జెప్పుటకు అవకాశముచాలదు. కాన ముగించవలతును.

—:o:—

## ఏకాదశిమహాత్మ్యము

శ్రీమతి గ. జానకీబాయిగారు

సీ॥ సద్ఘనోద్వాహాది సమయంబులనయినఁ
బడతి యేకాదశిన్ విడువఁజనదు;
అశ్వమేధాది మహాధ్వరములనైన
మహిళ యేకాదశిన్ మానరాదు;
మృతజాతసూతక స్థితుల యందయినను
వనిత యేకాదశిన్ వదల తగదు;
బహురోగపీడిత బాధల యందైన
ప్రమద యేకాదశిన్ బాయవలదు.

గీ॥ నింక, యొక్కాలమందైన నెవ్వరైన
అగణితదురితవనమున కగ్నిజ్వాల
యయి పరంగు నేకాదశి నవనిఁ బ్రతుకు
నంతదాక నుడుగవల దార్యులార!

# నాగరికమా? సతీత్వమా?

శ్రీమతి సి. కమలాబాయిగారు

రాము, చేతిలోనిలువకుండా యేడ్చుచున్నాడు. రామును సముదాయించుచు భర్తవద్దకు వచ్చుచున్నది సుశీల.

“ఛీ, ఛీ దూరముగాతీసుకుపో వాడిని!! యెంత తెలివిమాలినదానవు!! సమయసందర్భాలు కూడ తెలుసుకోవు, యిందుకే నీకు నాకు సరిపోనిది. (చెవులు మూసుకొని) అబ్బబ్బ యేమిఅల్లరి. ముందు యిక్కడ్నించి వెళ్ళిపో” అన్నాడు ఆలోచించుచు కూర్చున్న ప్రసాద్.

సుశీల, రామునితీసుకొని అవతలికి వెళ్ళిపోయింది. కొంతసేపునకంత నిద్రపోయినాడు రాము. సుశీలకు, భర్తకెదురుగా వెళ్ళుటకు సాహసము లేకపోయెను. వసారాలోకూర్చుని రామాయణం చదువుకొనుచుండెను. ఆమె తనధ్యానంలో ప్రసాదువచ్చినదికూడా గుర్తింపలేకపోయినది.

“చాలు, చాలు రామాయణంచదివినదేడ్చినావులే! కాఫీతీసుకురా” అన్నాడు ప్రసాదు కోపంతో.

ఈమాటలువినినదే భయముతో మెల్లగా “మీరేమో ఆలోచించుచున్నారని నే వచ్చుటకిరాలేదు. కాఫీ తయారుచేసి వుంచినాను” అంటూ కాఫీ గ్లాస్ తెచ్చి అతని ముందర పెట్టింది.

“నీముఖంలాగేవుంది ఈకాఫీ” అని కాలితో తన్నివేశాడు, ప్రసాద్.



సుశీలమనసు చాలచిన్నపోయింది. “నా మొఖం యెట్లావున్న యికయేమి. పెండ్లిఅయిపోయినది. యిక నేనెట్లావున్న నేమి? మీరు నాతో నేకాదా కాపురము చేయవలెను?” అన్నది.

“ఓహో ఆటుల తలచుచున్నావా? యెప్పటికీ కాదు. నాయిష్టము. నేను నిన్ను వివాహమాడసమ్మతింపలేదు. మాతలిదండ్రులే నిన్ను నాకు పసునారపయేట గొంతున కురిపోసినారు. నాకు నీకు యెప్పటికీ జత పడదు.” అన్నాడు ప్రసాద్ ఆగ్రహముతో.

సుశీల యిదిఅంతయూ పురుషులకోపమే గాని వేరు కాదని తలచినది. కోపముతగ్గుచేని అంతయూ శాంతపడునని తలచెను. పాప మావాక్యములు నిజమని కలనైనను తలపలేదామె.

నవ్వుచు “యెంతసేపీకోపము? నాకోసరము కాకున్నను రాముని జూచి......”

“నా జన్మపర్యంతము! యెవ్వరిని జూచినను నా మనను మారజాలదు. నన్నెవ్వరు అడ్డగింపజాలరు.” అనుచు అక్కడనుంచి వెళ్లిపోయినాడు ప్రసాదు.

ప్రసాద్ నూతనముగావచ్చిన అడ్వకేటు. సుశీల అతని మేనత్తకూతురగుటచే పెద్దవారు ప్రేమతో చిన్నతనమునందే పెండ్లిచేసిరి. కొన్నిదినములవరకు భార్యనుగూర్చి యెటువంటిచింతయు ప్రసాదునకు లేకుండెను. అతను బి. యే. చదువునప్పటినుంచి అతని మనసు మార్పుకెండెను. అతడు, తనకుతగిన భార్యకాదుకదాయని రేయింబవళ్లు దుఃఖించెడివాడు. ఆఖరుకు తానెటులయినను తనతోపాటు ఆంగ్లమును మాటాడుచుండుకన్యను వివాహమాడ నిశ్చయించుకొనెను. సుశీలకు ఆంగ్లము తెలియదు. ఆంధ్రము చక్కగా చదువగలదు. అత్తవారింటికంపునపుడు తలిదండ్రులుచెప్పిన సతిధర్మమే యామె నాగరికత. ఈ కారణములచే ప్రసాదు సుశీలలకు చాలదూరముండెను.

* * *

“వసంత” బి.యే. ప్యాస్ చేసినది. ఆమెడాక్టర్ కూతురు. ప్రతిరోజూ సంధ్యవేళలయందు టెన్నిస్ క్లబ్బునకు వచ్చుచుండెడిది. ప్రసాదు, ఆమె హృదయమును తనలో కట్టివేయవలయునని చాలప్రయత్నముసల్పెను. గాని అతనికి తగు సమాధానము

దొరకలేదు. ఆరోజు సంధ్యాకాలము. మెల్ల మెల్లన వీచు మందమారుతము ఆక్లబ్బులోని పుష్పవృక్షముల పైబడి సుగంధపరిమళముతో వీచుచుండెను. ఆరోజేలనో ఎక్కువ జనులు లేకుండిరి. తోటలోనున్న కుర్చీలన్నియు ఖాళీగా నుండెను. అచ్చటనున్న ఒక కుర్చీమీద ప్రసాదుకూర్చుని దీర్ఘంగా ఆలోచించుచు ఒక్క నిరాశగల నిట్టూర్పు విడచెను. అకస్మాత్తుగా ఒక మృదువగు కంఠము "మీ రేవిషయమునుగురించి అంతగా ఆలోచించుచున్నారు?" అన్నది.

ఆశ్చర్యముతో "మీరెప్పుడు వచ్చినారు?" అన్నాడు ప్రసాద్.

"నేనువచ్చి పదినిముషములయినది. అయిన 'మీరు' అని నన్ను సంబోధించుట నాకిష్టములేదు" అన్నది. వసంత.

"ఎన్నడును నీవద్ద నాకంతటిచనువు దొరకనందున నేనటుల పిలువజాలకుంటిని. నాకు నీహృదయమున ......"

"కాదు, కాదు నా కోరికలేదు. మీరటుల తలుపవద్దు. మీకు వివాహమయినదిగదా?" అన్నది వసంత.

"వసంతా! నిజముచెప్పుచున్నాను. పెండ్లిఅయిననేమి? నాకు దానిపై ప్రేమలేదు. అది శుద్ధమూర్ఖురాలు" అన్నాడు, ప్రసాద్.

క్రీగంట ప్రసాదునిచూచుచు "మీ రామాటను అనవద్దు. నాకోరికలువేరు. వాటిని మీ రనుసరించుట అసాధ్యము" అన్నది.

"లేదు వసంతా! నీకోసర మెంతకఠిన కార్యమయిననుసరే..."

"........."

"ఏమి వసంతా! మాటలాడవు. నీకొరకై అవసరముగునేని యీదేహమునైనను తునకలు తునకలుగా కోసి యివ్వగలను."

"నిజముగ..."

"అందుకు సందేహములేదు ముమ్మాటికి. నాకోరిక మాత్రం...నన్నునీలో......"

మాటలాడుచుండగనే యిరువురి ప్రేమదృక్కులు యేకీభవించినవి.

౨

వసంతా ప్రసాదులకు వివాహమయిపోయినది. ప్రసాద్ ఒక పెద్దమేడయిల్లు అద్దెకు తీసుకున్నాడు. యింట్లో ఒక కారు, యిరువురు బంట్రోతులు, టీపార్టీలు, డ్రామాలు, సినీమాలు, యింతయేల మాసమునకువచ్చు వరుమానముకన్న వందరూప్యములు యెప్పుడు యెక్కువ ఖర్చగుచుండెను. అయితే యిపుడతనికోరిక నెరవేరినది. వసంత యెప్పుడును ఆంగ్లమే మాటాడును. మేడపైననే ఆమెనివాసము. ఇపుడు సర్వము వసంతచేతిలో నున్నది. సుశీలగృహమునకు వసంత అధికారిణియైపోయినది. సుశీల మొదట ఈ సంగతి వినగనే దుఃఖమువలన రెండుమూడు దినముల వరకు నిరాహారములువదలి ఆలోచనానిమగ్నయయి వుండెను. ఆఖరు కామె ధైర్యము తెచ్చుకున్నది. పతివ్రతల చరిత్రలను తలచుకున్నది. ఏమయిననుసరే పతియే దైవము. వారికి సేవచేయుట నాకర్తవ్యము అని ఆమె తనమనసున నిర్ధారణచేసుకున్నది. ఇక తన సంతోషమునకు రాముడొక్కడే యని తలచినది. ప్రసాద్ సుశీలతో మాటాడుటమానెను. ఆమె, యేమాటయు మాట్లాడకూడదనియు, అటుల మీరిమీరి మాట్లాడునేని పుట్టింటికి వెళ్లిపోవలయుననియు కఠినముగ ఆజ్ఞయొసంగెను ప్రసాదు. ఏమయిననుసరే పుట్టింటికి వెళ్ళనన్నది సుశీల. ఇప్పుడు ప్రసాద్ గృహమునకు సుశీల వంటమనిషి. ప్రతిదినమును వంట కాగనే వసంతప్రసాదులకు మేడమీదికి భోజనము తీసుకొని వెళ్లుటయు, వారిరువురును భుజించగనే నిశ్శబ్దముగా క్రిందికి దిగివచ్చుటయు అలవాటు. రాముకూడ మేడపైకి వెళ్లుటలేదు. ఆమెకుగాని, రామునికిగాని మంచిబట్టలులేవు. ఆమె దినదినమునకును కృశించి శల్యమయిపోవుచుండెను. అయితే

యిపుడామె హృదయము తనస్వామి సందర్శనమాత్రమునకే ఆనందభరితమై యీకష్టములను లెక్కగొన లేదు.

*  *  *

శాస్త్రిగారును వారిభార్య సావిత్రమ్మయు తమ యేకపుత్రికయగు సుశీలకష్టములనుతలచి దుఃఖించుచుండిరి. తమపుత్రికను అనుకొన్నపుడంతయు వారి కడుపులు తరుగుకొనిపోయ్యెడివి. వారు తమ మేనల్లుడగు ప్రసాదును పరిపరివిధముల దూషించెడివారు. శాస్త్రిగారు, ప్రసాదునకు తమపుత్రిని యెటులయినను పంపివేయవలయుననియు, యిక ఒక్కక్షణము కూడ వారింట దాస్యముచేయుచు నుండకూడదనియు ఖండితముగ చాలఉత్తరములు వ్రాసిరి. గాని వాటిని లక్ష్యముచేయకుండా చించి బుట్టలో పారవేయుచుండెను ప్రసాదు. తమ ఉత్తరములకు జవాబు రానందున, తమ పుత్రియొక్క విచారములోనే క్రుళ్లుచుండినసావిత్రమ్మ మంచము పట్టినది. ఆమె వ్యాధి, దినదినమునకు అధికమగుచుండెను. ఇకఆమె బ్రతుకుటయు దుర్లభముగా నుండెను. శాస్త్రిగారే స్వయముగా సుశీలను తోడ్కొనివెళ్లుటకై వచ్చిరి. శాస్త్రిగారినిజూచియు ప్రసాదు పలుకరింపలేదు. శాస్త్రిగారు ప్రసాదు తన్ను లక్ష్యముచేయనందున కోపముతో అతనితో మాటాడనని శపథము చేసెను. సుశీలతో "సుశీలా! మీతల్లి చాలజబ్బుగానున్నది. నిన్ను చూడవలయునని కలవరించుచున్నది. ఇక ఒక్కక్షణమయినను యీ చండాలుని గృహమున నుండవలదు. ఆలసించక నాతోకూడా రా?" అన్నాడు శాస్త్రిగారు.

"తండ్రీ! వారి నన్యాయముగా తిట్టవలదు. అంతయూ నాప్రారబ్ధమేగాని వేరుగాదు. తమకు వయసు మించినందున కోపమధికమగుచుండును. శాంతింపుడు. ఒక్కమారు నేను వారివద్దకువెళ్లి సెలవందివచ్చెదను." అన్నది సుశీల శాంతంగా.

"ఏమనుచున్నావు! ఇంకా ఆపాపాత్ముని కాళ్లా పట్టుకొనకోరుచున్నావా? వద్దు! వద్దు!" అన్నాడు శాస్త్రి. గాని ఆమాటలు వినకుండగనే మేడమీదికి వెళ్ళింది సుశీల. ఆసమయమున వసంతప్రసాదులు గదిలోకూర్చుని మాటలాడుచున్నారు. "నేను ఇప్పుడు ఇక్కడికి వచ్చినందులకు క్షమింపుడు" అనుచు లోనికి వెళ్లింది సుశీల. ఏవగింపుతోడను, కోపము తోడను సుశీలవంక చూచింది వసంత.

సుశీల తనభర్తపాదములకు నమస్కరించి వినయముతో "నాథా! నాతల్లి జబ్బుగానున్నందున నా తండ్రిగారు నన్ను తోడ్కొనిపోవ వచ్చియున్నారు. ఒక వారముదినములు మాత్రము పుట్టింటికి వెళ్లివచ్చుటకు అనుమతి యొసంగవలయును." అన్నది.

ప్రసాదు కాళ్లను బలవంతముగా వెనుకకు లాగుకొని కోపముతో "పొమ్మ నన్నడుగుటేమి? మరలనీవు రావలయునని యెవరు కోరిరి?" అన్నాడు. ఈమాటలు వినగనే పక్కున నవ్వింది వసంత. అవమానము, దుఃఖము భరింపలేకపోయినది సుశీల. ఆమె కన్నుల నుండి నీరు కాలువలై స్రవింప మొదలిడెను. తన బసను మేడనుండి దిగిపోయింది సుశీల. వసంత యేమరియున్న సమయమున ప్రసాద్, సుశీల వెళ్ళిన త్రోవనే చూచుచుండెను, యెటులనో వసంత అతనిని చూచి దిగ్భ్రమ జెందినది. 'భార్య భర్త లిరువురు యేకమయిపోవుదురా యేమి' అనుకొనుచుండెను. శాస్త్రిగారును సుశీలయు ప్రయాణ సన్నద్ధులయిరి. కాని రాముని పుట్టినదాదిగా పెంచుచున్నదాదియగు గంగిని వదిలి రాముండజాలకుండెను. శాస్త్రిగారు తమ పుత్రికతో ప్రయాణమయిరి.

## 3

మంచముమీద లేవ శక్తిలేకుండా పండుకున్న సావిత్రమ్మ యెండిపోయిన మల్లెపుష్పమువలె నున్న తన పుత్రికను ప్రక్కన కూర్చుండపెట్టుకొని ఆమె తలను చేతులతో తడవుచు అంతులేని కన్నీళ్ళుకారుస్తున్నది. మెల్లగా ఆమె సుశీలతో "అమ్మా సుశీలా! నాముద్దుల తండ్రి రాముని తీసుకొని

రాకూడదా? నాతండ్రి నాకండ్లయందని నే వున్నాను. అయ్యో! నాతల్లీ, నాకడుపు మండుచున్నదే. నిన్ను యెంతో అద్దుముద్దుగా పెంచి వున్నధనమంతయు వెచ్చించి నిన్నేమో ఉద్ధరిస్తాడని ఆ పాపికి, ఆ ద్రోహికి, నాయేకరత్నాన్ని, అర్పిస్తిని. అదుష్టు డిట్లు నాబిడ్డ సంసారమును గూల్చునని...." ఆమె మాటాడజాలకపోయెను. ఆమె కంఠము అస్పష్టమైనది. మరి కొంతసేపునకు నిట్టూర్పువదల చాల ప్రయత్నముతో పెదవి కదలించెను గాని మాటాడజాలకపోయెను.

"అమ్మా! నీవు వూరకవుండుము. జరిగిన విషయములగూర్చి చింతింపకుము. మానవులకు కష్టసుఖములు సమానములు. ఒకరి కష్టసుఖముల కొకరు కారణులుకారు. అంతయు వారి వారి కర్మఫలము. ఎంతప్రాప్తమో అంతే నిలచును. అందుకై చింతించిన యేమిప్రయోజనము. నీదేహము చాలాబలహీనముగా నున్నది. విశ్రాంతి పుచ్చుకొనుము." అన్నది సుశీల.

ప్రేమతోడను ఆశ్చర్యములోడను ఆగుంటలు పడిన కన్నులు తెరచి సుశీల వంక చూచినది సావిత్రమ్మ. మరి కొంతసేపునకు ఆమె కన్నులు మూసుకున్నది. డాక్టరులందరు ఆమెను చెయివదలుకొనిరి. ఆమె హృదయమున మనోవ్యాధి నాటిపోయినది. ఇక ఆమె జీవించునను ఆశలేకుండెను. గాని సుశీల వచ్చినప్పటినుంచి తల్లికి యేమరకుండ సేవ చేయుచుండెను. గాని సుశీలవచ్చిన అయిదారు దినములకంతయు ఆమె ఈలోకమునువదలి వెళ్ళిపోయెను. సుశీల యిప్పుడు పూర్తిగా దిక్కులేనిదై పోయెను. ఆమె రెండుమూడు మాసములవరకు తల్లి మరణమునుగూర్చి దుఃఖించుచు పుట్టింటనే నిలచి పోయినది.

◆ ◆ ◆

సుశీల యెంత సద్గుణవతియైయినను, సవతియను మాత్సర్యము వసంతకులేకపోలేదు. సుశీల పుట్టింటనే యుండిన బాగుండునని తలచింది వసంత. యెటులయినను సుశీలను తనయింటిగడప మెట్టించకూడదని అనేక యుక్తులను యోచించుచుండెను.

సుశీల ప్రయాణమయిన దినమున ప్రసాదుకేలనో మనసు నెమ్మదిగా లేకుండెను. కోర్టునకు వెళ్ళిన కొంతసేపటికంతయు గృహమునకు వచ్చివేసెను. ఉస్సురుమనుచు టేబిల్ కెదురుగుండావున్న కుర్చీపై కూర్చొనెను. అతనికి టేబిల్ పై ఒక ఉత్తరమగుపించెను. ఆవుత్తరములోని అక్షరములు యెక్కువ అనుభవములేనివారు వ్రాసినట్లుండెను. ఆ అక్షరము లతనికి పరిచయములేనివిగ నుండెను. అజాబు విప్పి చదివెను. అతనికేమి స్ఫురింపలేదు. మరల చదివెను. సూత్కృగ్రాహియగు అతనిబుద్ధి మందగించెను. అతనికన్నులు కోపముతో యెఱ్ఱబారెను. ఆలోచనాశూన్యుడయ్యెను. ఆ జాబులోని విషయమిట్లుండెను.

"యెంతఓర్పుగల స్త్రీ యయినను యెంతని ఓర్చుకొనగలదు. మీరు కొద్దిదినముల కయినను నాతో కాపురము చేయుదురని తలంచితిని గాని ప్రయోజనము లేకపోయెను. నిజమునకు మా తల్లికి జబ్బులేదు. మీతోనుండ యిష్టములేకయే నే వెళ్ళిపోయితిని. యిక నా విషయమును గూర్చి మీరొక్క సంగతియు విచారింపవలసిన పనిలేదు. మీ రిట్లు మీ యిష్టప్రకారము వివాహముచేసికొంటిరో అట్లే నేను నాయిష్టప్రకారము ముండగలను. మీరు యిక మీదట నన్ను మరచిపోవలయునని కోరుచున్నాను.

సుశీల."

అజాబును కోపముతో గునకలు తునకలుగా చించిపారవేసెను. పండ్లు పటపట కొరుకుచు, "ఓసీ! మాయలాడి, చండాలీ, నీకు పతిసేవ యొకటి తక్కువయా? ఎంతటి టక్కులాడివే. నీకు తగిన ప్రాయశ్చిత్తము ముందేచేసివేసితిని. ఇక ఛీ! ఛీ! నీమొహము మేల చూడవలయును. ఎప్పటికిని చూడను." యనుచు క్రోధమున పిచ్చివాడైయుండెను ప్రసాద్.

౪

'సుశీల తనభర్తను విడనాడినదట' యనుసంగతి ఆ వూరును, ఆ వూరికద్దనున్న గ్రామములను అలుము



ఈ ఛాయాపటమునున్న వధూవరులు ఆగర్భ శ్రీమంతులగు నార్యవైశ్యులు. కా॥ ఏలూరు. వధువు శ్రీమతి వెంకట పార్వతీ నాగలింగమ్మగారు. వయసు 18సం॥ విశాల ధర్మకర్తలని విఖ్యాతినొందుచున్న శ్రీయుత కేసరపల్లి ఆంజనేయులు శ్రేష్ఠిగారి పుత్రిక. వరుడు, శ్రీయుత ఊమ్మా జనార్దన శ్రేష్ఠిగారు. వయసు 22. వెంకటరత్నం శ్రేష్ఠిగారి నాల్గవపుత్రుండు. లయోలా కాలేజిలో ఇంటరుక్లాసు విద్యార్థి. తమ బాలికకీ పునర్వివాహము చేయుటయందు శ్రీఆంజయ్యగారు చూపిన ధైర్యమమోఘము. ఆర్యవైశ్య సంఘమందు స్త్రీ పునర్వివాహ విషయిక భిన్నాభిప్రాయమునగల తీవ్రత, యీవివాహమూలమున చాలవరకు చల్లబడినదియని వినుటకెంతయు సంతోసమగుచున్నది.



శ్రీమతి విద్యాగౌరీరమణాబాయి నీలకంఠగారు

ఈమె అహమ్మదాబాదు పురపాలకసభకు సభ్యురాలుగా ప్రజలచే ఎన్నుకొనబడిరి. గొప్ప సంఘసంస్కర్త్రి.



శ్రీమతి సవితాబెన్ త్రివేదిగారు

అహమ్మదాబాదు శారదామందిరమునకు చెందిన విదుషీమణి. కొలది దినముల క్రిందట జరిగిన మునిసిపలు ఎన్నికలలో నీమె అహమ్మదాబాదు పురపరిపాలక సభా సభ్యురాలుగా ఎన్నుకొనబడిరి.



కీ॥ శే॥ మద్దులకామ్నమ్మగారు

పెద్దకాలము బ్రతికి శ్రీయుత చిన్నరాజాగారు మొదలగు నల్వురు కుమారులను సుభద్రమ్మగా రను నొక కుమార్తెను గాంచి శ్రీయుత మద్దుల రామయ్య శ్రేష్ఠిగారి నైహికాముష్మిక సుఖకారణభూతరై ధన్యాత్మురాలను కీర్తిగాంచిన యిల్లాలు. ఆర్యవైశ్యకులాలంకార. కాశీరామేశ్వరాది యాత్రలన్నియు జేసిన పుణ్యశీల. తనపేర, నిచటనున్న ధర్మసంస్థలన్నిటియందును వేనవేలు శాశ్వతధర్మము లొనరించి తన కీర్తి యాచంద్రతారార్కం నెలకొనఁజేసికొని కైలాసమలంకరింపబోయిన సాధ్వీమణి. ఏలూరులో ఈమె కట్టించిన ధర్మసత్రము బహుజనోపయోగకరమై వెలయును. ఈమెపేర పాలున కొకతూరి వేయిమంది బ్రాహ్మణ వైశ్యులు షడ్రసోపేతముగా భోజనము చేయుట కేర్పాటు చేయబడియున్నది.



'వియోగిని'



"మేరీ జాసీ"



"భవతి భిక్షాం దేహి"



జంతుశాల

—మిస్టర్ సూర్య, సైదాపేట.

కొన్నది. పలువురు పలువిధములుగా అనుకొనదొడంగిరి. కొందరు "అయ్యో పాపము యిది యెవరికో ఓర్వలేనివారి పన్నాగమే కాని వేరుకాదు. ఆమె మహాసాధ్వి, ఆమెనన్న వారి కన్నులుపోవును" అని అనుకొనుచుండిరి. ఈసంగతి ఆఖరుకు శాస్త్రిగారి సుశీలకు కూడ తెలిసినది. తల్లి దుఃఖముతో క్రుంగుచున్న సుశీలకు పిడుగువంటి యీవార్త ఆమెను చాలా ముంచేసింది. ఆమె యీనిందను భరింప లేకుండెను. ఆమె యెటులయినను భర్త సన్నిధానమునకు వెళ్లిపోవలయునని తలచినది. యిప్పటి కామె పుట్టిల్లుచేరి 4 మాసములు కావచ్చినది. ఇంతవరకు ఆమె భర్తృ గృహమునకు తండ్రిని తోడ్కొని పొమ్మని అనేకమారులు వేడుకొన్నది. శాస్త్రిగారా మాట వినినప్పుడంతయు కోపోద్దీపితులయి మండి పడుచుండెడివారు. "ఇంకను నీకు అతనిని చూడ వలయునని కోరికయున్నదా? అతను నిన్ను లక్ష్యము చేయడు. నాప్రాణ మున్నంతవరకు నీ కేమాత్రము కొదువజేయను. అతని గృహము నిన్ను త్రొక్కనివ్వను నేనును త్రొక్కను." అనెను శాస్త్రిగారు.

ఆమె ఇక తండ్రిని వేడుట నిష్ప్రయోజనమని తలచినది. ధైర్య మవలంబించినది. పతి సన్నిధి కెటులయినను వెళ్ళిపోవలయునని పలువిధముల ఆలోచింప దొడంగినది.

• • •

శాస్త్రిగారింటికిని స్టేషనునకును మూడుమైళ్ళ దూరము. రాత్రి పన్నెండుగంటలు. అమావాస్య గాఢాంధకారము. యెదురుగానున్న వస్తువు కనిపించనంతటి చీకటి. అక్కడక్కడ మునిసిపల్ దీపములు మినుక్కు మినుక్కు మనుచున్నవి. ఆ అంధకారములో నిలువున తెల్లని ముసుగు వేసుకున్న ఒక స్త్రీ, వీధులను, గృహములను దాటి ఒంటరిగా అడవి మార్గముగా స్టేషనునకు వెళ్ళుచుండెను. ఆకాశమున దట్టమయిన మేఘము లావరించినవి. దుమ్ముతో నిండిన గాలి కన్నులు తెరువనివ్వలేదు. క్రమక్రమముగా గాలి, వాన పెద్దదయిపోయినది. ఆ అబలకు యెటుపోవుటకు దారి తెలియలేదు. ఆ చిమ్మచీకటిలో ఒక పెద్దవృక్షమునకు కొట్టుకొన్నది ఆమె. మరియు ఆమె దేహమున బలమగు గాయములు గలిగెను. కొంతసేపునకు ఆమె మూర్ఛజెందినది. అటు పిమ్మట యేమయ్యెనో ఆమెకు తెలియదు.

వేకువఝామున నాలుగైదు గంటలయివుండును. వాన తగ్గిపోయి కొంచెము వెలుగుగ నుండెను. అచ్చటచ్చట చిన్నచిన్న వాన నీటిగుంటలుండెను. ఆఅడవి మార్గముగా ఒక రెండెడ్లబండి పోవుచుండెను. బురదలో చక్రములు సరిగా నడవకుండుటచే బండితోలు రైతు బండినుండి దిగి చక్రములను చేతులతో బలముగా త్రోయుచుండెను. అకస్మాత్తుగా అతని కొకమూలుగు శబ్దము వినవచ్చెను. శబ్దము వినిన దిక్కునకే వెళ్లిచూడగా సుశీల మాటాడజాలక పడియుండెను. ఆమె దేహము రక్తమయముగానుండెను. ఆమెను చూడగనే రైతు మనసు నీరైపోయినది. అతను ఆమెను తనబండిలో పరుండజేసికొని దాపుననున్న గ్రామములోని ధర్మాస్పత్రిలో ఆమెను చేర్చినాడు. అటు పిమ్మట కొద్దిదినములకంతయు ఆమె దేహము ఆరోగ్యముజెందినది గాని ఆమె యిప్పుడు చాల విరూపియయిపోయినది. యిప్పు డెవ్వరు ఆమెను గుర్తింపజాలరు. శాస్త్రిగారు తమ పుత్రిక కనుపింపకపోయిన నాటినుండి ఆమెను చాలా వెదికిరి గాని ఆయనకు ఆమె జాడ తెలియకుండెను. తన భార్యతోడ తనబిడ్డయు చెల్లినదని నిశ్చయించుకొనిరి.

గంగి, వసారాలో రాముని ఒళ్ళోనుంచుకుని కూర్చున్నది. రామునివంక విచారముతో చూచుచు "నాయనా! రామూ, నీవెంత దురదృష్టవంతుడవు. నీవు పుట్టినదాదిగా యేముచ్చటల నెరుగవు. నాధర్మ లక్ష్మి సుశీలాదేవి కెంతటి అవమానము గల్గినది. ఆమె ఈసంగతి విని యేమయినదో, నాతల్లి! ఆమె సంగతి తెలియకున్నది. అయ్యో, నాతల్లి ఈసంగతి విని తనప్రాణము నేమయినను..." దుఃఖము ఆపుకొన

జాలక యేడ్చెను. గంగినిజూచి రాముకూడ యేడ్చుచుండెను.

ఒక యువతి నిలువుముసుగుతో లోనప్రవేశించి "గంగీ! బాగున్నావా? యేది నాపుత్రుని ఒక్కమారిటు తెమ్మ"అన్నది.

(ఆశ్చర్యముతో) "ఎవరు, యెవరు, యేమి నేను కలగనుచున్నానా? లేక నిజమేనా? అమ్మా! ప్రాణములతో నున్నారా? మీరేనా నాయజమానురాలగు సుశీలాదేవిగారు. అయ్యో! యెంతటి గతిపట్టినదమ్మా! ఇదియేమి రూపమమ్మా, యింతటి మలినపుగుడ్డలు, యిట్టిదశను జూచుటకా నేనింకను బ్రతికియున్నాను." అన్నది దుఃఖ మాపుకొనజాలక గంగి.

(దీర్ఘముగా శ్వాసమువదలి) "గంగీ! నాకు మరణము లేదుకాబోలు" ననుచు రాముని ఆలింగనము జేసికొని కళ్ళనీళ్ళతో అతనిని ముద్దిడుకున్నది. "గంగీ! పోనీ. అయ్యగారు యెట్లున్నారు. ఆరోగ్యమేకదా? చెల్లి వసంత బాగున్నదా"అన్నది, సుశీల.

"ఇంకెక్కడి చెల్లి తల్లీ, నీకొంపకూల్చిన చెల్లి. అయ్యగారి ప్రాణం తీసేస్తున్నది. ఇప్పుడు గొప్ప గొప్ప వక్కీళ్ళకే వరుమానాలు తగ్గిపోయినవి ఇక మన అయ్యగారి సంగతి యడుగవలయునా? చాలా మందికి అయ్యగారు ఋణపడియున్నారు. అదే చింతలో మనోవ్యాధిగల్గి చాల కృష్కించిపోవుచున్నారు. ఒకరిద్దరు నౌకర్లను తీసివేయవలయునని కోరుచున్నారు. గాని వసంతమ్మ ఒప్పుకోదు. ఇచ్చటి స్థితులు యిట్లున్నవి" అన్నది గంగి.

విచారంతో సుశీల "ఈకష్టసమయమున నే నేవిధముగా వుపకారము చేయగలను? గంగీ! నేనొక దాసిదాననియు, వారింటిలో వంటచేయుదుననియు, నాకు భోజనము మాత్రము చాలును, డబ్బు అక్కర లేదనియు చెప్పినచో నన్ను వారింటిలో చేర్చుకొనగలరా?" అన్నది.

"తల్లీ! యెంత పిచ్చిదానవు, నీయింటికి నీవే దాసిదానవా? స్వామీ! నీవే యీతల్లిని రక్షించు. స్వీకరించ లేమి తల్లీ, అయితే నే నామాటలు వారితో చెప్పజాలను." అన్నది గంగి.

"గంగీ! నీకు చాలాపుణ్యము. నిన్నెప్పటికి మరువను. యెటులయినను వెళ్లిచెప్పవలెను అన్నది" సుశీల. కడపట గంగి చెప్పక తప్పినదికాదు. ఈసంగతి వినగనే పదిరూపాయలాసమయమున మిగులునని సంతోషించి ఆమెవంటమనిషిగానుండుటకు ప్రసాద్ ఒప్పుకొనెను. సుశీల అచ్చట వంటమనిషిగానుండ మొదలిడెను. ఆమె సదా ముసుగుతో నున్నందున ఆమె ఉత్తరహిందుస్థానపు యువతి యని భావించెను కొన్ని దినములవరకు ప్రసాద్. వసంతకు మాత్ర మామాటయందు విశ్వాసములేదు. ఆమెయందు సంశయమే వసంతకు.

◆ ◆ ◆

రామునకు నాలుగైదు దినములుగా తీవ్రజ్వరము వచ్చుచుండెను. అతను కన్నులు తెరువకుండా చాపపైపరుండి యుండెను. అతని దేహము వేడిచే పెట్లిపోవుచుండెను. సుశీలకు కాళ్లుచేతులు కదలలేదు. ఆమె తన పుత్రునివీడి వెళ్ళలేకుండెను. ఆమె వేళకు వంటకూడ చేయలేకుండెను గాని వసంతయొక్క భయంకరమగు అధికారము ఆమె హృదయాన్ని బెదరించుటచే ఆమె యేదో ఒక విధముగా వంటచేసెడిది. కాని ఆమె వేళకు అన్నాహారములు తీసుకొనెడిదికాదు. జ్వరబాధతో పరుండియున్న రాముని ప్రక్కన సుశీల కూర్చున్నది. తన గృహములోని యిబ్బందులచే ఆరోజు గంగి రాజాలకుండెను. రామున కాదినము మందుతెచ్చి యిచ్చువారును లేకుండిరి. ఆరోజు సుశీలకు, దేవుడు లేడా యేమి అనిపించినది. రాత్రి తొమ్మిదిగంటలు, కారుశబ్దము వినవచ్చినది. యెవరో బూట్సులతో టక్కుటక్కున దిగుచున్న చప్పుడు వినవచ్చినది. సుశీల వారిని చూడగనే గ్రహించినది—వారు సినీమాకొరకై ప్రయాణమగుచున్నారని. వసంత సిల్కుచీర కట్టుకున్నది, మొఖమున పౌడర్ వేసుకున్నది, పైటమీద

త్రోచి, చేతిలో కర్రపు నుంచుకొని మేడమెట్లు దిగుచుండెను. ఆమె వెనుక ప్రసాద్ సూటు బూటులతో కూడా దిగుచుండెను. సుశీల తాళజాలక పోయెను. ఆమె ఆత్రముతో వారి కెదురుగా వెళ్ళి,

“అయ్యా! తమబిడ్డడు మరణావస్థలో నున్నాడు. దయలేదా? అదిగో అచ్చట చూడుడు. ఆబిడ్డడెంత దిక్కులేనివాడుగా నున్నాడో. రెవ్వరు లేక కడుపునపుట్టిన బిడ్డను, తండ్రియయ్యు మీరు యీ యవస్థలో వదలి ఆనంద మనుభవింప వెళ్ళ మనసెటుల గల్గుచున్నది. యీ ఒకరోజాగుడు. ఆబిడ్డకు తగు చికిత్సలు చేయుడు.” అన్నది.

ప్రసాదా కంఠము వినగనే సర్వము మరచి పోయెను. అతని హృదయము కరగిపోయెను. “వసంతా! యీరోజు నే రాజాలను, నన్ను క్షమించు” అన్నాడు దీనంగా.

“యేమనుచున్నారు? మన అన్నమును బ్రతుకు ఒకదాసిదాని మాటలకా మీరు బెలిపోవుచున్నారు. ఇంతటి పిరికిపందలని ముందే తెలిసినచో...”

“తెలిసినచో యేమిచేయుదానవు?” అన్నాడు.

కోపముతో “మిమ్ము పెండ్లియాడకుందును” అన్నది.

“పెండ్లియాడకుందువా? యిదియా నీ నిర్మలమగు ప్రేమ......సరేరా పోదము” అన్నాడు.

“స్వామి! స్వామి ఈరోజు మాత్రమాగుడు.” అన్నది సుశీల.

“ఛీ, దూరముగా పో! దాసి దానికింతనోరా? ఇంత అధిక ప్రసంగమా? లే ఛీ నీ వీయిల్లు వదలి వెళ్ళిపో” అన్నది వసంత కోపావేశముతో. మారు మాటాడజాలక పోయెను ప్రసాద్. భగ్నహృదయముతో వెనుకకు మరలినది సుశీల. వసంతప్రసాదులు కారులో కూర్చున్నారు. చూచుచుండగనే అదృశ్యమయిపోయినది కారు.

సుశీల ఒళ్ళోవున్న రాముకాళ్ళు చేతులు చల్లబడిపోయినవి. సుశీల హృదయం రాయయిపోయినది. ఆమె ఒక్కింతసేపు రెప్పవాల్పకుండ తనపుత్రుని వంకచూచుచుండెను. ఆమె తన కంటినీళ్లతో ఆ బాలుని స్నానమొనరించినది. మెల్లగా బాలుని క్రింద పరుండజేసినది. మేడపైకివెళ్ళి ఒక ఉత్తరము వ్రాసి ప్రసాద్ మంచముపై నుంచినది. ఆమె వీధి తలుపుతీసుకొని యెచ్చటికో వెళ్ళిపోయింది.

• • •

రాత్రి ఒంటిగంటకు ప్రసాద్ వసంతలు గృహము జేరిరి. వసంత అలసినదై రాగనే మంచముపై పరుండి నిద్రించెను. గాని ప్రసాదునకు సంసారబాధలును, ఋణబాధలును హృదయమును వేధించుచుండెను. అతని కంటికి నిద్దుర రాకుండెను. అతను మంచముపైపరుండి ఇటునటు పొర్లుచుండెను. అతనికి ఒక ఉత్తరము ఆమంచముపై దొరకెను. అతనా ఉత్తరమును వెలుగులో నిట్లు చదివెను.

ప్రాణేశ్వరా!

నాకు గలిగిన అపాండమగు నిందను భరింపజాలక పోయితిని. మీకు గల ఋణబాధలనుగూర్చి వింటిని. నామనసుకు చాలచింత గలిగినది. గాని మీరు నన్ను చూడనని శపధము చేసినట్లు వింటిని. రెటులయినను తమకు సేవచేయుచుండవలయునని మారు రూపమున పంటమనిషిగానుంటిని. నాపుత్రునితో ఆనందించుచుంటిని. అదియు ఈశ్వరునికి సమ్మతము గాక పోయినది. నాబిడ్డను తన సన్నిధికి తోడ్కొని వెళ్లెను. మీరును నన్ను త్యజించితిరి. నాకిక యీ లోకమున రేమున్నది. నాజీవితము వ్యర్థమేకదా? నాపుత్రుని జేరవెళ్ళుచున్నాను. ఆఖరుసంగతి. మీకు అందిన ఉత్తరములో నాఅక్షరములవలె యెవరో వ్రాసిరేకాని నాకు తెలియదు. నేనునిర్దోషినని మీ హృదయపూర్వకముగా నమ్ముడు. ఇక సెలవొసంగుడు. వందనములు.

ఇట్లు
సుశీల.

ఈ జాబు చదువగానే ఒక్కసారిగ అతనికొరకై సుశీల పడిన కష్టములును ఆమె ప్రేమయు స్మృతి కగ్గెను. అతను కొన్నిదినములకు పూర్వమే ఆలోచించి ఆమె నిర్దోషియని స్థిరము చేసుకొనెను. తన యింటిలోనున్నది సుశీలయేయని యెపుడతని మనసుకు సందేహముగల్గెనో అప్పుడే అతడామెను క్షమాపణ కోరుకొనవలెనని చింతించెను. అతను క్రిందికి వచ్చి తన పుత్రునిపైబడి వెక్కి వెక్కి యేడ్వదొడంగెను. "నాతండ్రీ, నీవు బ్రతికియుండగా నీముచ్చటల జూచి సంతోషింపజాలక కామోన్మత్తుడనయి యుంటిని. ఇక చాలును. ఈపాపాత్మునకు తగిన ప్రాయశ్చిత్తమయినది. నాతండ్రీరమ్మా! యీరోజున నిన్ను నా రెండుచేతులతో నెత్తుకొనెద" ననుచు శవమును ఆ అర్ధరాత్రియందు తీసుకొని వీధివంక వెళ్లెను. ఆటు పిమ్మట అతనా చీకటిలో యేమయ్యెనో యెవరి కెరుక?



# ఉద్బోధనము

శ్రీమతి టి. రుక్మిణి అమ్మాళ్ గారు

లోకమంతా లేచి
చీకాకు పడుతూంటే
కళ్ళు మూశావేమి—నాచెల్లెలా
కలలు గంటున్నావె—నాచెల్లెలా.

తల్లిబాసా వదలి
తల్లిదేశం కదలి
పరుగులేస్తా వేఁక—నాచెల్లెలా
పడమటా ఏముందె—నాచెల్లెలా.

మననాటి చరిత్రాలు
మనవారి కార్యాలు
తీరిగ్గ తిరిగేయి—నాచెల్లెలా
తిప్పాలు పడకమ్మ—నాచెల్లెలా.

పాతచెత్తల కట్ట
పనిలేదు నాకంచు
రట్టుచేయకు మమ్మ—నాచెల్లెలా
రతనాలు దొరకవా—నాచెల్లెలా.

ఝాన్సిరాణీ కత్తి
ఝుళిపించి యుద్ధాన
స్వాతంత్ర్య దేవికై—నాచెల్లెలా
సకలమ్ము వదలదా—నాచెల్లెలా.

బిరుదాలకై డబ్బు
బిరబిరా పోస్తావు
కడుపు కాలేవాళ్ల—నాచెల్లెలా
కళ్లువిప్పీ చూడు—నాచెల్లెలా.

దేశమాతా పిలుపు
దిక్కులంతా నిండె
నడుముకట్టీ నిలుము—నాచెల్లెలా
పుడమి కీర్తికనుము—నాచెల్లెలా.

# పాతివ్రత్యము

శ్రీమతి జటావల్లభుల బాలాత్రిపురసుందరిగారు

హిందువులకు మాత్రమే యుండి యితరులకు లేని యుత్కృష్టధర్మములలో పాతివ్రత్య ధర్మమొకటి. పాపకార్యము చేయకుండుటయే స్త్రీధర్మమని యితర మతములు చెప్పుచుండ, హిందూమతము పతియే సర్వమని భావించుటయే స్త్రీధర్మమని చెప్పుచున్నది.

హిందూ పాతివ్రత్య ధర్మమునందలి మఱియొక విశేషమేమన నది యీ జన్మలో మాత్రమేకాక మరణానంతమునకూడ నుండ తగినదనుటయే. ఒకవేళ పతిమరణానంతరమున సతి నీచవాంఛలకులోనై పాతివ్రత్యము కోల్పోవునేమోయను భయముతోనే మన శాస్త్రములు పతితోపాటు సతి మరణించుటయే మంచిదని చెప్పినవి. కాని యట్లు మరణింపకుండ వితంతువు భర్తయందలి భక్తినివీడక బ్రహ్మచర్యముతో నుండునో నామె సహగమనము చేయకున్నను తప్పులేదని శాస్త్రములు చెప్పుచున్నవి. సంతానహీనయైన వితంతువు మరదివలన సంతానము పొందవచ్చుననునది యితర యుగములలోని ధర్మము. అట్టిచో స్త్రీకి విషయవాంఛ యే మాత్రమును లేక భర్తృవంశమును నిలబెట్టవలెనను వాంఛయే యుండవలెను. ఈ కలియుగములో నట్టి సందర్భమున కేవలము ధర్మబద్ధమైన వాంఛమాత్రమే కాక యితరమైనది కూడనుండి తీరునని భావించియే శాస్త్రకారులు ఈధర్మమును కలియుగములో నిషేధించినారు.

పాతివ్రత్యప్రభావ మెంతవఱకున్న దన దాని వలన సంతానహీనయైన వితంతువు పున్నామ నరకమునకు పోక స్వర్గమునకుపోవును. తాను స్వర్గమునకు పోవుటయేకాక భర్తకు కూడ స్వర్గప్రాప్తి గలిగించును.

పాతివ్రత్యధర్మము స్త్రీలబానిసత్వమునకు చిహ్నమని కొందరు తలచుచున్నారు. సాంఘికముగ కూడ పాతివ్రత్యము నాగరికతా లక్షణమేయని యాలోచించినవారి కెల్ల తెలియగలదు. కుటుంబసౌఖ్యమున కిది మూలాధారము. పురుషుడు కూడ ఆత్మార్పణము గావింపవలెనను ధర్మమొకటి యున్నది. అది పితృభక్తి మాతృభక్తి యను రూపములనున్నది. తల్లి తండ్రులెంత నికృష్టులైనను కుమారుడు వారిని భక్తితో సేవించుటయే ధర్మము. స్త్రీకి, భర్తపట్లగల ధర్మముకూడ నిట్టిదియే. భార్య యనుహోదాలో నున్నప్పుడు స్త్రీ భర్తలోని దోషముల నెంచుట కెట్లధికారము లేదో యట్లే యామె తల్లిహోదాలో నున్నప్పుడు పుత్రు డామె దోషములనెంచుటకు వీలు లేదు. భార్య భర్తను బాగుచేయవలెనను నూహతో నెవ్వరును దగ్గరలేనపుడు అతనిలోని లోపములను అతనికి కన్పరచుచు మందలింపనైనను మందలింపవచ్చును కాని కుమారుడు తల్లినట్లు మందలించుటకుకూడ హక్కు లేదు. పాతివ్రత్య మాచరణములో నుండిన ప్రాచీనకాలములోనే యట్టి మాతృభక్తికూడ నాచరణములో నుండెడిది. కావున ఆకాలములో పాతివ్రత్యము స్త్రీలబానిసత్వమును సూచించునదని చెప్పుటకు వీలు లేదు.

బాలిక స్వయముగా కోరుకొనిన పురుషుని పట్ల పాతివ్రత్యము గన్పరుచుటయే యామె ధర్మముకాని తన యిచ్ఛను గైకొనకుండ తలితండ్రులు కట్టిపెట్టినంత మాత్రమున నాతని పట్లభక్తిని కన్పరుపవలసిన బాధ్యత యాబాలిక కెందులకుండవలెనని కొందరు ప్రశ్నింతురు. ఆప్రశ్నకు సమాధానము మన గ్రంథములలోనే గన్పట్టుచున్నది. వివాహమునకు పూర్వము బాలికకు రక్షకుడు మార్గదర్శకుడుకూడ తండ్రియే. ఆతండ్రి తన్నొకనికిచ్చి ఈతనిని భక్తితో సేవింపుమని చెప్పినపిమ్మట నామె యట్లుచేయనిచో పిత్రాజ్ఞాధిక్కారమగును. శర్యాతియను రాజు సుకన్యయను తన కుమార్తెను వృద్ధుడగు చ్యవనునకీయగా నొకనాడశ్వినీ దేవతలువచ్చి యామెను తమ్ము వివాహమాడగోరగా నామె నాతండ్రి నన్నువనికిచ్చినాడో నేనాతని వీడనని చెప్పినది. శ్రీరామచంద్రమూర్తి అరణ్యమునకు రావలదని తన్ను నివారించినపుడు సీతాదేవి నిన్నెన్నడును వీడవద్దని నాతండ్రి చెప్పినాడని చెప్పినది. శ్రీరామచంద్రమూర్తికూడ నొక సమయమున తన తండ్రిచే తన కంగీకరింపబడిన భార్యయగుటచే సీత తన కత్యంతప్రేమాస్పదురాలని చెప్పెను. కావున నితర విషయములలో వలెనే వివాహవిషయములలోకూడ బాలబాలికలు పిత్రాజ్ఞాపాలనము గావింపవలెనే గాని స్వాతంత్ర్యము వహించి తలితండ్రులు కుదిర్చిన సంబంధమును త్రోసిరాజనకూడదనునదియే యార్యధర్మము.

భారతదేశములో చిరకాలము నుండి యాచరణములోనుండి కుటుంబసౌఖ్యమునకు మూలాధారమైన యీపాతివ్రత్యమునందలి ప్రాశస్త్యమును గ్రహించి నేటి నారీమణులందరు నీ యుత్కృష్ట ధర్మమును పునఃప్రతిష్ఠించుటకు ప్రయత్నించవలెను.

—:o:—

## ఆంధ్రమాత

పిశుపాటి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు

మధురము నీసుభాషితము
    మాన్యము నీహృదయాశయంబు సు
ప్రథితము నీదువృత్తి నుతి
    పాత్రము నీసుగుణవ్రజంబు స
త్వధికము నీయపత్యము న
    పారము నీచరితంబు గాన ని
ప్పృథివిని నీకు సాటిగల
    దే మఱియొక్కటి యాంధ్రమాతరో!

నీతి విహీనులచేతిలోఁ బడకుండ
    నియమవ్రతంబున నిలిచినావు
దేశభాషలలోనఁ దెలుఁగులెస్సయటన్న
    యభియుక్తబిరుదంబు నందినావు
సూర్యరాయనిఘంటు సూక్తిరత్నంబుల
    గట్టిగా నొడినింపఁ గట్టినావు
విశ్వవిద్యాలయ విఖ్యాతవృత్తినిఁ
    గడుపాఱఁగని ఖ్యాతి వడసినావు
ఆంధ్రసాహిత్య పరిషదాహ్వయతనూజ
    చేయు శుశ్రూషలకును హర్షించినావు
ఇంక నెన్నెన్ని విధముల నేనయఁగలవొ
    యరయనలవియె నీగాథ యాంధ్రమాత!

# దేశభక్తి — పతిసేవ

శ్రీమతి కొణకంచి వెంకటసుబ్బమ్మదేవిగారు

అంధకార మైల్లెదలను వ్యాపించియుండెను. ఆకాశముపై నక్షత్రములు మినుకు మినుకు మనుచుండెను. చూపరకు భీతిగొల్పు నిశాకన్య నీలవసనాచ్ఛాదితయై తన సహజసౌందర్యముతో చరించుచుండెను. సకల ప్రాణులును పగలంతయు సూర్యుని వేడికిరణములకు డస్సియు, మేతకొఱకై పలువిధములగు పాట్లుపడియుండుటచేతను తమ గుడారములలో చల్లని మందమారుతము వీచుచుండ హాయిగ నిద్రించుచుండెను. వనమునం దచ్చటచ్చట కీచురాలు మాత్రము తమ కంఠములనెత్తి బిగ్గరగా వనమంతయు ప్రతిధ్వనించునట్లు గానమొనర్చుచుండెను. అప్పుడప్పుడు పక్షులు తమ రెక్కలు టపటప కొట్టుకొను ధ్వనితప్ప ప్రకృతియంతయు నిశ్శబ్దముగ నిద్రించుచుండెను. ఆ మహారణ్యమున పెద్ద పెద్ద దేవదారు, పనస మున్నగు వృక్షరాజములును, కంటకయుతమగు తుప్పలును, మల్లె, మొల్ల, మొదలగు పుష్పలతలును, పొదలును నిండియుండెను. వానిమధ్య నొక పొదరింటిలో నిద్దరు వ్యక్తులుమాత్రము, దీపపువెలుతురునందు కూర్చుండి జాగ్రదవస్థలోనుండిరి. వా రిరువురికిని నిద్రయను మాటయేలేదు. దృఢమగు మనస్సుతో ఆ నిర్జనారణ్యమున వారేలయుండిరో? వా రిరువురును అన్యోన్యానురాగముగల దంపతులైయుండిరి. అత్యంతభయాకులితయై సాశ్రునయనములతో బెదరి బెదరి చూచుచు మహావిపత్తును సూచించుచు భర్తతో భార్య ఇట్లనెను.:—

ప్రాణనాథా! నేను ఈ నిర్జనారణ్యములో నీ విరహవేదనను భరింపజాలను. మీరు వెళ్లెదనని చెప్పుటతోడనే నా ప్రాణము లెగిరిపోవుచున్నవి. అబలనగు నన్ను విడచిపోవుట పాడియేనా? ఎట్టి కష్టమునకైనను వెనుకాడను. మీయొక్క ఎడబాటును మాత్రము సహింపజాలను. నన్నును మీ వెంట గొనిపొండు.

ఆ దీనాలాపములు ప్రాణేశ్వరియొక్క ముఖవిలాసమును, ఆ చంద్రముఖియొక్క కౌముదీవికాసమునను, చలించిన హృదయముతో ముద్దిడుకొని అత డిట్లనెను. "ప్రాణేశ్వరీ! నిన్నెల్లప్పుడును నా హృదయమునందిడి ప్రేమించుచుందును. నీ కేమియు భయములేదు. అత్యవసరమైన కార్యము గనుక, నేను వెళ్లకతప్పదు. కదనరంగమున స్త్రీలతోనుండుట కష్టతరము. ఎవరివలన నా విభవవిలాస మంతరించెనో, మన మెవని దుర్నయమువలన గృహమువిడచి వనవాస మొనర్చుచున్నామో, ఎవనివలన మన దేశమందలి అనేక గృహములందలి జనులు అన్నములేక కృశించిపోవుచున్నారో, ఎవని కఠినశాసనములచే స్వర్గమయమగు మాతృభూమి అపవిత్రమయ్యెనో, ఎవని దుర్నయ మెల్లెడల వ్యాపింప నరనరమునందును కోపాగ్ని ప్రజ్వరిల్లుచుండ ప్రతి మనుజుడును వాని నాశనమునే కోరుచున్నాడో, ఆకాశమున నెగిరిపోవు పక్షులు సైతము ఎవని మరణమును కోరుచు అరచుచున్నవో, నోరులేని కృపాణముకూడా ఎవని పాపఫల మెప్పుడు రుచిచూపింతునాయని యొరలోనుండి నిక్కినిక్కి చూచుచున్నదో, అట్టివాని వినాశము త్వరలో జేరానున్నది. స్వదేశాభిమానులగు మహనీయులే ఈ ద్వేషమును తెలిసికొని దుష్టులను హతమార్చి జయము నొందుట నిశ్చయము. భూమిపై మానవజన్మమెత్తినందులకు దేశసేవజేయుటయే ముఖ్యము. అసంఖ్యాకులు విరామములేక ప్రలాపించు దీనాలాపములు భగవంతు డెప్పుడు మాన్పునో తెలియదుగదా! నా శరీరములో నేమాత్రముబలము మిగిలియున్నను తుదివరకు శత్రువులను వెదకి వెదకి నా కృపాణమున కెరజేసి నా ప్రియమగు రాజ్యమును రక్షించుకొందును. శత్రువినాశమునకై రణభేరి మ్రోగుచున్నది. నీవును మన దేశముయొక్క విజయప్రకాశమును

త్వరలోనే చూచెదవు గాక! విజయా! నీ సహజ సౌందర్యమునజిమ్ము కటాక్షములతో నాకు సెలవిమ్ము! నేను తిరిగి నీ ప్రేమడోలికల నూగులాడుటకు వెంటనే శత్రువిచ్ఛేదనముచేసి జయమును పొంది వచ్చెదను. ప్రియా! సెలవు. పద్మలతవలె తన హస్తద్వయమును ప్రియుని కంఠముపై వైచి చకోరము వలె విహ్వలనయనములతో విధుని జూచుచు ఆమె ఇట్లనెను. మనోనాయకా! ప్రేమించు జనులను ఆదరముగను, ద్వేషించువారిని విషతుల్యముగను, జూచుచు శత్రువులను నీ కృపాణమున కరచేయుటుచితమగునా? సర్వజనులను ఒకేవిధముగా పరిగణించి ఘోరమగు ద్వేషమును హతమార్చరాదా? లేదేని విషప్రయోగమువలన శత్రువుల నాశన మొనరింపరాదా?

యువకుడు చిరునవ్వు నవ్వుచు ఇట్లనెను. ప్రియా! నీ మాటలు చాలా బాగున్నవి. కుటిలోపాయములచే శత్రుసంహారణమునకు గడంగుట మిగుల హేయము. అట్టి యనుచితకార్యము ఉత్తమపురుషులకు కీర్తిప్రదము కాజాలదు. ఖడ్గహస్తుడై రణరంగమున శత్రువుల నెదుర్కొనువాడే వీరుడు. వానిని సఖులు, సహోదరులు మున్నగువారు పిరికివాడనక సన్మానింతురు. ఇది విని లజ్జావనతవదనయై విజయ ఇట్లనెను. నాథా! సరే, అటుల చేయజాలనియెడల ఈదాసిని కూడా మీవెంట దీసికొనిపొండు. మీ రెక్కడకేగినను నేను మీవెంట వచ్చి పాదసేవజేతును. మీ బాహువల్లికను విడువజాలను. ప్రియా! ఒకవేళ మీరు నన్ను తీసికొని వెళ్లనియెడల, వియోగభరమునకు తాళజాలక విషముత్రాగి మిమ్ము స్మరించుచు నా ప్రాణములను విడతును.

యువకు డిట్లనెను. ప్రియా! నీమాటలు వినజాలకున్నాను. సెలవిమ్ము; ఈ స్త్రీవేషమును విడచి పురుషరూపమును ధరింపుము. పురుషానుకూలమగు ధైర్యము నవలంబింపుము. లజ్జాభయములను వదలుము. అబలననియు, సుకుమారిననియు నిప్పట్టున మరచిపొమ్ము. పరహస్తగతయగు మాతృభూమి నుద్ధరించుటకు వెడలుము. నేనుమాత్రము పురుషుడనై జన్మించి నిజకర్తవ్య మెట్లు మరతును?

పతిమాటలు వినినంతనే పుష్పభారరహితయగు లతవోలె కడుసంతసించినదై యుప్పొంగుచు లేచి పురుషోచితవస్త్రములను ధరించి తలకు పాగను చుట్టివైచెను. యువకునివంటి శరీరముతో తన నెవరును స్త్రీయని గుర్తించలేరని చిరునగవుతో మందగమనమున పతికడకు వచ్చెను. భర్త మందహాసమున నిట్లనెను. ప్రియా! ఈ నూతనపురుషవేషమును కాంచి ముగ్ధుడనైతిని సుమా? కాని నీయొక్క నయనవిలాసమును మాత్రము దాచలేకపోతివి. ప్రియా! మెఱయుచున్న కన్నులెంత యందముగానున్నవి. నీ ఛద్మరూపము గుర్తించువారెవరు? భ్రూమధ్యమున వనదృశ్యమును ధ్యానించుము. ఈ యత్యంత సుఖదాయకమగు కుటీరమును, ఈ తరులతా వాటికలను, ఈ పశుపక్షి జాతములను, ఈ వనమునందుండు వినోదములను మొదలగువానిని విడచుట బహు కష్టముగానున్నది. మరల నిచటికెప్పుడు తిరిగి రాగలమో ఎవరు చెప్పగలరు?

ఇది విని అశ్రువులు నయనముల గ్రమ్మికొన విజయ ఇట్లనెను. ఇంతకంటె మించిన సుఖప్రదమగు తావీ ప్రపంచమునం దెచ్చటను లేదను టతిశయాంశము కాదు. ఈ వనపక్షులకంటె మించినవా రెవరు గలరు? ప్రపంచమును పరికించి చూచిన నది స్థిరమైనదియు కాదు. నేటివరకు నే నీవనమును, ఈ లతలను స్థిరమనియే తలంచుచుంటిని. క్షణభంగురమగు నాశముపై నేల విచారించవలయును? ప్రపంచమంతయు ద్వేషభూయిష్ఠమైనదని తోచుచున్నది. ఇంతమాత్రమునకే యాతురత చెందనేల? నాథా! మీ యాజ్ఞవల్లనే నేను బయలుదేరుచున్నాను. మనము వెళ్లినతరువాత నీ వనమునందలి లతాభవనము కంటకమయమై పోగలదు. భర్త ఇటులనెను. ప్రాణేశ్వరీ! అట్టి పలుకులు పలుకకు. ఈ జగమున మనుష్యులు



సప్తమాంధ్రరాష్ట్రీయ మహిళా మహాసభ

ఏలూరు 4—11—33

# వనితాలోకము



శ్రీమతి నాగమ్మగారు, యం.యే. ఎల్.టి.

బెంగుళూరు, వాణీవిలాస విద్యాలయమున ప్రధానోపాధ్యాయినిగా నియమింపబడిన మొదటి స్మార్తబ్రాహ్మణస్త్రీ. ఈమె ఆరేండ్లు మైసూరు జిల్లాబోర్డు సభ్యురాలై యుండెను.



శ్రీమతి కుమారీ పద్మావతిగారు,

కూర్గు

డెహరాడూన్ నగరమున కన్యాగురుకులాశ్రమమునం దైదేండ్లుచదివి పంజాబ్ యూనివర్సిటీలో ప్రభాకర పరీక్ష (Hindi Honours) మొదటి తరగతియందు మూడవదిగా కృతార్థురాలై ప్రస్తుతము బెంగుళూరులో సాంఘిక సేవయు పత్రికాలేఖనమును హిందీ భాషా ప్రచారమును చేయుచున్నది.

పుష్టము, పచ్చుచుండురు. ఈశ్వరభక్తి, దేశసేవ ఒకటే అర్థమునకు జెందును. ఒకటే ఫలితమిచ్చును. వనమునందు వలె నెట్లు నివాసము చేయుచున్నామో, అటులే సహజశక్తి, శ్రమలవలన శాంతి, సౌఖ్యము, వృద్ధిపొందించుటకూడ మనుష్యుని కర్తవ్యము. ఇదియే భగవంతుని పూజించుటయును అగును. ప్రియా! ఆలస్యమగుచున్నది. ఈ వనములందుగల మోహమును వదలుము. ఇప్పుడు మనము భరింపరాని మీని వియోగ దుఃఖమును సహింపవలయును.

అంతట నతడు చిరపరిచితములగు వృక్షవాటికలు, పక్షిజాలములు కురంగములు మొదలగువానితో సెలవుతీసుకొని విజయతో కలసి నడువనారంభించెను. నెమ్మదినెమ్మదిగా వారిరువురును వనమునందలి మధ్యమార్గము వెంబడిని పోవుచుండిరి. అప్పుడు వారివెంట వనమును లాగికొనిపోవుచుండిరో యనునటులుండెను. వెనుదిరిగి చూచుచు దీర్ఘనిశ్వాసములతో పరిచయమైన అడవిని దాటిరి

రాత్రి గడచెను. ఉషఃకాంతులు నలుదెసల వ్యాపించుచుండెను. సువర్ణచ్ఛాయగల సూర్యుని లేయెండలో నా దంపతు లిరువురును నడచిపోవుచుండిరి. నడచి నడచి మధ్యాహ్నమునకు వా రొక నదియొడ్డున జేరిరి. అచ్చట కాలకృత్యములు దీర్చుకొని కొంతసేపు విశ్రమించి నావల బయలుదేరి, నదిని దాటుట కాలోచించుచు అటునిటు చూచుచుండ నొకపడవ వారి కగుపడెను. అది యొక చెట్టునకు బంధింపబడియుండెను. వెంటనే దానినివిప్పి అమితానందమున వా రిరువురును దాని నధిరోహించి నడుపనారంభించిరి. వారు మనమున త్వరలో నావలిగట్టును జేరుదుమని సంతసించుచుండిరే కాని ముందు రాబోవు విపత్తును వా రెరుంగజాలకపోయిరి. నావ నెమ్మదిగా నదీగర్భమునకు జేరనో లేదో శ్యామవర్ణముగల కృష్ణానది చాల ఆనందములో నున్నట్లులుండి ఆకస్మికముగా పెద్దపెద్ద కెరటములతో అల్లకల్లోలము కాజొచ్చెను. మన దంపతులు నదీగర్భ సౌందర్య మీక్షించుచు ఆనందమున మైమరచియుండిరి. ఆసమయమున నెక్కడనుండియో పెద్ద తుపాను సాగినది. సుడిగాలియు, ఉరుములు, మెరుపులు, కారుచీకట్లు కమ్ముకొనుచు మేఘములు భయంకరముగా నుండెను.

ఆకాశమంతయు మిఱుమిట్లు గొల్పు మెరుపులు, ఉరుములును, గాలికి గూలు వృక్షములును, నదీజలమున బయలుదేరు కెరటములధ్వనియు భూవలయ మంతయు ప్రతిధ్వనించుచుండెను. మూసలధారవలె మేఘగర్జనములతో వర్షము కురియనారంభించెను. పెద్దపెద్ద యుపనదులన్నియు వచ్చి, నదిలో పడుట వలన నదీగర్భము పెద్దది కాజొచ్చెను. పడవ అల్లకల్లోలము కాసాగెను. దానిని ఆపుటకును, నడపుటకును వీలుగాకుండెను. అసహాయురాలు, అనాధారయునగు యీ నావను కాపాడువారెవరు? క్షణములో నావ మునిగిపోవునట్లుండెను. నావలోనున్న దంపతు లిరువురును జలమగ్నులగు నావపై జలగర్భమున నివాసమొనర్ప నిశ్చయులైయుండిరి. ఇక నొడ్డును జేరజాలరు. అప్పటి ప్రకృతియొక్క కోపభయానకమైన దృశ్యమునుజూచి యువకు డిట్లనెను.

ప్రాణేశ్వరీ! ఇప్పుడే ఈ క్షణభంగురమగు శరీరమును విడువగలము. నాకు దేహత్యాగమనిన యావంతయు విచారము లేదు. జాగ్రత్స్వప్నములవలెనే జననమరణములై యున్నవి. కాని! నా మనోభిలాష మాత్రము పూర్తికానందులకే కడువిచారమగుచున్నది. ఈ శరీరముతో దేశమునకు సేవచేయజాలకపోతిని గదా! ముందునేరయు నాసయును లేదు. ప్రియా! రమ్ము! ఒకపర్యాయము బాహువులనిండ కౌగిలించుకొందము, అఖండజలరాశిలోనున్న మనకు తిరిగి బ్రతుకు నాసయు లేదు. ఇదియే కడసారి కోరిక అనెను.

విజయ ఇటులనెను. నాధా! మనము ఉత్తరజన్మయందును కలసియేయుందుము. విచారింపకుడని నవ్వుచు పలికెను. ఇరువురును బాహువులమధ్య నుండియే ముఖచుంబనము గావించుకొనిరి.

ఇఱువురును తమ కరములచేత నాలింగనము కావించుకొని హృదయమున హత్తుకొని పరమానందము నొందియుండిరి. శాంతిభూషితులును, లోకరహితులును నగు దంపతులతో నావ క్షణములో నొక కెరటము తాకుడునకు మునిగి జలగర్భమున లీనమైపోయెను. వర్షము వెలసిపోయెను. గాలియు తగ్గిపోయెను. ప్రకృతియంతయు తన సహజతేజమును వెదజల్ల నారంభించెను. మబ్బులు విడిపోయెను. సమీపారణ్యమంతయు తేటగా కాన్పించుచుండెను. చెట్లన్నియు నీటిబిందువులు చిటుకు చిటుకుమనుచుండ సాయంకాలపు సూర్యుని బంగారు కిరణములలో మిలమిల మెరయుచు కొమ్మలసందు నుండి ప్రకృతిని నిక్కి నిక్కి చూచు యాకులతో చూచుటకు కనులపండువుగానుండెను. క్షణముక్రింద నత్యంతప్రేమానుకూలురగు నిఱువురు దంపతు లుండియుండిరి. వా రెటుపోయిరో? ఏమయిరో గదా? భగవంతుని మాయ నెవ రెఱుంగగలరు. క్షణభంగురమగు శరీరముపై నింత ప్రేమయు నింత యాశయు నేల? అంతయు నిశ్శబ్దము.

* * *

సూర్యబింబము తన కిరణములద్వారా చీకటిని తొలగించుచు తూర్పుదిక్కున చెట్లకొమ్మలు, ఆకులు మెదలగువాని చాటునుండి తొంగి చూచుచున్నటు లుండెను. క్రమేపి పైకివచ్చిన కొలదిని బంగారు చాయగల ప్రకాశము వర్ణనాతీతముగానుండెను. సకల ప్రాణులును నిద్రనుండి మేల్కొంచుచుండెను. జలరాశిలోని కెరటములు తీరమును ముద్దిడుకొని పోవుచుండెనా యనునటులుండెను. నీటిలో సూర్యుని ప్రతిబింబము శోభించుచుండెను. ప్రాతఃకాల రమణీయ మీక్షించుచు నొక తపోధనుడా నదీతీరమున నటునిటు తిరుగాడుచు నదిలోనికి జూచెను. ఆ యఖండజలరాశిలో నొక శవము కాన్పించెను. అంత నాముని వెంటనే నదిలోనికి దిగి యా శవమును వెలికీడ్చి పరికించిచూడ ప్రాణమున్నట్లు తోచెను. అది పురుషవేషమును ధరించిన స్త్రీరత్నమైయుండ నాముని సంతోషమున శవమును తన కుటీరమునకు గొనిపోయి ఉపచరింప నామెయు చైతన్య మొందెను. లేచి కూర్చొని చకితయగు కురంగమువలె నటునిటు చూచుచు మునికి ప్రణామమాచరించి అపరిచయమైన స్థలమున నుండుటయు తన పురుషవేషమును స్మృతిపథమునకు రాగా నతి వ్యాకులమున గుండె బాదుకొనుచు నేనిప్పు డెచ్చట నున్నాను! నాప్రాణేశ్వరు డెక్కడున్నాడు? కృపాకరుడవగు నో మునిశ్రేష్ఠుడా వెంటనే తెల్పుమని అశ్రువులు జలజలరాల దుఃఖించుచు మే మిఱువురము కావేరి జలమందు లీనమైతిమని పలికెను. ఈమె సంగతంతయు తపోధను డగుటవలన నుండే తెలిసియుండెను. మరల నామె ఇట్లనెను. నాపతిని విడచి యుండజాలను. పతికడకు జేర్చుడని ప్రార్థించెను. మునియు నతి స్నేహభావమున పుత్రీ! హతాశనొందవలదు. నేను వెళ్లి నీపతిని వెదకి తెచ్చెదను. నేను వచ్చువరకును నీ కుటీరములో సుఖముగా నుండుము. నీకేమియు భయములేదు. నీపతి సజీవుడైన సరే లేదేని శవమునైనను నీకు జూపింతును. అని పరహితరతుడగు నా ముని నదిరొడ్డున వెదక నారంభించెను. ఎంత వెదకినను అగాధజలములలో నేశవమును కాన్పింపలేదు. నదీ ప్రవాహమువెంట వెదకుచు నా ముని వెడలిపోయెను

వియోగదవానలము ప్రజ్వరిల్లుచుండ విజయ కొకనిమిషమైన నా కుటీరమున నిలువ మనసొప్పక బయటికివచ్చి వనమును నాల్గుమూలలు పరికించెను. అది మిగుల మనోహరముగా నున్నది. కాని ప్రియసందర్శనలాలసయగు మనస్సున కిది కంటకయుతముగా నుండెను. ప్రేమ విచిత్రవస్తువు, దీనిలో నద్భుతమగు శక్తిగలదు. జాగ్రన్నిద్రావస్థలు రెండును నొకవిధముగా నేతోచును. ప్రేమయనునిషా వ్యాపించి యుండినంతవరకు ప్రపంచమే కాన్పింపదు. ప్రేమించు నట్టి వస్తువు స్వర్గమునకన్న నెక్కుడుగా తోచును. ప్రేమప్రవాహము నాపువారెవరు? ప్రేమోన్మత్తులగువారికి ప్రకృతియొక్క రామణీయకమే అవసరము

లేక, ప్రేమలోనే తన్మయులై యుండురు. ప్రేమ విహ్వలయు, వియోగదుఃఖభారయునగు విజయ అధీరయై, పదములు తొట్రుపడ, నదీతీరమునకు బోయెను. అప్పటికి సరిగా రెండు ఝాములయ్యెను. నభోమధ్యమందున సూర్యుడు తన ప్రచండమగు వేడి కిరణముల వెదజల్లుచుండెను. నదీజలము నిర్మలముగా ప్రవహించుచుండెను. ప్రతిప్రాణియు నెండ వేడికి తాళజాలక నీడలకు పరుగిడుచుండెను. మన విజయ యా గంభీరమగు జలరాశిని జూచి అమిత రోషమున కఠినాత్మురాలవగు నీవే నాపతిని మ్రింగితివి? నన్ను నాథను, అభాగినిగా జేసితివి? నీకించుకంతయు విచారము లేక కలకలా రావముతో ప్రవహించుచుంటివి? హా! ప్రాణేశ్వరా! స్వదేశ సేవా దురంధరా! సద్గుణపుంజమా? నీవుగాక మాతృదేశము నుద్ధరించువారెవరు? భవిష్యత్తుయొక్క ఆశలన్నియు నీతోడనే అంతరించెనా? నీ దేశము నుద్ధరింపకయే నన్ను నాథను జేసి వంచించిపోతివా? ప్రియవల్లభా! నేను నిన్నింక జూడజాలను గాబోలును! నీ ప్రేమలతను త్రెంపివైచితివా! నాపూర్వకృత పాపరాశి కంతము లేదా! ప్రాణనాథా! ప్రియా! ఎచ్చట నుంటివని యేచుచు దీనురాలివలె మార్గము లేక ముండ్లకంపలపై పడుచు, లేచుచు నా మహారణ్యమంతయు తిరుగుచు, విలపించుచు, కేకలిడుచు, నొక చెట్టుక్రింద వేసారి కూర్చుండెను. ఇంతలో నొక మనుష్యవాక్యమువలె నొకధ్వని వినిపించినట్లు తోచ మరల పరుగిడ నారంభించెను తిరిగితిరిగి డస్సిపోయి, శరీరము కృశింప, నాబాలిక నడువజాలక ఒకచోట కూర్చుండి ఇట్లాలోచింపసాగెను. నేనెంత శ్రమపడినను నాప్రియుడు లభింపడు. ఆయన దేశసేవ జేయవలెనను కోరికతోడనే మృతినొందెను. అట్టి కోరికను నిర్వర్తించిన నేనును ధన్యనగుదునని దృఢమనస్సుతో లేచి కొంతదూరముపోవ నొకదారి కాన్పించెను.

ముని కొంతదూరము వెళ్ళగావెళ్ళగా నదిలో నొక పురుషశవము గాన్పించెను. అత్యాతురమున దాని నొడ్డునకు జేర్చి కొంతచైతన్య మెందువదున్నట్లు గాన్పింప తన కుటీరమునకు జేర్చెను. అచ్చట విజయ లేకుండుటను విస్మితుడై చుట్టుపట్ల నున్న వనము నంతయు వెదకి యామెను గానక తిరిగివచ్చి యువకుని శరీరమునకు వేడి తగులుటకై మంటవేసెను. కొంతసేపైన తరువాత యువకుడు స్వప్నమునవలె కలువరింపసాగెను. విజయా! ప్రాణప్రియా! దేశోద్ధారణకొఱకై నాతో బయలుదేరితివి. నిన్ను మించిన సహాయురాలిక నాకెవరు లభింతురు? ఎంతలో మాయమైతివి. అనుచుండ నాముని పరమానందముతో తనకు దేశభక్తుడు లభించెనని పరమేశ్వరునికి ధన్యవాదము లొసర్చెను. అతని శరీరమును గాంచినంతనే మునికి అమితమగు ప్రేమ యుదయించెను. కొంత తడవునకు యువకుడు లేచి కూర్చుండి మునికి వందనమాచరించెను. మునియు వానితో కుమారా? నీశరీరము జలములో కొట్టుకొనిపోవుచుండ నేను పట్టి తెచ్చితి. నీవెవరి పుత్రుడవో తెల్పుమన యువకు డిట్లనెను. నాచరిత్ర చాలయున్నది. అయినను తమ యాజ్ఞానుసారము క్లుప్తముగా జెప్పెదను. మాది 'మిలను' పట్టణము. నాకు బాల్యముననే నాతల్లి గతించెను. నాతండ్రి దేశమున ప్రబలిన అత్యాచారములను సహింపజాలక హాహాకారములిడు జనులకు సహాయమొనరించిన నేరమున రాజకర్మచారులు శిక్షించ ఎంతచెప్పినను పెద్ద న్యాయాధికారియు వినక కఠినమగు శిక్షను విధించి బాధించుచుండ నన్ను వెంటనిడుకొని పోయి తన మిత్రుడగు నొక మునికి నన్ను నప్పగించి చనెను. నేనా ఋషివద్దనే పెరిగితిని. నాకంటెను చిన్నదగు బాలికయు ఆయనవద్దనున్నది. ఆమెయును నాకును చాల మైత్రియుండెడిది. తగు సమయమున మాకిరువురికిని వివాహమొనరించి మమ్ము దేశసేవాయుక్తుల గమ్మని యాశీర్వదించి పరమపద మలంకరించెను. ముని యాజ్ఞానుసారముగా మేమిరువురము దేశసేవ జేయుట కమితానందముతో బయలుదేరి మధ్యత్రోవలో నాప్రియధనమగు విజయను గోల్పోతిని. ఈనదిలో తమ కేదేనొక శవము

గాన్పించిన నావతీయుడని కన్నులశ్రుపూరితముగాగ బలికెను. అంతనాముని విజయుసంగతిచెప్పక, కుమారా! నీవు దేశభక్తుడవుగాన నే చెప్పునట్లు చేయుము. మనదేశమున అసంఖ్యాకులగు జను లన్నములేక మల మల మాడి చనిపోవుచున్నారు. అన్నవస్త్రములకే కఱవై నిలువ నీడలేక అల్లకల్లోలమగుచు ఉద్యమము సాగించుటకైనను శక్తిలేక అల్లాడువారి కేమిగతి? ఎవరి ముఖముపైనను సంతసమేలేదు. జార, చోరులు ప్రబలిపోయిరి. దరిద్రత వల్లనే ఇట్టి విపత్తులు సాగినవనుటకు సందియములేదు. నీవు నేడే బయలు దేరి దేశము నుద్ధరింప ప్రయత్నములు మొదలిడుము. అవసరమగుచో నేనును వచ్చి నీకు సాయపడెదను. వైరుల మాయలకు లోబడకుము. పుత్రా! మంగళదాయకమగు మార్గమున జనుము. నీకోరిక ఫలించును. కీర్తికాముడవగుము. పొమ్మని పలికెను.

విజయు పిచ్చిదానివలె నా దారివెంట పోను పో నొక గ్రామమును జేరెను. ప్రాతః కాలానందమున కూడా నాగ్రామ మతి వ్యాకులమున నున్నట్లు గాన్పించుచుండెను. అది చలికాలము. ఒక గృహములో భయంకరమగు చలిబాధకు సహింపజాలక వస్త్రహీనుడై చినిగిపోయిన అంగవస్త్రమును ధరించి ఎండలో కూర్చుండిన మానవునొకని విజయుగాంచెను. అతని భార్యయు, పసిబిడ్డయు నేల నొక గడ్డిచాపపై చలికి వణకుచు పరుండియుండిరి. వారి శరీరము లన్నములేక కృశించియుండెను. విజయయు వారి కెదురుగా నే చలికి వణకుచు వారి హీనస్థితిని గాంచు చుండ నామానవు డామెను గాంచెను. వెంటనే యతడు లోనికేగి యాగడ్డిచాపను దెచ్చి యామె కిచ్చి కొంత గడ్డిని దెచ్చి నిప్పుతో వెలిగించి యామెను చలికాచుకొన ప్రార్థించెను. అంత నామె వాని త్యాగమున కాశ్చర్యపడి, అన్నా, నీకిట్టి దుస్థితెట్లు సంభవించెను. అని యడిగెను. అమ్మా! నాపూర్వ పుణ్యవశమున నీ వంటి సాధ్విని గాంచగల్గితిని. నాజన్మ కృతార్థతనొందె. ఈదేశమున వ్యాపించిన దుండగములు వర్ణనాతీతములు. కొలది దినముల క్రింద నొక సజ్జనుని రాజభృత్యులు అన్యాయముగ దండింప దలచి నన్ను మిథ్యాపరాధమునకు సాక్ష్యమిమ్మనిరి. నే నసత్యమాడనని స్పష్టముగా చెప్పినందులకు నిరపరాధినగు నన్ను బాధించి నాయింటి యందున్న యావదాస్తిని భూమిని కూడా లాగుకొని పోయిరి. తినుట కన్నము లేదు. ఉపవాసములతో దినముల గడపుచుంటిని. ఈగడ్డిచాపయే నాకు మిగిలిన ధనము. అని కన్నుల నీరుగార బలికెను. ఆహా! మాతృదేశ జనుల కెట్టి దుర్దశకల్గినది! ఇట్టి వారికి సేవజేసి సుఖ మొనగూర్పవలయుననియే నాపతి కోరిక. నేనిప్పుడే బయలుదేరి స్వదేశము నుద్ధరింతు నని సన్న్యాసి వేషమున చేత త్రిశూలము ధరించి, ఇల్లిల్లు, ప్రతిగ్రామమును తిరుగుచు, దేశభక్తితో నిండిన గీతములబాడుచు, జనులకు వీరరస మొలుకునట్టి వచనముల నుపన్యసించుచు, దేశోద్ధారణకొఱకై సైన్యమును గూర్చుచుండెను. యువకుడును కొన్నిగ్రామములలో నిజేచ్ఛప్రకారముగా సేనను ప్రోగుజేసి యుద్ధసన్నద్ధుడై యుండెను. ఋషియు మిలను నగరప్రాంతమున నుపన్యాసముల గావించుచు జనుల యజ్ఞానతిమిరము పారద్రోలుచుండ, విజాతీయులు పట్టజాలని కోపమున నింకను ప్రజలను, ఈ ముగ్గురు దేశనాయకులను బాధింప మొదలిడ జను లందరును సింహములవలె గర్జించుచు యుద్ధమునకు బయలుదేరిరి. యువకుని సైన్యము కొలదిగానే యున్నది. వైరిబల మెక్కువైనను లెక్కింపక ప్రాణముల కాసింపక శత్రులను గనుమాడుచుండ నొక వైపునుండి ముని లెక్కకు మించిన యోధుల వెంటనిడుకొనివచ్చి యువకునకు సహాయ మయ్యెను. రెండవవైపునుండి విజయయు అసంఖ్యాకులగు వీరులతో భైరవీనాదముతో వచ్చి కలసెను. ఈకోట్లకొలది దేశభక్తులగు వీరులధాటి కాగజాలక శత్రులు పారదొడగిరి. యువకుడు యుద్ధములో గాయములుతిని డస్సియుండ నొకవైరి తన ఖడ్గముతో నొకదెబ్బ కొట్టబోగా ముని వాని వధించెను. యువకుడు వానిని పాతమార్చెను. మునియొక్క కృపకు యువకుడత్యానందముతో సాష్టాంగ నమస్కారము గావించెను. విజయ కఠినప్రహారములచే వైరుల పారద్రోలి మునిసన్నిధికివచ్చి నిలచెను. అప్పుడు

ముని ప్రసన్నవదనముతో నిట్లనెను. కుమారా! ఇప్పటికి నీ తండ్రి కోరికను చెల్లించి ధన్యుడవైతివి. నిన్ను కఠిన హృదయమున వదలి అడవులందు తిరుగుచు దేశము నుద్ధరింప ప్రయత్నమొనరించిన నేనే నీతండ్రిని! నీతో సమానయశశ్వినియగు విజయయు నీవు దొరకినదినముననే నాకు దొరకినది. నేనామెను నాకుటీరముననుండ నియమించి నిన్ను వెదకుచుండ నెటకో వెళ్ళిపోయినది. మరలివచ్చి నేనెంత వెదకినను గాన్పింపలేదు. సత్యము ప్రేమ యెన్నటికిని నిష్ఫలము కానేరదు. నీవు నన్ను గుర్తింపజాలకపోతివి. పూజ్యురాలును సద్గుణ సంపన్నయునగు విజయతో కలసి కీర్తి నార్జింపుము. మిమ్ము గాంచి నేటికి నాజన్మము పవిత్రమైనది. నేనింక సంతసముతో దేహత్యాగ మొనర్చుచున్నాను. పుత్రా సెలవు. జయధ్వనులు చెలరేగుచుండ ముని ప్రాణమును విడచి భూమిపై బడిపోయెను. హా! తండ్రీ యనుచు యువకుడును మూర్ఛనొందెను. ధన్యుడగు ముని స్వర్గమలంకరించెను. మూర్ఛితుడగు యువకుని శిరమునొడి యందిడుకొని విజయ పరిచర్యలు సల్పుచుండ యువకునికి చైతన్యమొందవి యామెను కౌగిలించుకొని ముద్దిడుకొనెను. ఇరువురును పూర్వపు సౌఖ్యమునను, ఆనందమునను నోలలాడిరి.



## దాంపత్యము

శ్రీమతి వీరుభొట్ల రామలక్ష్మమ్మగారు

ఇరువురిమాటలొక్కటయి, ఈసును జోడునుమాత్తి, పూవునున్
పరువమువోలెనేకమయి, పాపలతోనిలుదీర్చుకొంచు, కా
పురమొనరించుదంపతులె పుణ్యులు, వారిదెకాపురం, వధూ
వరులనవారె, నిత్యవిభవాన్వితులన్ననువారె, సోదరీ!
నగలునునాణెముల్ మఱి'బెనారసు' చీరలుఁ గంచుకంబులున్
అగరులు తారహారము,లనారతమున్ గొనితెమ్మటంచు, దా
మగనిని బాధపెట్టక సమంచితరీతిఁజరించునట్టి యా
మగువయె, సోదరీ! మగువ మానితసద్గుణపాత్ర భూస్థలిన్.
తా నతిచెప్పువస్తువులు తప్ప కవశ్యముగానెఱింగి (యున్)—"న
న్యాసము, చట్టుమండలము, ఆ! యిటులైన చొ ఒక్కనాటితో
నే సరికాపురం"బనక నిచ్చలు 'కన్ను'ను'బున్ను' లేక, సం
తోసముతోడ సంసృతినిద్రోసెడి భర్తయె భర్త సోదరీ!
కలహములున్న చో పొరుగుగా నివసించు గృహస్థకోటికిఁ
కులుకులు, బంధువర్గమునకున్ మఱితక్క గలట్టివారికిన్
జులకన, యింటగుట్టునకు జోటులభించదు, గౌరవోన్నతుల్
తొలఁగును, గాన దంపతులలో కలహంబులు సాగవచ్చునే?
కలిమియెంతున్నగాని సౌఖ్యంబులేదు దంపతులు ప్రేమపథమును దప్పిరేని,
కలిమిలేకున్నగాని సౌఖ్యంబుగలదు భార్యయున్ భర్త యనురాగబద్ధులైన.

# 'విడాకులు'

శ్రీమతి బొడ్డుపల్లి బాలాత్రిపుర సుందరమ్మగారు.

ఆమె భర్త యిపుడు కుష్ఠురోగి. పూర్వము సుందరుడు, యౌవనుడు, సద్గుణవంతుడు. వైద్యవృత్తినుండి విధివశాత్తు కుష్ఠవ్యాధి సంటించుకొనినాడు. ............వ్యాధిగ్రస్థు డేమి సంపాదించగలడు. ఇపుడతడు చాల బీద వాడు. మట్టియింట కాపురము. భార్య సౌందర్యరాశియగు జవ్వని.

   

ఆవారము ముసురుబట్టి యూరంత చితచిత లాడుచుండెను. ఇంటినిండ తేమ బహుచీకాకు గొల్పుచుండెను. సర్వాలంకారయగు నాతని భార్య వినుగున "నరసమాంబ వాక్యములే సత్యమైనవి. వానినే యనుసరించవలయును; లేకున్న యీ కుష్ఠురోగిని కనిపెట్టుకొనియుండుటకు నా కేమి కర్మము" అని యనుకొనుచుండెను.

   

విడాకులచట్ట మమలులోనికి వచ్చినది. ఇప్పు డామె కుష్ఠురోగి భార్య కాదు. ఒక గొప్ప కుటుంబీకుని భార్య. సంవత్సరము గడచినది. పాప మితడు దుస్సహావాసము కారణముగ విషయలోలుడై తుదకు చనిపోయెను.

ఇప్పు డామె కర్థమైనది ఏదియో యున్నదని విధివశాత్తు కుష్ఠమున బాధితుడగు సుగుణసంపన్నుని విడచి, మంచివాడుగ నెరిగిన యొక ధనిక యువకుని బెండ్లాడినను విధియే యడ్డమయ్యెనని.

వెన్కకు తిరిగి చూచుకొన్నది. తన్నెవరు చేకొందురు. తా నెవరి చేకొనవలెను. వ్యాధికుదిరి స్వస్థతనున్న యీ సుగుణుపాదముల బడినది. అత డామెను స్వీకరించినాడు.

# చదువుమీద శ్రద్ధా? లేక; ప్రియునిమీద ప్రేమా?

శ్రీమతి సమయమంత్రి రాజ్యలక్ష్మిగారు

"ఎక్కడికి వెళుతూన్నారు?" అని అడిగింది సీత.

"క్లబ్బుకి" అని చెప్పాడు రామారావు.

"ఎన్నిసార్లు ప్రార్థించినా యింటిదగ్గర వుండరు కదూ" అని చిన్నబుచ్చుకుంటూ అంది సీత.

"నేను చెప్పినమాట విన్నదాకా ఇంతే. అడిగినా లాభంలేదు. హాయిగా క్లబ్బులో, స్నేహితులతో, విలాసంగా కాలం గడిపే వాళ్ళకి పల్లెటూరిపిల్ల దగ్గరతోస్తుందా? ఎప్పటికి నీవు విద్యానాగరికురాల వౌతావో, అప్పుడే నేనింటివద్ద ఉండడం. నీవు నాప్రేమను సంపాదించాలంటే, చదువుకోడమే వుపాయం" అంటూ కోపంగా వెళ్ళిపోయాడు రామారావు; పాపం సీత ఏడుస్తూ కూర్చుంది.

సీత కాపరానికివచ్చి ఏడాదయింది. పుట్టిల్లు పాలకొల్లు. అంతపల్లె కాదు, పట్టణం కాదు. అక్కడే సీత బోర్డుబాలికాపాఠశాలలో ౭-వ తరగతి (Pass) చేసింది. సంగీతం, నృత్యం ఏవీరావు. ఏదో కొంచెం తెలివితేటలు కలదే కాని, కొంచెం అమాయకపు పిల్ల. మనస్సు చాలామంచిది. సీతభర్త రామారావు చెన్నపట్నంలో B. A. Pass అయి L. T. చదివి విశాఖపట్నం A.V.N. College లో Teacher పనిచేస్తున్నాడు. నవనాగరికత అన్నా, ఆడంబరాలుఅన్నా బాగా అలవాటయ్యాడు. సీత బాగా చదువుకోవాలనీ, తనతో English బాగా మాట్లాడాలనీ, తనతో రోజూ షికారుకు రావాలనీ, సిగ్గుగా వుండకూడదనీ, నాగరికతగా వుండాలనీ, కాపరాన్కివచ్చిందిమొదలు పోరుతున్నాడు. కాని సీత పూర్వపుసాంప్రదాయాల్లో పెరిగిన మూలాన్ని వీటికి ఇష్టపడేది కాదు. రోజూ తన దగ్గర English చదువుకోమని చెప్పేవాడు. సీతకు English అంటే అసలే యిష్టంలేదు. అందులోనూ గాంధీగారిరోజులు. ఎప్పుడైనా ఒకరోజున చెప్పించుకున్నా మళ్ళా అతను అడిగేదాకా పుస్తకంమొహం చూసేదికాదు. సీతకు బాగా చదువుచెప్పి స్కూలుఫైనలు క్లాసున Pass చేయించాలని రామారావు ఆలోచన. సీత కిది సయించదు. ఎన్ని చెప్పినా వినేదికాని English మాట చెప్పేసరికి ససేమిరా అనేది. ఇలాంటి పిల్లతోటి తన సరదాలన్నీ ఎలాగా తీరడం అని అతనికి ఒక్కొక్క సారి ఎంతో విచారం, కోపంవచ్చేవి. అట్లాంటప్పుడు సీతకు తగిలేవి ఆశీర్వచనాలు. సీతకు కొంచెం పెంకెతనం చేయడం కూడా గద్దు. ఆపెంకెతనం చదువు విషయంలో జాస్తీ అయ్యేది. చదువుకోమని బ్రతిమాలేవాడు, కోప్పడేవాడు, బుజ్జగించేవాడు, సామదానభేదాలు వుపయోగించాడు, కాని లాభం లేకపోయింది. కాపురంక్రొత్తలో సీతవద్దనున్న యీనాగరికత

లోటు అంతగా అతనికి కనుపించక పోయినా రానురాను ఇంగ్లీషు పట్టుదలతో రామారావుకి సీతమీద కొంచెం ఏవగింపు కల్గింది. నాగరికతావరణంకోసం అతను క్లబ్బుకు వెళ్ళడం మొదలుపెట్టాడు. అక్కడ నుంచి రోజూ రామారావు క్లబ్బుకు వెడుతుండేవాడు. ఎప్పుడూ ఎక్కడికైనా వెళ్ళడమో, ఇంట్లో స్నేహితులతోటో కాలక్షేపం చేస్తూవుండేవాడు. సీతవద్ద నిమిషమేనా వుండేవాడుకాదు. సీతమీద ఇష్టం లేకకాదు. ఈవిధంగానైనా సీతబుద్ధి చదువు మీద ప్రాల్తుందేమోనని ఆశ.

చివరకు ఒకరోజున సీత చదువునేర్చుకున్నదాకా అన్యోన్యంగావుండడం కష్టం అని సీతతో చెప్పేశాడు. దానితోటి సీతకు మనస్సు చివుక్కుమన్నది. హృదయం చలించిపోయింది. తన భర్తప్రేమను తాను సంపాయించడం ఎలాగాఅని ఆలోచన. పోనీ ఏదోవిధంగా చదువుకుందామా అంటే English అంటే మనసుకెక్కడు. చదువుకున్నా రాదని ఆమె కొకవిధమైన పిచ్చి నమ్మకం కలిగింది. భర్త అనేమాటలకు వుడుకుబోతుతనం ఒకమూలా, లజ్జ ఒకమూలా, ఇదివరలో చదువుకోలేదని విచారం ఒకమూలా పీడిస్తున్నై. వీటితోనే మనసు పాడై సీతకు జబ్బుచేసింది. పుట్టింటివారు వచ్చి తీసుకువెళ్ళారు. రామారావు తనభార్యకు జబ్బు ఎందుచేతవచ్చిందో కనుక్కోలేదు. పంపననలేదు. సీత వెళ్ళేటప్పుడు మిమ్మల్ని తృప్తిపరచగలశక్తి నాకు వచ్చినప్పుడే నేను మీయింటిలో అడుగుపెట్టడం, లేకుంటే యిదే తుది వందనం" అనిచెప్పి బండెక్కింది.

* * *

సీతకు పుట్టింటి వారెన్నిమందు లిప్పించినా, వంటపట్టడంలేదు. తల్లిదండ్రులకేమీ పాలుపోవటం లేదు సీతవిషయంలో. వారికి సీత వకర్తే కూతురూ, ఇద్దరు కొడుకులున్నా. సీత కడసారపు కానుపు కాబట్టి చిన్నప్పటినుంచీ చాలాగారాబంగా పెరిగింది. అన్నీ సీత యిష్టప్రకారం జరిగించేవారు తల్లిదండ్రులూ, సోదరులుకూడా. ఇప్పుడు పెద్దన్న బి.యె.నూ, చిన్నన్న ఎఫ్.ఎ.నూ చదువుతున్నారు. సీత వైద్యుడిచ్చిన మందు పుచ్చుకునేదికాదు. తల్లిదండ్రులు ఎంత చెప్పినా సరే. ఎల్లాగో పుచ్చుకున్నా ఆజబ్బు తగ్గేదికాదు. చివరకు ఇది మనోవ్యాధిలావుంది. మందు ఏమీ లాభంలేదని సెలవిచ్చాడు డాక్టరు బాబు. ఒకరోజున "ఎందుకీబెంగ చెప్పవూ" అని అడిగారు సీత తండ్రి. అలా చెప్పుతుందాసీత? తల్లీతండ్రీ బలవంతంపెట్టగా అఖరుకి మెల్లిగా చెప్పింది సంగతంతా. సరేలే, దీనికేనా యింతబెంగ, మనోవ్యథా, నేను చెప్పుతా, చదువుకో" అన్నాడు తండ్రి. మంచిరోజు చూచి విఘ్నేశ్వరపూజ చేశారు. దేవతలు తథాస్తు అన్నారు. క్రమంగా నడుస్తున్నాయి సీత చదువూ, ఆరోగ్యంకూడా. ఆవేళతోటి సీతమనసు స్థిమితపడింది.

* * *

సీతవెళ్ళి రెండుమూడు నెలలైనాకూడా, సీతని పంపమనికానీ, ఎలావుందనికానీ

# వనితాలోకము



శ్రీ॥ డాక్టర్ మైత్రేయీ బోస్ కన్య (కలకత్తా)

కలకత్తాయందు చిత్తరంజన్ సేవాసదనమున మహిళా వైద్యాలయమునందు హౌస్ సర్జనుగానున్నది. ఈయమ మ్యూనిచ్ యూనివర్సిటీలో బాలవ్యాధుల గూర్చి ప్రత్యేక పరిశ్రమగొనర్చి కృతార్థతనొంది, బెర్లిన్ ప్రాంతమునందనేక వైద్యశాలలను చూచి భారత వర్షమునకు మరలివచ్చెను.



శ్రీమతి కమలాబాయ్ తిలక్, యం. యే.,

బనారస్ హిందూయూనివర్సిటీ సంబంధియగు మహిళాకళాశాలయందు ఆంగ్లేయభాషా పండితురాలు. ఈయమ సుప్రసిద్ధయగు మహారాష్ట్రికవయిత్రి. సిండికేటులో నెన్నుకొనబడిన మొదటి స్త్రీ సభ్యురాలు. సెనెటునందుగూడ నీమెయొక సభ్యురాలైయున్నది.



సప్తమాంధ్రరాష్ట్రీయమహిళామహాసభ ఏలూరు 4-11-33
స్వచ్ఛందసేవలొనర్చిన బాలికలును బాలకులును.

రామారావు వ్రాశాడుకాదు మామగార్కి. ఇంట్లో చేసిపెట్టేవారు లేక భోజనం హోటలునుంచి తెప్పించుకునేవాడు. తనకు తను పెట్టుకుతినే టప్పుడుమాత్రం సీతలేనిలోటు కన్పించేది. మనస్సు చివుక్కుమనేది. అప్పుడు నాకెందు కిలాంటిబుద్ధి పుట్టాలి, లోకంలో అందరు ఆడవాళ్లూ చదువుకునే భర్తల్తో కాపురాలు చేస్తూ సంసారాలు దిద్దుకుంటున్నారా? ఇది మాఅదృష్టం కాబోలు. నే కోపంపడేటప్పుడు సీత ఎంత చిన్నబుచ్చుకునేదో, నన్ను గురించి ఎంత బాధపడుతోందో" అని పశ్చాత్తాపపడుతూ భోజనం మొదలుపెట్టేవాడు. కాని అన్నం సరిగ్గా సయించేదికాదు. భోజనంచేసి చెయ్యి కడుక్కున్నదాకానే ఆబుద్ధి. ఆతర్వాత పేకా, క్లబ్బు, స్నేహితులూ అదీ ఆతురత.

"పోనీ నన్ను గురించి ఒకసారి బాధపడినా, చదువుకుని బాగుపడుతుందిగదా అనుకుని సంతోషించేవాడు.

రామారావుపినతల్లి రామారావుతో కోడల్నిపంపి చాలారోజులైంది. తీసుకురమ్మని చెప్పేది. కాని రామారావు "తీసుకొస్తా, తొందరేవిటి"అంటూ జరిపేయడం వల్ల పినతల్లి "ఏళ్ళేదో దెబ్బలాడుకున్నారో? లేకపోతే సీత అంటే రాముడికి ఇష్టంలేదో? పండువంటి కాపురం భగ్నం అయ్యింది" అని విచారించేది. నెలరోజులైయింది తాను రామందగ్గరకువచ్చి, ఒకరోజున ఆపలేక పోయిందాందోళన. ఏదో గట్టిగా కనుక్కుని తీరాలని నిశ్చయం చేసుకుంది. అడగడానికి సమయం, అన్నంతినేటప్పుడే రామారావు కనబడడం. ఒకరోజున మజ్జిగవడ్డిస్తూ "అబ్బాయ్, సీతవెళ్ళి చాలా రోజులైంది. నాకు దాన్ని చూడాలనివుంది. తీసుకువస్తూ. మళ్లా నే వెళ్ళిపోతా"నన్నది సుబ్బాయమ్మ.

"నేను స్వయంగావెళ్ళి ఎప్పుడూ తీసుకురాను. తనకు బుద్ధి వచ్చినప్పుడు తానే వస్తుంది."అన్నాడు విసుగుతో.

గుండె గుభేలుమన్నది సుబ్బాయమ్మకి. తనకొడుకు ఇంక కోడల్ని తీసుకురాడని నిశ్చయం చేసుకుంది.

సీత చదువుకుంటూన్న సంగతి రామారావుకు తెలియదు. తెలిస్తే తీసుకువచ్చునేమో?

* * *

సీత రెండేళ్లూ తండ్రివద్దా, పెద్దన్నగారు కేశవరావుదగ్గరా ప్రైవేటుగాచదివి స్కూలు ఫైనలు పరీక్షకు **appear** అయ్యింది. అన్ని పేపర్లూ బాగానే వ్రాసింది. ఇంతవరకూ చదువుబెంగ. ఇంక **Pass or fail** అని బెంగ. పరీక్షతప్పితే తానింక బ్రతకకూడదనుకుంది. కేశవరావు బెజవాడలోవున్న ఒక **Friend**కి వుత్తరం వ్రాశాడు సీత పరీక్షసంగతి ముందుగా వ్రాయమని.

* * *

విశాఖపట్నంలో సుబ్బాయమ్మ రామారావు మేనత్త గంగమ్మకి రామారావు సీతను తీసుక్రానన్నాడనీ, తన కేమీ తోచటం

లేదనీ, తక్షణం రమ్మనీ వుత్తరం వ్రాసింది. గంగమ్మ ఉత్తరం అందినవెంటనే వచ్చింది. సంగతంతావిని ఇంకో సంబంధం చేసుకుంటాడేమో కనుక్కుంటే అన్నది. సుబ్బాయమ్మకిది యిష్టంలేకపోయినా ఎలాగో గంగమ్మ బలవంతంగా వప్పుదలచేసింది.

ఒకనాడు రామాన్ని ఇద్దరూకలిసి అడిగారు ద్వితీయంచేసుకోమని. తన కిష్టంలేనట్టుగా సూచించాడు రామారావు.

పదేపదే అడిగినా నిర్లక్ష్యంగా వూరుకునేవాడు. మౌనం అర్ధాంగీకారం అన్నట్లుగా పినతల్లి మేనత్తలు సంబంధాలు వెతకడం ప్రారంభించారు. రాజమండ్రీలో విరియాల వారి సంబంధంవుంది. 14 ఏళ్ళుంటాయి. 4-వ తరగతి ప్యాసుఅయ్యింది. పిల్ల ఎర్రగా బాగానే ఉంటుంది. కట్నం అంత ఎక్కువగా ఈయలేరు. సాంప్రదాయం అయినపిల్ల. చూసుకోమన్నారు రామాన్ని. వాళ్ళలా అనగానే రామారావువళ్ళు భగ్గున మండిపోయింది. హృదయం వేయితేళ్ళు ఒక్కసారిగా కుట్టినట్లయింది. పట్టజాలనంత కోపం వచ్చింది. తనదగ్గర ఆప్రస్తావన తీసుకువస్తే మాటదక్కదు అనిచెప్పి తటాలున జోళ్ళు వేసుకుని బైటికి వెళ్ళిపోయాడు. కాని అతని మనస్సులో ఒకవిధమైన దిగులు, పశ్చాత్తాపము సిగ్గు ప్రవేశించాయి. తాను పెద్ద అపరాధంచేసిన వాడిలా భావించుకుని కళవళపడ్డాడు. తాను సీతకు అన్యాయం చేశానను కున్నాడు. ఈ భాధలన్నీ ఎందుకు 2,3 రోజులలోవెళ్ళి సీతను తీసుకువస్తే బాగుంటుందని ఆలోచించాడు.

* * *

నాల్గుగంటలైంది. రామారావు క్లబ్బుకి వెళ్ళడానికి సూటు వేసుకుంటున్నాడు. ఇంతట్లోకే గుమ్మందగ్గర బండీ ఆగింది. ఏమిటా బండీ అని రామారావు కిటికీలోనుంచే చూశాడు. బండీలోనుంచి నవనోన్మేష సౌందర్యవిలాసిని అయిన 18 యేండ్లయువతి కాళ్ళకి స్లిప్పర్సు, కళ్ళకోజోడు, చేతికో రిష్టువాచీ, మెడలో ఓచైనూ, వాలుజడా, రిబ్బను వేసుకుని, చేతిలో ఒకకార్డు పట్టుకుని నవనాగరికతా వేషంతో, తనకన్నా కొంచెం పెద్దవాడైన పురుషునితో లోన ప్రవేశించింది. రామారావు ఆ అపరిచితుడినిచూసి నిర్ఘాంతపోయి,

“ఏమోయ్ బావా ఎక్కడినుంచిరాక! అన్నాడు”, అతనితో అంత పరిచయంగా వచ్చిన ఆస్త్రీ ఎవరా అని ఆమెవైపు క్రీగంట చూస్తూ.

ఇంటి దగ్గరనుంచే అన్నాడు కేశవరావు చిరునవ్వుతో. ఇంతట్లోకే సుబ్బాయమ్మ నిర్ఘాంతపోతూ కాళ్ళు కడుక్కోడానికి నీళ్ళుపట్టుకు వచ్చింది. గుమ్మంలో ఒకమూల నాగరికతాకారంలోవున్న సీతను చూచి ఆశ్చర్యపడింది. కుశల ప్రశ్నలైనాయి. సీత తిన్నగా గదిలోకివెళ్ళి తన్ను

గురించి నూతనావేశంతో గదిలోకి వెళ్ళివున్న రామారావుకు కార్డు అందించింది. బెజవాడనుంచి కేశవరావు స్నేహితుడు కామేశ్వరం సీత స్కూలుఫైనలుక్లాసు ప్యాసయినట్లు వ్రాసినకార్డు అది. రామారావు ఆశ్చర్యపడిపోయాడు. అతనికి పట్టజాలనంత ఆనందంకలిగింది. తానదృష్టవంతుడి ననుకున్నాడు. పాపం సీత చదువుకున్న సంగతే అతనికి తెలియదు.

"ఎక్కడికో ప్రయాణం అయినట్లున్నారు. నే నడ్డుకాదుకదా!" అంది సీత చిరునవ్వుతో, సగర్వంగా.

"ఇక్కడికే" అంటూ సీతకు అతిసామీప్యంగావస్తూ రామారావు అన్నాడు అతులితానందంతో.

* * *

సీతకువచ్చిన దీక్ష చదువుమీద శ్రద్ధవుండా?

లేక

భర్తమీద ప్రేమవలనా?

---

## ప్రణయమహిమ

అధికార్ల సూర్యనారాయణరావుగారు, బి.యె.,బి.యల్.

సూర్యభగవాను డుదయంబు చూపుచుండ
నవని యానంద సందీప్తమైన యట్లు,
ప్రాణసఖియరో! నీవు నావద్దనున్న
నూతనోల్లాస మెదలోన నూలుకొనును!

సందెబంగరు వినువీధి జిందువేళ
కాంచుకనులకు మోక్షంబు కల్గునటులు
జానకీ! నిన్ను చూడ నామానసంబు
సంతసంపు నెత్తురుతోడ జల్లుమనును!

జలధియిసుకల శయనించి చదలవైపు
చూచుకొలదిని విభ్రమం బేచునట్లు
మగువ! నీయెడ ప్రణయాగ్ని రగులువేళ
మనముతప్ప తక్కిన వెల్లమాయమగును!

# నిశాకాంత

శ్రీమతి కృష్ణాకుమారిగారు

ఉషఃకాలమునసె తన్ను చూచి తనసవతి పగటి పడుచు కిలకిలనవ్వి అవమానంచేసింది. ఆ యవమానాన్ని సహించుకో లేకపోయింది నిశాకాంత. పేదరాలి కోపం పెదవులకు చేటన్నట్లిప్పటి తన దౌర్బల్యంచేత "కి"మ్మనకుండా ఊరుకుంది. కాని లోపల కోపంలేక పోలేదు; నిశాకాంతకు.

ఇంకిప్పుడు తనరాజ్యం వచ్చింది. తన ప్రతాపం చూపడానికి మొదలుపెట్టింది. ముందు ముఖమెఱ్ఱజేసింది. దానికే పగటిపడుచు ముసలిదైపోవడంచేత హడలెత్తి తనసవతిధాటీ కాగలేక తలవంచుకొంది. తన ప్రథమప్రయత్నమే కొనసాగినందుల కా నిశాటి యెంతసంతోషించిందో యెన్ని దేవుళ్ళకు మ్రొక్కుకున్నదో యెవరికి తెలుసు?

అక్కణ్ణుంచి పక్షుల కిలకిలారావాలతో తన సవతికి యుద్ధానికి రాయబారాలు జరిపింది. ఆ కిలకిలారావాలతో సవతిని దూషించిందని కొందఱంటారు. అతి కోపం ఏడ్పులోకి మారుతుంది కనుక ప్రొద్దుట్నించీ ఉన్న కోపాన్నాపుకోలేక యేడ్చిందనంటారు కొంతమంది.

ఏదియేలాగైతే మనకేం? మనమేమార్చేవాళ్ళమా? తీర్చేవాళ్ళమా?

తన యేడ్పరణ్యరోదనము కాగా, ఎవరూ వినక పోతే మొగమెఱ్ఱబడేటట్లేడ్చేడ్చి చివఱకూరుకొందని కొంద ఱంటారు.

అంతటితో ఊరుకొందీ! లేదు. కొంతకాలము నుంచీ తన సవతిరాజ్యంలో సుఖపడి, తన సవతికి బంధువులు ప్రియతమములునైన పద్మములను తనసవతికి బుద్ధిచెప్పమనో, లేక శత్రురాజ్ఞి రాజ్యములోని వారనో చీవాట్లుపెట్టి తలయెత్తకుండా చేసింది. తన జయాన్ని తెలుపడానికి కాబోలు శాత్రవులైన చక్రవాకాల్ని బంధు విరహాగ్ని సంతప్తులనుగాజేసి వారి ప్రేమ ధనాన్ని దోచుకొంది. ఆతరువాత తన అంధకార పతాకాన్ని పైకెత్తి దానిక్రింద తన ప్రజలకు కుముదినులకు తావొసగి వారలను సంతోషపఱచింది.

పరిహాసమాత్రాననే తన సవతిపై నిశాకాంత యీర్ష్యయెందులకో?

ఇంక తనభర్త కాలపురుషుఁడు వచ్చేసమయమయింది. కాని తాను వాసవసజ్జిక కాలేదు. ఖండితనాయికాలలామ యయింది. భర్త వచ్చేటప్పటికి చెందొగలంచు నల్లకోక కాళ్ళవ్రేళ్ళ జీరాడునట్లు కట్టింది. అదివఱకు తలలో ముడుచుకొన్న పూవుల నన్నిటి నెగజిమ్మింది. వానినే నక్షత్రాలన్నారు. చూడామణినిదీసి కోపముకొద్దీ నేలకేసికొట్టింది. తత్ఫలమో అన్నట్లా చూడామణి వంకలుపోయి పదహారుముక్కలై పంచబంగారమైపోయింది. ఓ ముక్క యీశాన్యంగాపోతే, దాన్నీశ్వరుఁడు తీసుకొని యింతవఱ కియ్యలేదు. కొన్నాళ్ళసలు చూడామణి కనబడనేలేదు. ఆ చూడామణినే యీకవులంతా జాబిల్లి, చందమామ, మృగాంకుఁడనియేవేవో పేర్లు పెట్టి పిలుస్తున్నారు. తన నెచ్చెలులైన చకోరాలు హితవు చెప్పదలచికూడ యీ సమయంలోవస్తే తమ్మెంత హైన్యంగా చూస్తుందోఅని దగ్గఱకైనా రాకుండా దూరంగా తొలగిపోయాయి. కొన్నివచ్చికూడ తగినసత్కారం పొందక అవమానంతో వంచిన తలయెత్తకుండా వెళ్ళిపోయాయి.

ఇదంతా చూస్తూన్న కాలపురుషుఁడు తన ప్రియురాల్ని శాంతింపజేద్దామని భయపడుతూనే మెల్లిగా వచ్చాడు. సత్యభామలాగ ఎడమకాలితో తన్నిందో లేదో తెలీదు కాని, కాలపురుషుఁ డనుకొన్నంతపనీ జరిగింది. నిశాకాంత ఆవచ్చిన భర్తను సగిసరీతిగా సత్కరించలేదు కాబోలు. అతనిముఖమైనా సరిగ చూడలేదనుకొంటాను. తన కౌగిలి నీలేదు కాబోలు. తన్ను విడిచి పగటిపడుచువద్దకే వెళ్ళమందనుకొంటాను. కాలపురుషుఁడభిసారికా వచనాలనే వ్యాజంతో నెంతో సేపు బ్రతిమలాడాడు. కాని నిశాకాంతకలహాంతరితయై ఒప్పుకోలేదు. బదులైనా పలుకలేదు. అందుకనే కాలపురుషుడు విసుక్కొని తన కర్మను తిట్టుకొంటూ గడబిడచేయకుండా పగటి పడుచునొద్దకు జరిగిపోయాడు.

తమ్మాదరించు వారివద్దకు తెలుచుగాను, తొందరతోను ప్రేముడితోను వెళ్లడం లోకంలో సహజమే కాదూ?

# పరమేశ్వరా!

శెట్టిపల్లి వెంకటరత్నంచౌదరిగారు

౧

ప్రపంచమంతయు భయంకరమగు బీభత్సప్రదర్శనములతో నిండి మానవుని భౌతికపారమార్థిక భావముల విధ్వంస మొనర్చుచున్నది. నిరాశచే నిండిన వేడినిట్టూర్పులు హృదయపుటముల బీటలు వారజేయుచున్నవి.

౨

ఈతమోవిలీనమైన జగత్తునుండి ఒకశబ్దము వెడలుచున్నది. అది ప్రణవసమన్వితమగు శబ్దబ్రహ్మమా? —కాదు. తపఃశ్శక్తి తేజఃశ్శాలులగు ప్రాచ్యఖండ మహర్షుల సత్యసూక్తియును గాదు. నాస్తికవాదుల యజ్ఞానతిమిరమును వెడలనడుపు భగవద్వాక్యభాస్కరమూర్తియు గాదు. ఆశబ్దము ఆహృదయ విదారకధ్వని "లోభి ఎవరు? భగవంతుడే" యను ప్రబలమైన నాస్తికవాదమునకు ఇంధనమగు శబ్దము. ఈభావము సర్వత్ర తన ప్రభావమును గ్రుమ్మరించి వేయుచున్నది. ఇది ప్రాచుర్యము నందినచో ధర్మమునకెచట చోటుండును?

పరమేశ్వరా!

చిన్ని అపవాదునకు జంకి రామావతార సమయమున జానకిని పరిత్యజింపలేదా? నాటి యా అపవాదుకంటె భయంకరమైన కఠినమైన కల్భిషయుతమైన ఘోరమైన యపవాదు బయలుదేరినది. దానితోబాటు తలచినచో సామ్రాజ్యాధిపత్యమును, మహత్సంపదలను చేకూర్పజాలు దేవుడు లోభితనముచే గాదా—నిర్ధనికుల సృజించుట.—దానితోబాటు నీయందలి నీవిశుద్ధచరిత్రయందలి విశ్వాసము క్షీణించి పోవుచున్నది.

దేవా! నూతనసృష్టితంత్రమునకు బూనుకొని నీపైగల యీ యపవాదును బారద్రోలుకొనుము. యుష్మదీయాంశసంభూతులగు జనాళిపై ప్రేమామృతమును వర్షించుము.

# శిశుపాఠశాలలు

అనువాదకుడు : విజ్ఞానభిక్షు

శైశవమానసికావస్థ జిజ్ఞాసలవలన ఖచితముగా క్రోడీకరింపబడిన పర్యవసాన మేమనగా: మంచికిగాని చెడ్డకుగాని వ్యక్తుల ప్రవర్తన కను బాల్యావస్థయందే సిద్ధపడుచున్నదనియు శిశువు మూడేండ్లప్రాయమున నున్నప్పుడే సంస్కారాభేద్యముగ ప్రవర్తన స్థిరరూపము నొందుచున్నదనియు ఫ్రాయిడు పండితానుచరులు కొందరందురు. కాని యం దొకింతయైన నతిశయోక్తి లేకపోలేదు. వారి యభిప్రాయము భ్రమజనితమేయయినను యుక్తమార్గముననే భ్రమించుచున్నది. ఆస్ట్రియాదేశ నగరమణియగు వియన్నాపట్టణమందలి ఆల్ఫ్రెడ్డు ఆడ్లెరు పండితుని ననుసరించెడి మానసిక శాస్త్రవేత్తలు శిశువునకు సాంఘికగుణజాల మబ్బించుటకు ఒడిలోనున్నప్పటినుండియు తల్లియె జాగ్రతపడియుండుట యగత్యమని వ్యక్తిగతముగ నొక్కి వక్కాణించుచున్నారు.

సామాన్యవ్యక్తులమని తలంచుచున్న మనలో ప్రతివారు నే భయభ్రాంత్యావరోధముల నడుమనుండి జీవితము నతికష్టముతో సాగించుచున్నారో అయ్యవియు, శిశుసంరక్షణాసమస్యయొక్క ఘట్టములును, మన బాల్యదశయందలి యసంబద్ధశిక్షను బట్టియె యుత్పత్తియగుచున్నవని చెప్పనగును. తీరికలేనితలిదండ్రుల మూర్ఖభావమువలననో, అత్యధిక నిర్బంధముగల గృహశిక్షవలననో బిడ్డలయందెక్కువమంది ఫలరహితులగుచున్నారు. పై రెండు విశేషములందును, జననీజనకులు మనోగతి యొక్క సాధారణధర్మముల నెరుంగమి ప్రపంచమున సంతుష్టులును, ధైర్యవంతులును సుఖారోగ్యవంతులునగు వ్యక్తులకు బదులుగా పథభ్రష్టు లుత్పత్తిలుటకు కారణమగుచున్నది.

ఈ మానసవ్యగ్రతను బాపుటకొఱకు పాశ్చాత్యదేశములందు నానా విధోపదేశాలయముల నెలకొల్పుచున్నారు. కిండెరుగార్టెనులు (అనగా బాలక్రీడావినోదాలయములు) శిశుపాఠశాలలు, శిశుమార్గదర్శకాలయములు మున్నగునవి మెండుగ దెలువబడుచున్నవి. ఆ యాలయములందు శైశవ మానసిక వైచిత్ర్యజ్ఞులు, వివిధప్రాయములుగల బిడ్డలయెడ గడుజాగ్రత గైకొనుచున్నారు.

ప్రకృత మీ వ్యాసమునందు శిశుపాఠశాలలగూర్చియు, బాలవినోదక్రీడాలయముల గూర్చియు మాత్రమె, తలపెట్టబడుచున్నది.

కిండెరుగార్టెనుల (బాలవినోద క్రీడాలయముల) వంటి భోగములను భారతీయ శిశుబృందములకు ఇండియావంటి దారిద్ర్యతాడిత దేశ మొసంగజాలదను వాద మొకవు డుపాలంబించబడవచ్చును. కాని అట్టి సంస్థలకొఱకు ధన మొసంగుట నభ్యంతరపరచుటకు మన నిర్భాగ్యతకంటె విషయముల పరస్పరప్రయోజనముల గమనింపజాలని మన యజ్ఞానాచ్ఛాదమే బలవత్తర ప్రతి

బంధకముగనున్నది. ఆస్ట్రియా దేశము పశ్చిమఖండమందు సంపద్భ్రష్టమగు దేశములలో నొక్కటిగ లెక్కింపబడుచున్నది. అయ్యు నైరోపాఖండమం దితరత్రగలవాని యన్నింటికంటె మిన్నలగు బాలవినోద క్రీడాలయము లాస్ట్రియాదేశమునందె నెలకొల్పబడియున్నవి. సాండ్లీటను కిండరుగార్టెను భవనము వియన్నానగరమున వెలయుచున్నది. ఈ భవనమందలి నడవలందును, గదులందును, పైభాగమందును, ఉద్యానవనమందును తిరుగాడువారు శిశు వైజ్ఞానిక నిర్మాణాలయమందు విహరించుచున్నామని మఱచి మహారాజాంతఃసౌధముల విహరించుచున్నామనియె భ్రమించక పోరు. ఇట్టి దివ్యశిక్షామందిరమందున్న డింభకజాల మందర్ధభాగము నామమాత్ర వేతనములనయిన నొసంగజాలనంతటి భాగ్యేతరజన్ములు. ఈ విద్యాసౌధమం దిన్నూరు మందిబిడ్డలు శిక్ష నొందు సౌకర్యము లమర్చబడియున్నవి. ఉదయము 7,8 గంటలనడుమ బడికివచ్చి సాయంకాలము 5, 6 గంటలమధ్యను స్వగృహములకు వారు మఱలెదరు. దినచర్య యిచట వివిధ విశేష కల్పకమైయుండును. భోజనములకును, మధ్యాహ్నవిరామమునకును, విద్యాలయ ప్రవేశ నిష్క్రమణములకును మాత్రమే కాల నియమ మేర్పరుపబడియున్నది. తద్భిన్న కాలములందు వా రతికార్యాభిముఖులయి యుందురు. అందుకు గావలసినంత వస్తు సమృద్ధియు గలదచట. వారి కిష్టమువచ్చినట్లు పెద్ద పెద్ద కాగితములపై చేతికివచ్చిన చిత్రముల వ్రాయుదురు. రంగుల వేయుదురు. నల్లపలక ప్రతిగదినడుమ నమర్చబడియుండును. దానిపై వారి చిత్తానుసారము గీతలు గీయవచ్చును. పిమ్మట వ్రాయవచ్చును. రంగురంగుల కాకితపు పేలికలతోడను, జున్నుపెట్టెల యట్టలతోడను, వారు తమకు దోచినరీతి చిత్రవిచిత్రములగు పండ్లబుట్టల నల్లుచుందురు. వారి మనోగతభావమూర్తులు యథేచ్ఛగా తాండవించునట్లు రైలుబండ్లు, దుర్గములు, కొండలు, ఇండ్లు, ఇంక నెన్నియొ విశేషములను సిద్ధముచేయబడిన బంకనుద్దతో సృష్టించుచుందురు: లయ మొనర్చుచుందురు. వలయునంత యిసుకయు, చిన్ని చిన్ని కఱ్ఱ చౌకములును నచటనుండును. రంగులు పూయబడిన పూసలు, తలలు, బద్దలు, మానవాదిముఖాకారములను స్ఫురించునట్లు నల్లరంగు చిహ్నములుగల వెలగపండు మున్నగువాని డొక్కులు, మెకానోయను యాంత్రిక నిర్మాణభాగములు, మున్నగు నానానేకక్రీడాసాధనచయ మపరిమితముగ నుండును. ఇవియన్నియు, నాయర్భకుల కందుబడిలో గోడలయందున్న గూళ్లలో నమర్చబడియుండును. వానిని వారి వారి యిచ్ఛానుసారము వారే గైకొని యాడుకొనుచుందురు. మరికొన్ని బాల క్రీడాలయములయందు పెంపుడు పశు పక్షు లుండును. చెవులపిల్లులు, కుక్కలు, కోళ్లు, చిలుకలు, పిల్లులు మున్నగునవియుండును. వానిని కుడుపుట, పాలుబోయుట, వానితో నాటలాడుట మున్నగు కార్యములం దాచి

రుత లుత్కృష్టానంద విజ్ఞానముల బడయు చుందురు. తోటలు సైతముండును. చన్నీటి స్నానఘట్టములుకూడ నుండును. ఉష్ణదినములం దచట వా రర్ధాంబరులై జలకమాడుదురు. నీళ్ల జల్లుకొందురు. వానియందు పడవలు, ఓడలు, హంసలు, విమానములం దేల్చుచు నాడుకొనుచుందురు.

ఇంతవరకు నా బాలక్రీడాలయములందలి స్థూలాకృతిగూర్చి తెలిసికొంటిమి. ఇక నొకమాట. వారి పరస్పరసంగత్వము, నందు మూలమున నొండొరుల మధ్య జనించు సంబంధములగూర్చి చెప్పవలసియున్నది. ఇవి అనగా, నీ బాలక్రీడాలయములు కర్మాగారములందు భృత్యోన్ముఖులై యున్న పేదల సంతానముల విలాసార్థమేయని తలంపబడుట ప్రామాదికము. మానసిక ధర్మశాస్త్రముప్రకారము శిశు పాఠశాల లన్ని తరగతుల మానవార్భకులకెల్ల నగత్యములై యున్నవి. తనచే కొన్ని పనులు కావని ప్రతిబిడ్డయు నిరుత్సాహపీడితయగును. తన కంటె పెద్దవారు చేయగల పనులు తనకు చేతగావని శిశువు తలంచుట స్వాభావికము. ఈ నిరసనభావము పెరుగ విడువబడినచో జన్మాంతమువఱకు హృదయదౌర్బల్యము బింకమగుచు నితాంతనిరుత్సాహమునకు కారణమగును. కాని యుక్తపరిసరములు ప్రాప్తించినచో నా దౌర్బల్యము విచ్ఛిత్తి నొంది రానురాను ఫలసిద్ధికి ప్రసిద్ధోద్బోధక హేతు వేర్పడును. బీరచెట్టు ఎట్లు ఒక యవస్థనుండి వేఱొక యవస్థకు దబ్బున మారజాలక ఒక దాపునుండి మఱియొక దాపు నానుకొని ప్రాకి పెద్దదగునో ఆవిధము వనే శిశువుగూడ తన సహాధ్యాయులు— కించిదున్నతి బొందినవారగుట — చేయు దానిని గమనించి తనచేతగామి భ్రాంతిని వీడి, స్వయముగ చేయుటకు సహజధైర్యో త్సాహముల గ్రహింపగలును. తనకంటె నతివృద్ధులగు వారియొక్క పనులజూచి యనుసరించుట తలకుమీరిన పనియని చిన్న నాటగ్రోలె దిగులొందునుగాని సమాన స్కంధులును, ఇంచుమించువయస్కులును జేసెడి కృత్యముల తా నవలీల జేయగడంగు చునేయుండును. ఇరుగుపొరుగులలో ప్రతి బిడ్డయు తనకంటె చిన్నబిడ్డతో నాడు కొనుట తనకు దగదని భావించును. నిర్బం ధముపై నాడుకొనవలసివచ్చినచో, చిన్న వారిచే పెద్దబిడ్డ లేమియు చేయనివ్వరు. ఏతత్కారణమున బిడ్డలు సమానస్కంధుల తోడనే జట్టుకూడుచుందురు. అందుచేత ఒక గృహమందు వారి కొదుగైన సఖ్యము సంప్రాప్తముకాదు; వలయునంతమంది పిల్లలు గాని, వలసిన ప్రాయములుగాని జతపడవు గాన శిశువుల పాఠశాలలో 20, 30 మంది పిల్లల, 2నుండి 6 యేండ్లవారిని—నొక జట్టుగా నుంచి యొకచోట నాడుకొననిత్తురు. ఇట్టి కించిదసమానస్కంధత కేవల సమాన స్కంధతకంటె శ్రేయస్కరము. ఇందువలన చిన్నవయస్కులు తమకంటె కించిదధిక ప్రాయులు చేయువాని నెల్ల తామును చేయ గలుగుదుమని సంరంభించుచునేయుంట కవ

కాశమేర్పడును. సమానవయస్కులతో మైత్రి ప్రతిబిడ్డకు నేర్పడుటయేగాక కించిద్వ్రియాధికుల మార్గవర్తులై పెరుగుట కూడ సంభవించుటచే జ్ఞానాభ్యుత్థానము క్రమేణ సిద్ధించుచుండును. చిన్నపిల్లలకు ఆటపాటలయందు వారిలో వారు "ఉత్తుత్తన్నలు, అక్కలు, అమ్మలునై బుద్ధులు చెప్పునట్లును సంరక్షణ చేయునట్లును నటించుచుందురు. ఇట్టి పాఠశాలలు ముఖ్యముగా పెద్దింటి జ్యేష్ఠులకు నేకైకబిడ్డలకును ముఖ్యావసరము. ఆ పాఠశాలలు ప్రాపంచిక సాంఘిక సంబంధ సాంప్రదాయముల పరిచయము శిశువులందరకు గలుగజేయు టగత్యము. ఇంతియగాక నీ శిశుపాఠశాలలోనే బిడ్డ తన నిజస్థితిని ఇతరులయెడ తనకుగల బాధ్యతయు గ్రహింపగలుగును. అట్లు సుశిక్షితులగు బిడ్డలు సత్పథనిర్మాణమొనర్చుకొని తమతమ స్థానముల ప్రపంచమున నలంకరింప రాగలరు. వారి జ్ఞానేంద్రియము లా పాఠశాలలం దుత్తమాభ్యాసమునందియుండుటవలన తమతమ పరివృతములనుండి శుభంకరఫలమును బడయుగల్గుదురు. సంస్ఫురణ, నైర్మల్యత, వ్యక్తిత్వము, ఆత్మవిశ్వాసము మున్నగు లక్షణములు నొక వంకను, సాంఘికానుకూలప్రవర్తన నింకొక వంకను వారు నేర్చియుందురు. వా రాత్మసంకుచితులుగాని, అధోబద్ధులుగాని కారు. సంఘమందు తమ సహజస్థానము ననుగమించుచుందురు. ఆత్మాప్రయోజకధ్యానము వలనగాని భయభ్రాంతులవలనగాని వారు తమ భావాభ్యున్నతులయందు సన్నగిలకుందురు.

శిశుపాఠశాల శిశువుల బాగోగుల మాత్రమే చూచుకొని యితరత్ర మాకీ భావమును వహించియుండు నెడల తన విధ్యుక్తమును యుక్తమార్గమున నెరవేర్చినది కాజాలదు. మన జననీజనకులకుగల శిశుశిక్షావిధానముగూర్చిన యజ్ఞానము భయంకరాకృతి దాల్చియున్నది. ప్రతి శిశుపాఠశాలయు నొక్కొక జననీమండలమును సమావేశపరచి ప్రబోధమూలమున శిశుమానసికతత్త్వాంశముల గఱపుచుండ నగును. శిశుపాఠశాల వాసన నలవడజేసికొనిన పిల్లలు తమ గృహములందును గదలిక గలుగజేయకపోరు. ఎవరు బిడ్డల యభ్యుదయమునకు బాటుపడెదరో వారు మానవకోటినంతటిని సేవించువారనియు, అట్టి సూక్ష్మసేవ ఇంకొకవిధమున నుండజాలదనియు జెప్పెడి మాట సత్యేతరముకాదు.

వేలకొలది శిశువులు "నేను జీవింప మొదలిడకుండనే నన్ను జావనివ్వకు"డను మాత్యూ ఆర్నాల్డుగారి ప్రార్థనమును చేయుచున్నారు. ఈ ప్రార్థనను మనము పెడచెవింబెట్ట నంగీకరింతుమాయని శ్రీ జి. ఎప్. లఖాని, బి.ఏ., డిపిల్. ఎడ్ (ఆఫ్ ఎడింబరో)గారు మాడరను రెవ్యూయందు వ్రాయుచున్నారు.

గృహలక్ష్మి యీ పాఠశాలల యగత్యము గ్రహించుగాక.

# వీర బాలిక చంపావతి

శ్రీమతి తిరువీధుల అనసూయాదేవిగారు

అది ఆరావళీపర్వతారణ్యవాటిక. త్రాచుపాముపిల్లవలె పరుగులెత్తుచుండు సెలయేటితీరము. సాంద్రముగ పెరిగియున్న మహావృక్షముల నడుమ నొక పటకుటీరము. అందు రాణాప్రతాపుడును మహారాణీ గుణవతియు ఆరువత్సరముల బాలుని, పన్నెండేళ్ళయొక బాలికను ముందు పరుండబెట్టుకొని ఆసీనులై యుండిరి. వారు ధరించినవి ముతక బట్టలు. వారి శరీరములు బక్కచిక్కియున్నవి. వదనములు తీవ్రవిచారగ్రస్తములై యున్నవి. కాని వారిరువురి విశాలనయనములయందు రాజపుత్రశౌర్యాగ్ని ప్రజ్వరిల్లుచునే యుండెను. ఏదియో గభీరవిషయ మిప్పుడు వారి హృదయముల కలతపెట్టుచున్నది. చాలకాలమువరకు వారు మౌనము దాల్చియుండిరి. తుదకు రాణాప్రతాపుడు దీర్ఘనిశ్వాసముపుచ్చి, "గుణవతీ! మనమెంత దురదృష్టవంతులము. వీవనలు వీచుచు చెలువ లడుగులొత్తుచుండ రమ్యహర్మ్యసౌధాంతరోపరిభాగంబున కనకకట్టిమంబులపై నిద్రించు మన ప్రియపుత్రుడు అమరసింహుడు ఆకలిచే యేడ్చియేడ్చి యిప్పుడే నిద్రించెను. భరతఖండ రాజ్యరమాధినాథుని రాజసౌధ మెక్కడ? ఘాతుక మృగసంతానంబులకును హాలహలపూరితకాలభుజంగవితతికిని నాలవాలంబగు నిర్జననిబిడారణ్యమందున్న యీజర్జర పర్ణకుటీర మెక్కడ. పరమేశ్వరుని కరుణాపూర్ణదృక్కుల కెంత దూరమయితిమి. రెండురోజులనుండి ఆహారము ముట్టియెరుంగనిదగుటచే చంపావతికి నీరసమెక్కువై స్పృహదప్పి పడిపోయినది. నాకన్నుల యెదుట నాసంతానమున కిట్టి దురవస్థ వాటిల్లుట నేనెట్లు ఓర్చుకుని చూడగలుగుదును." ఇట్లనుచు నాతడిక దుఃఖము నాపుకొనజాలక గుణవతి యొడిలో తలనిడి శోకింపుచుండెను. దివ్యతేజోవిలసితంబగు నాతని నేత్రద్వయమునుండి బాష్పకణము లొక్కొక్కటిగ ధారారూపంబున స్రవింపజొచ్చెను.

గుణవతి:—నాధా! భయపడకుము. జయాపజయములు దైవాధీనములు. సకల భూవలయంబున కీభవ్యభారతవర్షమే గుండెకాయ. ఇట్టి పవిత్ర భారతదేశమున జననమొంది మేవాడరాజ్యరమాధినాథుండవై వైరిభీకరారణ్యములను కార్చిచ్చుబోలె దహించిన శౌర్యాగ్ని యిప్పటికిని మీనేత్రయుగ్మమున ప్రతిఫలించుచునే యున్నది. మీహృదయమున అధైర్యమునకు తావియుట ధర్మముగాదు. ధైర్యశౌర్యముల ముందు కష్టనష్టములను లెక్కించుట పాడిగాదు. నిరుత్సాహమును బడయక, నిస్తేజమును దరిజేరనీయక, నీరసత్వమను పదమును స్మరింపక, మనఃపూర్వకంబుగ, కర్తవ్యపరా

యుణులుగండు. పరమేశ్వరుడు తప్పక మీకు సహాయమొనర్చును.

ఉత్సాహరసపూరితములగు గుణవతి ప్రోత్సాహవాక్యములు విన్నంతనే ప్రతాపసింహుడు లేచి కూర్చుని కొంతదుఃఖ ముపశమింప యేదియో ఆలోచించుచుండెను. ఇంతలో బయట నొకశబ్దము వినవచ్చెను.

ప్రతా:—గుణవతీ! బయట నేదియో చప్పుడు వినవచ్చుచున్నది.

గుణవతి:—యెండుటాకుల మర్మరధ్వని కాబోలు!

ప్రతా:—గుణవతీ! అక్బరుపాదుషా రాయబార మంపియున్నాడు. మన దుస్థితి కాతడు మిక్కిలి విచారపడుచుంటినని తెల్పుచు, సంధి కంగీకరించుమని కోరుచున్నాడు. ప్రస్తుత పరిస్థితినిబట్టి సంధి కంగీకరించుటయే ఉత్తమము. పేరునకుమాత్రము రాజ్యము స్వీకరించుటకు నేనిచ్చగించినచో అతడిక నాతో యుద్ధముసేయనని శపథము చేయుచున్నాడు. తినుటకు తిండియైనను లేక అల్లాడుచున్న మనబిడ్డలకై అతడు మాత్రము విచారము నొందకుండునా? అక్బరుపాదుషా నిజముగ దయార్ద్రహృదయుడు.

మృదులపల్లవమునుబోలు చంపావతి యుల్లమున కీవాక్యములు బల్లెపుపోటువలె పొడుచుకొనినవి కాబోలు. ముంచుకొని వచ్చు నీరసమును లక్ష్యముసేయక ముంజేతులాధారముగ తలపైకెత్తి "తండ్రీ! అక్బరుపాదుషా దయార్ద్రహృదయము నేడు కనుగొంటివా? "ఆత్మవశం సర్వసుఖం—పరవశం సర్వదుఃఖ"మ్మను సూక్తినే సర్వదా జపించుచుండు నీవు నే డీసంధికి నొడంబడుట యనుపదము నెట్లుచ్చరింపగలిగితివి? రసపుత్రుల స్వాతంత్ర్యము నేటితో.........

...రసపుత్రుల స్వాతంత్ర్యము నేటితో అస్తమించినట్టే. క్షుద్బాధచే కృశింపుచున్న నీబిడ్డలకై యాతడు విచారపడుచుండెనా? హల్దీఘాటు యుద్ధము నాతడింతలో మరచిపోయెను గాబోలు! రాణావారి సంతాన మాతని యాదరణ గడ్డిపరకవలె చూచును గాక" అని ఇక ఆమె మాటలాడజాలక మరల భూమిపై పరుండెను.

కుమారి పౌరుషప్రభావాతిశయభరితములగు వాక్యములు ప్రతాపసింహుని హృదంతరాళమున ప్రతిధ్వనించినవి. నూతనోత్సాహభరితుడై, విశాల వదనమండలమున గంభీరభావమాలికలు నృత్యముసేయ శౌర్యోద్దీపితవాక్యములతో "నా శరీరములో ప్రాణము గల్గియుండు వరకు నా స్వాతంత్ర్యమునకు కష్టమురాకుండ కాపాడెదను. సంధియను పదమును నాచెవులకుకూడ వినపడనీయను. నా హస్తమునందెంతవరకు ఆయుధముండునో (అనుచు ఖడ్గమును వరలోనుండి బయటకులాగి) నాకు సహాయమొనర్చు ప్రియమా! యెంతవరకు

నీవు నాకరద్వయ మలంకరించి యుండువో అంతవరకు ప్రతాపసింహుకు విజయమునే బడయును. ఇంతే దనుక నిన్ను మరిచిపోయి నందుకు క్షమింపుము. వ్యాకులపడకుము. ఈసారి యుద్ధములో మొగలుల వేడి రక్తము నిండారరుచి జూపెదను. (ఇట్లనుచు చంపావతి వైపుకు దిరిగి) "ప్రియకుమారీ! చింతనొందకుము. నీవంటి వీర బాలికను తనయగా బడసి ధన్యుడనై తిని. ఇక అక్బరుపాదుషా నన్ను జయించుట కలలోని వార్త" అనెను.

ఇదంతయు పటకుటీరద్వారము చెంతదాగి నిలువబడి వినుచున్న అక్బరు వెంటనే లోనికి జొరబడి, "ఓ ప్రతాపసింహమహారాజా! నీ తనయవంటి వీరదేవత పుట్టుకచే భారతవర్ష మంతయు పునీతమైనది ఇట్టి కుమారీరత్నముల గాంచియేకదా మాతాపితలు మహదానందసంభరిత హృదయులగునది. అగణితంబులగు తారకల అల్పప్రకాశంబున అంధకారాచ్ఛాదితంబగుజగము ప్రకాశవంతముకాజాలక సంపూర్ణ జ్యోతిమయుండగు చంద్రనాధుని జ్యోత్స్నచే కాంతివంతమయినటులే శౌర్యగుణరహితులగు పుత్త్రులు సహస్రసంఖ్యాకులు నెరవేర్పజాలని ఘనకార్యమునందు సంపూర్ణ విజయము బడయ నెంచినదై నీకీయుపదేశ మొనర్చి సమరసన్నద్ధు గావించినది. ఇక కత్తిబట్టి నీతో యుద్ధమొనర్చి రానున్న అపజయముల నెదుర్కొనజాల" ననియెను. ఈవిచిత్రసంఘటనమున కచ్చెరువొంది రాణాప్రతాపుడును మహారాణిగుణవతియు, కుమారీముఖమండలమును తదేకదృష్టితో జూచుచు నట్లే నిలువబడిపోయిరి.

---

## పల్లెపిల్ల

గవను వెంకటకృష్ణయ్యగారు

(గుడికిపోవుట)

సీ॥ కొనగోళ్లసవరించి యనువుగానల్లిన జడలోనిపూదండ కదులునిగుడ,
కులుకుంజన్నులపైని గలకాంతిపుంజంబు వలిపపయ్యెదఁ బీతపటముసేయ,
నిద్దంపుటద్దాల నిందించుచెక్కిళ్లఁ గమనీయరోచులు గడలుకొనఁగ,
చిగురాకునునుఁగాంతిఁ దెగనాడుపాదాల చెంగావితోఁ దెన్ను తొంగలింప,

భూమిపై తటిద్వల్లియే పొడమినట్లు
పేఁపచువకలనల్లిన విరులసజ్జ
దాల్చి బశిచేతఁ జెలితోడ తరలి గుడికి
మెల్లమెల్లనబోవు మాపల్లెపిల్ల.

# గృహదీపము

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు ఎం.ఏ. బి.యల్.

ఆధునాతనయుగమునకు అనేకులు అంజలి ఘటించుచున్నారు. ఇది కూడనికాలమని కొందఱు యుగములను వెనుకకు త్రిప్పుచున్నారు. ఎవరేమనినను కాలవాహిని నిలుచునదికాదు. వెల్లువలోఁ బోరఁబడినవారు పడిపడిగ ముందుల కరుగుచున్నారు. ఎదురునిలిచినవారు ఎదురుయుగములతోడనే ప్రవాహమునఁబడి సాగుచున్నారు. సమత్వమును, స్వాతంత్ర్యమును ఎల్లరు పెదవులపైఁ దేలియాడుచున్నవి. ఇవి ప్రత్యక్షముగ ఇంకను ఎందును గోచరింపలేదు. వీనికై సాగు పెనగులాట అధికమగుచున్నది. అగు కొలఁది ఇవి దూరస్థములగుచున్నవి. స్వార్థము పెంపొందు కొలఁది ఉన్నతాశయములు నేల డుల్లిపడుచున్నవి. స్వాతంత్ర్యమును, సమత్వమును రచ్చపై రంజిలు రతనములని యెంచి వీనికై ఎల్లరును ఇండ్లు విడిచి, వీధిఁబడుచున్నారు. పురుషులేమో ముందంజవేయుచున్నారని ఎంచి 'మేమేల వెనుక నిలుగు'మని స్త్రీలనుచున్నారు.

న్యాయశాస్త్రము హక్కులను రెండు భాగములుగ విభజించినది. ప్రత్యేకమైన హక్కులును—సంపూర్ణమైన హక్కులును: ఒకరిపట్లఁ జెల్లవలసినవియు, పృథ్వియందెల్లెడలఁ జెల్లవలసినవియుఁ గలవు. (Rights in Personam, Rights in Rem: Vide—Any Book on Jurisprudence). జాతి సాంప్రదాయములును, సాంఘికాచారములును, ఆర్థిక రాజకీయ పరిస్థితులును, మానవుల ప్రత్యేక దైనిక క్రియలను నిర్దిష్టమొనరించినపుడే, వాని హక్కులుగూడ నిర్దిష్టములగును. పరస్పరాభ్యుదయమునకై, ప్రత్యేక శక్తుల ననుసరించి వేర్వేరు వ్యక్తులకై ఏర్పడు విధులు హక్కులగును.

హక్కు అనునది చులకనైనదికాదు. తనను చేఁదాలుపఁగలవారియెడ ప్రసన్నయై, వారి భాగ్యమును, వారిమూలమున నొరులభాగ్యమును చేకూర్చుట తన కర్తవ్యముగా నది యెంచును. తన దాపఁ జేరఁజాలనివారు తన్నంటుచోఁ శక్తిస్వరూపిణియై, వారి నది నేలఁగూల్చును. తన్ను దాను పరిశీలించుకొని, దృఢమైన విశ్వాసముపై నిలిచి, హక్కు నాహ్వానించు వ్యక్తి ధన్యుఁడు.

స్త్రీ పురుషులకు సమముగ జెల్లు హక్కులున్నట్లే, వేర్వేరు ప్రకృతుల ననుసరించిన వేఱు వేఱు హక్కులుకూడ గలవు. దేశదేశముల సాంప్రదాయములును, సంఘసంఘముల ఆచారములును భిన్నములుగ నుండునట్లు వారివారి హక్కులలోఁ గూడ భేదములు తలయెత్తుచుండును. పాశ్చాత్యసంఘమును దెచ్చి హైందవహృదయమున చొప్పించుటగాని, హైందవాచారములను పాశ్చాత్యులందు ప్రవేశపెట్టుటగాని ఎవ్వరికిని శక్యము కాదు. ఈ రెండింటిని కలిపి ఒక క్రొత్త ముద్ద చేసి భేదమును కనిపించనీయకుండా చేదామని కొందరి యూహ. మతములన్నియు చెఱిపి ఒకేమతము చేసిన కలహములుండవని కొందఱి యూహ. నేఁడు ప్రపంచమందు ఘోరరణములు జరుగుచుండుట ఒకే మతస్థులైన క్రైస్తవులందే. అంతరంగశుద్ధినందిననాఁడు మానవులు ఒక్కరై నిలువఁగలరు. ఏమతమును మాపు గానక్కరలేదు. ఆదర్శమొక్కటైయున్నపుడు మతములును, రుచులును, ప్రకృతులును, శక్తులును అనివార్యముగ వేఱైయున్నను, ఎట్టి చిక్కులును పొడసూపవు.

నేఁటి అంధానుకరణమున పిడుగునకును, బియ్యమునకును నొకటే మంత్రమగుచున్నది. భారతీయ ప్రకృతిని తుడిచిపెట్టి, భారతేతరప్రకృతిని దిగ ద్రింగు టెవ్వరికిని సాధ్యముకాదు. భారతసీమయందు నేఁడు కొన్ని దురాచారములు తోఁచినను, భారతసాంప్రదాయములన్నియు పెంటపోగులందు ప్రవేశింపవలెనని తలఁపరాదు. భారతహృదయమందలి మహితాదర్శములను బూడ్చిపెట్టి, అభివృద్ధి పేట గ్రుడ్డియొరవడికి పరుగులెత్తిన నెంతేని చేటు వాటిల్లును. ప్రాచీనయుగమును తెగనాడుట ఆధునాతనయుగముయొక్క ఉద్దేశమైనయెడల, నేఁటి యుగము నేలరాలవలెనని వాంఛింతును. రోగ నిర్మూలనమును వాంఛించు వైద్యుఁడు, రోగిని చితికర్పించి, రోగమును కాల్చివేయునా? ఆనందమునకును జయసిద్ధికిని అనువగు స్త్రీల ప్రత్యేక జీవన సమస్యలను పూర్వులు పరిష్కరించిన తెఱఁగున, నేఁటి పాడవుపాటి నాగరికులు పరిష్కరింపనేలేదు. కాలానుసారమైన పరివర్తన మవసరమైయున్నదని, తొంటియాదర్శములను త్రెంపివేయఁజూచుట కూడని తెరువ యనిపించుకొనును. అన్నియుగములకును,

వర్తించు ఆశయము లెన్నేనికలవు. సూర్యకాంతియు, పుష్పసౌరభమును తొలినాఁటివని, నేఁడు ప్రాఁతగిలి పనికిమాలినవగునా? సత్యమును, సహనమును, శాంతియు, పరార్థచింతయు సత్యయుగమునకు సరిపోవునుగాని అధునాతనయుగమునకు గావను సాహసికులెవరు? హిమశైలమునఁ బుట్టిన ప్రాఁతగంగ మనకేలయని సాగరమునుండి సురధుని నెవ్వరైనఁ బుట్టింపఁ బూనుదురా? ప్రాచీనమనినంతనే కొండ ముచ్చు మొంగములు జేసికొనువారు, ఎగిరెగిరిపడి ఎంతసుఖ మందుదురు? భారత ప్రాచీనవిజ్ఞానము తుడిచిపెట్టఁదగినదగుచో, భారతసాంప్రదాయము దగ్ధము కాఁదగినది. వేదయుగము వెఱ్ఱియుగమనియు, పురాణయుగము పుచ్చుయుగమనియుఁ దలఁచి, తమ దృక్కులను ప్రతీచీసీమలపై నెగురఁగొట్టుచు, అందలి జీవనము నొక్కపిడచగా దిగమ్రింగవలెనని నేఁడనేకులు ఆతురపడుచున్నారు. ఈ దిగమ్రింగుడులో నెన్నెని పుల్లలు హక్కులపేరిట భారతీయుల గొంతుకులందు పడుచున్నవి!

హక్కులేవో, సదుపాయములేవో అనుకరణీయములేవియో ఎఱుఁగినవారు నేఁడు లెక్కకు మిక్కిలి తక్కువగనున్నారు. పురుషులు అంధానుకరణ మొనరించుచుండ, వారితో సరిసమముగ నడచుట తమ కర్జమనితలచి, స్త్రీలును వారి వెన్నునే పట్టుచున్నారు.

స్త్రీవిద్యగాని, స్త్రీల యభివృద్ధిగాని, వలదను ఛాందసులు నేఁడులేరు. కాని నేఁడు కాంక్షింపఁబడు స్త్రీవిద్య, ఆదర్శనీయమైన స్త్రీవిద్య కాక, సముచితాభివృద్ధికి నిరుద్ధకమైయున్న పురుషవిద్యకు ఛాయాప్రతిమయైయున్నది. పురుషులు గోతిలోఁ బడినను, వారి యట్లు దుముకుటే తమ ఆత్మగౌరవమును కాపాడుకొనుటయనియు, తమ హక్కును దామూ నిలువఁబెట్టుకొనుటనియు పల్వురు స్త్రీలు తలఁచుచున్నారు. నూతన భావ విజృంభణమున నుత్సాహపూరితలై వీరు ముందులకు లంఘించుట ప్రశంసనీయమైనదియే. ఈ యుద్యమమున అపజయమొందక దీనిని చేరుతతి, సహజమైన తమ పనులను దిగద్రొక్కుకొనరాదని వీరు గ్రహింపవలెను. ప్రాచీన దృష్టాంతరములను కన్నెత్తిచూచుటకు వీరొల్లకున్నను, భారతభూమియందు దిటవుల వరలిన యశస్తిలకల దృష్టాంతరములకు వీరు 'ఛీఛీ!' యనఁజెల్లును. అహల్యాభాయి, లక్ష్మీభాయి, రామాభాయి, మనోరమాభాయి, సత్యవతి, కల్యాణి, మానసి, మహామాయ మున్నగు యశస్తిలకలు తమ గృహధర్మములను నిర్వర్తించుచు, ప్రజలకు బాహ్య పనియందు పరిచర్య సలిపిరి.

నేఁటిస్త్రీ ఇంజనీరు కావచ్చును; న్యాయవాదిని కావచ్చును; న్యాయమూర్తి కావచ్చును; గవర్నరు కావచ్చును—మంత్రియైనఁ గావచ్చును. కాని స్త్రీ, తన ధర్మమును తాను నెఱపనిదగుచో, స్త్రీ యనిపించుకొనుట కర్హురాలుకాదు. తల్లి కాఁగలుఁగు తన్వి తండ్రి కాఁజాలదు తండ్రి, తల్లి కాఁజాలఁడు. గృహలక్ష్మిలేని గృహము గృహమేకాదు. గృహమును బారుగఱిడి, రచ్చపై రంజిలు రమణి, ప్రజలయందు ప్రతిష్ఠపడసినను, తన యింటియందు దీపమార్పివేసినదగును. గృహిణి లేని గృహము ఆయువు లేని [illegible]. ఉద్యోగములును, సదోగ్యగములును ఏవ్యక్తియైనను చేయఁజాలును. పునీతమైన గృహధర్మమును నెఱపఁగల వ్యక్తి ఒక్క గృహిణియే. ముఖ్యముగ ఈ విషయమును గుర్తింపక, పాశ్చాత్య గృహిణి తన కర్తవ్యమును దాదికి వదలుచున్నది. వేషము వేయు దాసరి సత్యభామ కాఁగలిఁగినవాఁడును, పట్టిగొడ్డు కామధేనువు కాఁగలిగినవాఁడును, పల్లేరు నల్లేరులు మందార పారిజాతములు కాఁగలిఁగినవాఁడును, పరిచారిక గృహలక్ష్మి కాఁజాలును.

వీధియందలి హక్కులకై చేయిఁజాపుటలే, ఇంటియందలి హక్కులను నేలపాలుచేయక, గృహారమలై తమ పూతకర్తవ్యము తాము నిర్వహించుచు, తమ కర్తవ్యమునకును, తమ కర్తవ్యమందలి పవిత్రభావమునకును, ప్రతికూలములుగాని రీతులను బాహ్యజీవనము నెఱపవలెనని ఆంధ్ర నారీమణులను హెచ్చరించుచున్నాను. ఇంటఁ దీపికలేక, అవ్వలఁ దెఱపిలేక, అన్నిటియందును అపారతను మెలగుచు సంతృప్తికరముగ వర్తించు అతివలు తోఁచినప్పుడు అనంతానందమున నృత్యమొనరింపనివారెవరు?



కీ॥ శే॥ శ్రీమతి కొల్లూరి

పేరిందేవి గారు

కొల్లూరు వెంకటరత్నశ్రేష్ఠిగారి కోడలు, వీరభద్రరావుగారి భార్య. ఈమె వైశ్య యువతీలోకమునకాదర్శ ప్రాయమగు ప్రవర్తనము కలది. దేశభక్తికి దైవభక్తికి, కళాసక్తికి నాటపట్టు. విశాఖపురమున నున్న వారెల్లరు ఈమె ఆకస్మిక మరణమునకు నెంతయుఁజింతించిరి. ఈమె 12-11-1933 తేదీని 22 యేండ్లవయస్సున కీర్తిశేషురాలయ్యెను.

## బాష్పాంజలి

క॥ గుణముండిన ధనముండదు
ధనముండిన విద్యనాస్తి, ధాత్రీతలమం
దున; నిన్నియుంటనే, పృ
థ్వని వేగమువీడితివు, పేరిందేవీ!

మ॥ ఘనవాత్సల్యత దీనసంతతియెడన్ ,గాత్యాయనీపాదసే
వనమందున్ మహనీయదీక్షయును, శుంభత్ప్రీతిహిందీయెడన్
వినయంబార్యులయొద్దఁజూపి విలసద్విఖ్యాతి నార్జించి ధా
త్రిని, నాకంబును జూడనేగితివ? పేరిందేవి సాధ్వీమణీ.

ఉ॥ ప్రాయముచిన్నదైనను ప్రవర్తనమందునఁబెద్ద యీనరో
జాయతపత్రనేత్రయని సర్వజనావళితన్ను సన్నుతిన్
జేయఁగ నిర్వ్యథూటి ధరణిన్ మనుచున్ "సుకృతీగతాయు"వన్
న్యాయమునిక్క మానటులొనర్చి దివంబునకేగెనక్కటా.॥

కూరెళ్ల రామనరసింగ రావు.

# మహిళా ప్రబోధము

## ఉపన్యాసత్రయము

శ్రీమతి ముసుంబ వెంకటమ్మగారు

ఏలూరుపురమున నవంబరు 4, 5 తేదీలయందు సమావేశమైన మహిళామహాసభ ఆంధ్రదేశమునందలి యన్ని జిల్లాల ప్రతినిధురాండ్ర యభిప్రాయములను వ్యక్తపఱచునది కాని కేవల మొక జిల్లాకు సంబంధించినదికాదు. ఇట్టి మహాసభలో పాల్గొన్న స్త్రీ ప్రతినిధురాండ్రందరు నేకాభిప్రాయముతో స్వసంఘాభ్యుదయము కోరి పని చేయ బూనినచో ఆంధ్ర స్త్రీ లోకమంతయు కృతార్థత జెందుటకు సందేహమేమున్నది? కాని స్వసంఘాభ్యుదయమునకై మన మెట్టి కృషి చేయవలెనను ప్రధానవిషయములో స్త్రీ జన సామాన్యము మాట యట్లుండ విద్యాబుద్ధులచే దీపించు నారీమణులయందే యెన్నో భిన్నాభిప్రాయములు కలవు. పూర్వాచార సమ్మతమగు వర్ణవివక్షత యుండవలెనను వారి కిట్టి మహిళాసభలలో సభ్యత్వము లేదనియే చెప్పవచ్చును. కాని శ్రీ దువ్వూరి సుబ్బమ్మగారి వంటి సనాతన ధర్మపరాయణులగు స్త్రీరత్నము లొకరిద్దఱు మాత్రము నిజ వక్తృత్వ ప్రభావముచే నిట్టి సభలలో ప్రవేశము పొంది తమ వ్యక్తిత్వమును నిల్పుకొని సంఘమున కంటియుండక కాలము గడుపుకొనుచుండుట మనము చూచుచున్నాము.

(1) రజస్వలానంతర వివాహములతో పాటు వర్ణాంతర వివాహములు ప్రోత్సహించుట తగునా? తగదా?

(2) బాలవితంతువులతో పాటు ప్రౌఢవితంతువులకు కూడ వివాహ మంగీకరింపవచ్చునా? కూడదా?

(3) వివాహముకాని యువతి ఉన్నతవిద్యాలయమునకేగి చదువుకొనుచు స్వతంత్రురాలై తాను ప్రేమించిన పురుషుని వివాహ మాడవచ్చునా? లేక వివాహ మగువరకు అగచాటుగ నింటనేయుండి తమ తలిదండ్రులు గూర్చిన పురుషునే వరింపవలెనా?

(4) దాంపత్యవిచ్ఛేదము (విడాకులు), సంతాన నిరోధము, రహస్య ప్రసవ గృహనిర్మాణము, అనాథశిశుపోషణకళాశాలా స్థాపనము మొదలగు పాశ్చాత్య సంప్రదాయములను మన మవలంబింపవచ్చునా? కూడదా? అను విషయములలో సంఘసంస్కారిణులగు మహిళామణులలోనే తలకొక యభిప్రాయము కలదనుట అతిశయోక్తి కాదు. ఇందుచేతనే విద్యాధికురాండ్రగు మహిళామణులైనను నేకీభావముగు దృఢ సంకల్పముతో మన సంఘాభివృద్ధికై కలిసి పని చేయజాలకున్నారు.

మొన్నను ఆంధ్రరాష్ట్రీయ మహిళాసభలో చదువబడిన (1) శ్రీ డాక్టరు ముత్తులక్ష్మిరెడ్డిగారి అధ్యక్షక ఉపన్యాసము. (2) మిస్. వి. పీటర్ బి. యే. యల్. టి, గారి ఆహ్వాన సంఘాధ్యక్షక ఉపన్యాసము. (3) శ్రీమతి చుండూరి రత్నమ్మగారి ఆహ్వాన సంఘ-ఉపాధ్యక్షక-ఉపన్యాసము ఈ మూడును పుస్తకరూపమున వెలువడియున్నవి గదా. వాని నాధారముగా గైకొని (1) పూర్వము మన భారత దేశమున స్త్రీలస్థితి యెట్లుండెడిది? (2) ప్రస్తుతము మనస్థితి యెట్లున్నది? (3) ఇక ముందది యెట్లు సంస్కరింపబడవలెను. (4) అందుకు మన కర్తవ్యమేమి? యను ముఖ్యవిషయములలో ఆ మువ్వురు విదుషీమణుల యభిప్రాయము లెట్లున్నవో కనుగొనుచు మనము తద్విషయవిమర్శనకు గడంగుదము.

### పూర్వకాల స్త్రీలస్థితి

ఈవిషయమై మిస్. వి. పీటర్ గారిట్లు వ్రాసిరి:—“సీత, దమయంతి, చంద్రమతి, సావిత్రి మొదలగు మహాపతివ్రతలతో పవిత్రమయిన హిందూదేశమున జన్మించిన మనము వారిని ఆదర్శలగా నుంచుకొని సత్యము, సన్మార్గము, పాతివ్రత్యము మొదలగు సుగుణములు కలిగించు పతివ్రతల జీవితములు, పురాణములు, ఇతిహాసములు, ప్రబంధములు మన బాలికలచే చదివింపవలెను.”

ఆహా! నిజముగా ఇవి భారతదేశమందలి సర్వపక్షముల స్త్రీపురుషులను శిరసావహించి, యాచరించి ప్రోత్సహింపవలసిన సూక్తులుగదా!!

శ్రీమతి రత్నమ్మగారు సరే సరి. కవిత్వము, పాండిత్యము, శాస్త్రజ్ఞానము, రాజ్యతంత్రవిజ్ఞానము, మహా పాతివ్రత్యము, వీరత్వము, యుద్ధనైపుణ్యము గల స్త్రీలు మన భారతేతిహాసమున తండోపతండములుగా గలరని ఉదాహరణ పూర్వకముగా ఋజువు పఱచిరి. మఱియు సత్యభామ, ద్రౌపది, సీత, ఝాన్సి, తారాబాయి, రుద్రమదేవి, మొదలగు ఉత్తమ నారీమణులను గన్న భారతదేశములో స్త్రీస్వాతంత్ర్యము గలదా యను సంకోచమునకే స్థానము లేదని ఘంటాపథముగ చాటిచెప్పిరి.

ఈ ఉభయుల వ్రాతలనుబట్టి (1) ప్రాచీన నారీమణులు ఆదర్శప్రాయులగు అత్యుత్తమ స్థితియందుండిరి గనుక వారి పవిత్రజీవితములు మన కనుసరణీయము లనియు (2) స్త్రీస్వాతంత్ర్యమునకు మన పూర్వ మతాచారములుగాని పూర్వసాంఘికాచారములుగాని యెంతమాత్ర మడ్డునచ్చి యుండలేదనియు తేలుచున్నది కదా!

పూర్వకాల స్త్రీలస్థితిని గూర్చిన వర్ణనము పట్ల అధ్యక్షురాలు ఎందుచేతనో తాటస్థ్యభావము వహించి మిన్నకుండిరి. “పూర్వకాలపు పతివ్రతల నాదర్శముగా గొని వర్తింపుడు. పురాణములు చదువుడు.” అను మామూలు లాంఛనవాక్యములు చిలుకపలుకుల వలె నిరర్థకము లనియే ఆమె మాని యుండవచ్చును. నిజమే, ఆచరింప నభిలషించునది పాశ్చాత్య నవనాగరికత యైనప్పుడు ప్రాచీనభారత నాగరికతను ప్రస్తుతించు టేమి యగత్యము?

(1) నిండు చూలాలగు తన్ను జాలిమాలి యరణ్యములో విడువబంచిన పిమ్మట కూడ భర్తగారి పాదారవింద ధ్యానము విడువనొల్లని సీతమ్మతల్లియు,

(2) నమ్మకద్రోహము చేసి తన్నడవిలో ఏకాకినిగ విడిచిపోయిన రాజ్యవిహీనుడగు నలరాజు వికృతాకారుడగు వంటలవాడుగ మారి యున్నప్పుడు కూడ అతనిని చక్రవర్తిగా నున్నప్పటివలెనే ప్రేమించి తన్నేలుకొమ్మని దీనురాలై ప్రార్థించిన యింతుల మేలుబంతి దమయంతియు,

(3) తన్ను దాసిగా విక్రయించి, పెక్కు కష్టముల పాలొనరించి, తుదకు రాజాజ్ఞకు లోబడి నిరపరాధిని యగు తన కంఠమును కోయవచ్చిన హరిశ్చంద్రునే తనకు జన్మజన్మలకు భర్తగా నను గ్రహింపుమని దైవమును ప్రార్థించిన చంద్రమతీ సాధ్వియు,

(4) మనసుచే వరించిన పురుషుని వివాహ మాడకుండుట దోషమని యెంచి అల్పాయుష్కుడును భాగ్యహీనుడును నగు సత్యవంతునే పెండ్లాడి యతని యాయుర్వృద్ధికై తాను కఠోరవ్రతములతోను కఠినతరోపవాసములతోను కాలముగడిపి ధన్యురాలైన సాధ్వీమతల్లి సావిత్రీదేవియు, నిజముగా మన కాదర్శప్రాయు లగుచో విడియాకుల చట్టముమాట నోట నుచ్చరించుటకుగాని, వితంతూద్వాహముల విషయమై స్మరించుటకుగాని మన కెట్లు మనసొప్పును?

## మన ప్రస్తుత స్థితి

“దేశ స్వాతంత్ర్యమునకు కావలసిన సేవను త్యాగమును చేయుటయందు ఆంధ్రనారీమణు లగ్రస్థానము వహించియున్నారు. అట్లే సాంఘిక విద్యాసంస్కారణావశ్యకతలను కూడ గుర్తించుటలో ఆంధ్రయువతు లెంతమాత్రము వెనుకబడలేదు.” అని అధ్యక్షురాలు మన ప్రాంతీయుల నెంతేని మెచ్చిరి. కాని “హిందూదేశమందు (1) బాల్యవివాహములు (2) ఘోషాపద్ధతి (3) వితంతూద్వాహ నిషేధము పుట్టి మనకు విపరీతమగు ముప్పునకు కారణమగుచున్నవి. వీని నెంత త్వరలో రూపుమాపుదుమో అంత శీఘ్రముగ మన సంఘ మభివృద్ధి పొందును. మన జాతీయతను వ్యక్తిత్వమును నిర్మూలము చేయుచున్న పరంపరానుగత దురాచారములను బాధ్యతాయుత స్వతంత్ర

ప్రభుత్వము మాత్రమే రూపు మాపగలదు." అని నుడివిరి.

బాల్యవివాహము, విధవావివాహ నిషేధము నను నియమములు మన హిందూసంఘమున నల్పసంఖ్యాకులగు అగ్రవర్ణముల వారే విధిగా నవలంబించుచు వచ్చిరి కాని అధిక సంఖ్యాకులగు మిగత వర్ణములలో ఈకఠిన నియమము లెప్పుడును లేవు. మఱియు బాల్యవివాహములు లేని క్షత్రియ సమ్మాద్ర వర్ణములలో స్త్రీలు ఘోషాపద్ధతిని విధిగా నవలంబించుచు వచ్చిరి కాని మన ప్రాంతమున బ్రాహ్మణ వైశ్య స్త్రీలలోను నిమ్నజాతులలోను ఘోషాపద్ధతి లేనే లేదు. విధవావివాహములు శూద్ర వర్ణమునందలి తక్కువ కులములలోను పంచమ వర్ణములోను విచ్చలవిడిగా కొనసాగుచున్న వేకాని మానలేదు.

అగ్రవర్ణములందలి స్త్రీలు పాతివ్రత్య రక్షణమునకై కొన్ని కఠిన నియమముల నవలంబించుటవలన మన జాతీయతకును వ్యక్తిత్వమునకును ఏమి ముప్పు వాటిల్లినదో అట్టి నియమములు లేని కులములందలి స్త్రీలేమి విశేష సౌభాగ్యము గాంచిరో దురూహ్యముగా నున్నది. ఈనియమములను పూర్తిగా నుల్లంఘించి స్వేచ్ఛానుసారముగ వర్తించు పాశ్చాత్య దేశము లెట్టిమేలు గాంచినవో అచిరైన అభ్యతురాలు నిరూపింపలేదు. పైగా "అధిక సంఖ్యాకులు దరిద్రులై అజ్ఞానులై యున్నను పాశ్చాత్యదేశము నాపరించియున్న ఘోరకళంకము లేవియు పట్టువడక హిందూదేశము పవిత్రమైయున్నది." అను సత్యమును కూడ ఆమె మనస్ఫూర్తిగా నంగీకరించిరి. అట్టి పవిత్రతకు కారణమేమి? మనమిప్పుడు దురాచారము లనుకొనుచున్న పైమూడు నియమములు మనదేశమందు ఉచితరీతి నాచరణమునందుండుటే యట్టి పవిత్రతకు కారణము కాదని మనమెట్లు నిరూపింపగలము?

ప్రస్తుతకాలపు మన విదుషీమణుల వాస్తవస్థితిని శ్రీ రత్నమ్మగారు చక్కగా చిత్రించిరి. "మనకు పరాధీనత సంప్రాప్తమైనది. మన సంఘములోగల ఉత్తమాదర్శము లడుగంటినవి. స్త్రీలతో సమానముగా పురుషులుకూడ అధఃపతితులైరి. ధార్మికవిద్య నశించినది. నవనాగరికతా ప్రవాహమున బడి దరిగానక మనము కొట్టుకొనిపోవుచున్నాము. మన సంఘము పెడమార్గమున బడుచున్నదేమోయని శంకయించుచున్నాను. సంతానమును శరణాలయములకో, బోర్డింగులకో, హోటళ్లకో నప్పజెప్పుట, వంటయిండ్లు వంటలక్కలకు నప్పజెప్పుట, ఉదయం మిత్రగోష్ఠి, సాయంత్రం క్లబ్బులు, ఆటపాటలు, రాత్రుల్లు సినీమాలు, నాటకాలు, సభలు మొదలగునవి ఇప్పటి నవనాగరిక పద్ధతులు. ఇవి మన ఆదర్శములుగా చాలమంది భావించుచున్నారు. పాశ్చాత్య దేశములలో స్త్రీ స్వాతంత్ర్యము పేరిట సంసారములు కూలిపోవుచున్నవి. ఆ దేశముల పీడించుచున్న మహాసంకటము నేడు మన సంఘములో ప్రవేశించుచున్నది. మానవకల్యాణమునకును స్త్రీ జనోద్ధరణమునకును మనము కంకణము కట్టుకొని తక్కిన లౌక్యవ్యవహారముల అంతరింపజేయుట మన కర్తవ్యమని నా మనవి."

ఈమె స్త్రీవిద్యనుగూర్చి యిట్లు నుడివిరి. "విద్యావిషయములో అసలు ఇప్పటి విద్యాపద్ధతులు పురుషులకు నైతికముగను ఆర్థికముగను అనర్థదాయకముగనుండి నిరుద్యోగసమస్యను అధికము చేయుచు సేవకావృత్తికి దారిచూపుచుండ స్త్రీలనుకూడ అదారినే నడిపించుట ఒక గొప్పలోపము. జీవయాత్రలో పురుషుడు నిర్వహింపవలసిన పనులు కొన్నియు స్త్రీ బాధ్యతలు కొన్నియు గలవు. సంగీతము, సాహిత్యము, చిత్రలేఖనము, చేతిపనులు, వైద్యము, శిశుపోషణము, రాట్నము, నూలుతీయుట మొదలగు విద్యలు తరగతులబట్టి దేశీయపద్ధతుల ననుసరించి ప్రతి బాలికావిద్యాలయములోను నేర్పవలయును. సంఘసేవ, మతవిద్య, నైతికవిద్య మొదలగునవి బాలికలకు ప్రథమమునుండి నేర్పవలయును."

అధ్యక్షురాలు మన స్త్రీల కట్టివిద్య యవసరమో చర్చింపలేదు కాని మనము రాజకీయములందు పాల్గొనక తప్పదని అసందిగ్ధవచనములలో చెప్పివైచిరి. "ఇతర దేశములలోని స్త్రీలు రాజకీయ విషయములను చర్చించుచుండగా మనమేల చర్చింపరాదు? పురోభివృద్ధినందుచున్న ఆ దేశముల స్త్రీలవలె మనమేల వ్యవహరింపరాదు?" అని భారత నారీమణుల నామె ప్రశ్నించుచున్నారు.

## సంఘసంస్కరణము

వివాహసంస్కరణము గూర్చి శ్రీ రత్నమ్మగారిట్లు వ్రాసిరి. "బాల్యవివాహనిషేధమని మనము గొప్ప ఆందోళనము సభలలో చేయుచున్నాము. బాల్యవివాహనిషేధశాసనముకూడ అయినది. కాని యుక్తవయస్సు వచ్చిన కన్యలను వివాహమాడుటకు మన సంఘములో వయస్సుగల బ్రహ్మచారులు కాన్పింపరు. నేడు బ్రహ్మచారులకంటె కన్యల సంఖ్య హెచ్చుగానున్నది."

ఆమె చెప్పిన మాట వాస్తవమే. కాని దీనికి కారణమేమి? దీనికి కారణము వరశుల్కమని ఆమె వ్రాసిరి. ఇక్కడ పొరపాటున కార్యకారణములు తారుమారైనవి. బ్రహ్మచారుల సంఖ్యకంటె కన్యల సంఖ్య హెచ్చుగా నుండిన కారణముననే మన దేశమున వరశుల్కము ఉద్భవించుట కవకాశము తటస్థించినదని ఆమె యుద్దేశ్యమై యుండవచ్చును.

లోకమున స్త్రీశిశువుల, పురుషశిశువుల జనన సంఖ్య ఇంచుమించుగా సమానమేయైనను బాలారిష్ట దశలు, గండములు గడచి బ్రతికెడు యువకులసంఖ్య యువతుల సంఖ్యకంటె చాల తక్కువయని విజ్ఞులు పల్కుచున్నారు. అందుచే ఏసంఘములోనైన 18 సం|| వచ్చువరకు స్త్రీలకు వివాహములు చేయక ఆపవలెనను నియమమున్నచో స్త్రీలకు తగిన సంఖ్యగల పురుషులు లేకుండుటచే కొందఱు స్త్రీలు తప్పక అవివాహితలుగా నుండిపోవలసివచ్చును. పాశ్చాత్య దేశములలో అవివాహితల సంఖ్యతోపాటు అవినీతి కూడ పెరిగిపోవుచుండుట మనము నిత్యము చూచుచున్నాము. మన దేశమున ప్రౌఢవివాహము లమలులోనున్న క్షత్రియ, వెలమ, కాపు, కమ్మ మున్నగు కొన్ని కులములలో పాతివ్రత్య రక్షణమునకు ఘోషాపద్ధతి యనివార్యమగుటయు పెక్కుచోట్ల యువతుల వివాహార్థమై వరకట్నముల క్రింద పుట్టింటివారి యిండ్లు గుల్లలగుటయు కొందఱు అవివాహితలుగా నుండిపోవుటయు జరుగుచునే యున్నది. దీనినిబట్టి కొందఱు స్త్రీలు తప్పక నిత్య బ్రహ్మచారిణులుగా నుండిపోవలెననుట భగవదుద్దేశమేమోయని తోచుచున్నది.

ఇప్పుడే బ్రహ్మచారుల సంఖ్యకంటె కన్యల సంఖ్య హెచ్చుగానున్నచో ఇక వితంతూద్వాహములు విచ్చలవిడిగా పెరిగినచో చాలమంది కన్యలు పెండ్లిముచ్చటయైన చవిచూడక నిర్బంధ బ్రహ్మచర్యము ననుభవింపవలసివచ్చుననుటకు సందేహమేమున్నది? ఒకసారియైన వివాహముకాని కన్యలను నిర్బంధ బ్రహ్మచర్యము పాల్జేసి వితంతువులకు వివాహము తలపెట్టుట శాస్త్రవిరుద్ధము మాట యట్లుంచి పూర్తిగా న్యాయవిరుద్ధమనుట నిస్సంశయము.

శ్రీ రత్నమ్మగారు వితంతూద్వాహముల విషయమై యిట్లు వ్రాసిరి:..."ఇష్టమున్న బాలవితంతువులకు వివాహము తప్పక ప్రోత్సహించి మనము కూడ కార్యభారము వహింపవలయును. తక్కిన వితంతువులను సంఘసేవ, చేతిపనులు, వైద్యము మొదలగు వృత్తులు నేర్పి దేశసేవకురాండ్రుగ చేయవచ్చును."

చదువరులకీ పలుకులు చాల సమంజసములుగనే కాన్పించును. కాని ప్రస్తుత వాతావరణమునగల బాలవితంతువులలో వివాహేచ్ఛ లేనివారుండుటయే అసంభవము. అది శాస్త్రనిషిద్ధమనియు, సదాచార విరుద్ధమనియు భయముచేత చాలమంది వితంతువులు

పునర్వివాహము చేయుమని తలిదండ్రులను వేధించరుకాని అట్టి వివాహములు చేయుటకు మనము కంకణము కట్టుకొన్నచో బాలవితంతువులేగాక ప్రౌఢవితంతువులుకూడ కామవికారములకు లోనై పునర్వివాహము కావలెనని యాందోళనము చేయుట మున్నగు నియమోల్లంఘనము లెన్నో ప్రబలి సంఘము దోషభూయిష్ఠమై అధఃపతితముకాక మానదు.

ఇందుచేతనే త్రికాలవేదులగు మన పూర్వకాలపు మహాఋషులు వివాహముల విషయమై చక్కగా యోచించి ప్రతిస్త్రీకిని ఒకసారియైన వివాహము జరుగు నవకాశము కలిగించుటకై వితంతూద్వాహ నిషేధము, రజస్వలాత్ పూర్వవివాహములు సంఘమున కత్యావశ్యకమని విధించినట్లు కాన్పించుచున్నది. తాత్కాలికవ్యక్తి లాభముగోరి శాశ్వత సంఘనష్టము గావించుట నీతికాదు. కాని శాస్త్రనిషిద్ధములగు అతిబాల్యవివాహములు మన సంఘమున నుద్భవించుటచే బాలికలకు చాల దురన్యాయము జరుగుచున్నదనుట యెవ్వరును కాదనజాలరు. 8 ఏండ్ల లోపు బాలికలకు వివాహముచేయుట ధర్మవిరుద్ధము అతిక్రూరము. ఇట్టి అనుచితవివాహముల నాపుటకు మన మన్నివిధముల యత్నించవలెను. వివాహవిషయములో చిరకాలమునుండి వచ్చుచున్న శిష్టాచారమిట్లున్నది:— బాలికకు 8 ఏండ్లు వచ్చువరకు వివాహము మాట తలపెట్టరాదు. ఎనిమిదవయేటనుండి తలిదండ్రులు బాలికవివాహవిషయమై కనుకలిగి మెలగుచు తగిన వరు డెక్కడ లభించునాయని వెదకుచుండవలెను. వినికిడివలనను పిల్లవాని జాతకము వలనను వరుని ఆయురారోగ్యములు గృహసంపదాయము, విద్య, బుద్ధి మున్నగునవి సరిగా తర్జని భర్జన చేసి తెలిసికొని, కేవలము బాలికమేలే మనస్సులో నుంచుకొని దైవముఖము చూచి న్యాయబుద్ధితో బాలికకు 12 ఏండ్లు దాటకుండ వివాహము చేయవలెను. ఆ ఈడునకు తగిన సంబంధము లభించనిచో గట్టి కృషిచేసి ఉన్నసంబంధములలో మేలైనది చూచి రజస్వలయగుటకు పూర్వమే బాలికకు వివాహము జరిపించుటయందు తలిదండ్రులు కృతకృత్యులు కావలెను. అట్టి వివాహములవలనను బాలికకు వైధవ్యము ప్రాప్తించినచో తలిదండ్రుల దోషమేమియులేదు. అది విధికృతమని నమ్మి యట్టి వితంతువులను ఆధ్యాత్మ విద్యావిశారదలుగ నొనర్చి వారికి దేశసేవచే కృతార్థతనందుటకు తగిన వాతావరణము కల్పించవలెను.

ముఖ్యముగా నవీన సంఘసంస్కారపరాయణులగు మన సోదర సోదరీమణులు కొందఱు బాల వితంతూద్వాహములు ప్రోత్సహించుటకై వెచ్చింప బూనిన ధనముతో వితంతుజనాశ్రమములు కట్టించి వారిని పవిత్రలగు విరాగిణులను దేశసేవాదురంధరులనుగను తయారుచేయబూనుట యత్యుత్తమము. సనాతన ధర్మపరాయణులమనువారికిది ముఖ్య కర్తవ్యమని వేఱుగ చెప్ప బనిలేదు.

మన కర్తవ్యమను శీర్షిక క్రింద అధ్యక్షురాలిట్లు వాక్రుచ్చిరి:— "తమ గృహకృత్యములందును తమ వృత్తి వ్యాపారములందును మగ్నులై స్త్రీ పురుషులు చాలమంది తమ జీవితములు గడుపుచున్నారు. ఈరీతిగా వ్యవహరించుట ప్రస్తుత దేశావస్థలో వ్యర్థప్రాయము మనదగియున్నది. నిందాస్పదమైయున్నది. విద్యాధికులైన మన యువకులును యువతులును ఈ వర్తమానపరిస్థితులలో బ్రహ్మచర్యదీక్షావలంబులై చైనాలోని విద్యార్థిబృందము చేసిన రీతిని పల్లెపల్లెకు ప్రతియింటికిపోయి విజ్ఞానతేజమును విస్తరింపచేయవలెను."

చూచితిరా! కొందఱు స్త్రీలు అసలే వివాహము మాని దేశసేవ చేయవలెనని ఆమె చెప్పుచున్నారు. మఱియు "వివాహితులైనవారుకూడ అనుదినము కొంతకాలము సాంఘికసేవార్థమును జాతీయోద్ధరణ కార్యముల కొఱకును వినియోగించవలెను" అని చెప్పిరి.

అవును. నిజమే. సంసారబాధలు కలవారికన్న బ్రహ్మచర్యదీక్ష నవలంబించిన వారెక్కువ లోకజ్ఞాన

మును ఆధ్యాత్మికజ్ఞానమును సంపాదించి తమ జీవితములను దేశసేవయం దర్పించుట కెక్కువ అవకాశములు గలవారై యుందురు. కాని ఏ స్త్రీలు తమ జీవితములు దేశసేవయం దర్పింప సమర్థురాండ్రై సంసిద్ధురాండ్రై యుండిరో నిర్ణయించుటకు ప్రత్యేకముగ మనము పూనుకొనుటకన్న శాస్త్రసమ్మతముగ వివాహమైన దంపతులలో దైవవశమున వితంతువులైన వారిందఱికి కూడ అట్టి వాతావరణమును కల్గించి పూర్వజన్మ సంస్కారయుతములగు వారి జన్మములను సార్థకపఱచుటయు లోకకల్యాణమునకు తోడ్పడుట మన ధర్మముకాదా? అయితే అట్టి స్త్రీలు వివాహములవలన అయిదేండ్లలోపునను మూడేండ్లలోపునను వితంతువులైన అభాగ్యురాండ్ర గతియేమని కొందఱు ప్రశ్నింపవచ్చును. అశాస్త్రీయములగు అతి బాల్యవివాహముల కంగీకరించిన సంఘము అతి బాలవితంతువుల వివాహమునకుమాత్ర మేల అంగీకరింపరాదని వారడుగవచ్చును. దురాచారములను పోద్రోలి సత్య సంస్కారములచే సంఘమును నిష్కళంకము చేయుటే మన కర్తవ్యముకాని ఒక తప్పుపని జరుగుచున్నది కదా మఱొకదానికి మాత్ర మేల నంగీకరింపరాదనుట భావ్యముకాదు. అయినను ఇకమీద బాల్యవివాహములు జరుగకుండుటకు మనము భగీరథ ప్రయత్నములు చేయక తీరదు.

విడాకులపట్ల సమస్యాపరిష్కారమును గూర్చి శ్రీరత్నమ్మగా రిట్లు వచించిరి:—“మహా విద్వాంసులును, అనుభవజ్ఞులును, శాస్త్రవేత్తలును అగు స్త్రీపురుషులు సమావేశమయి చర్చించి సూక్ష్మముగా యోచించినమీదట ధర్మనిర్ణయమునకు రావలసిన మహాసమస్యగాని మనము సభలలో చేతులెత్తి అవునని కాదని నిర్ణయించదగిన విషయముకాదు.” అతి బాలవితంతూద్వాహ సమస్యాపరిష్కారమునకు గూడ శ్రీరత్నమ్మగారు సూచించిన పైమార్గమే అవలంబనీయమని నామనవి.

## అస్పృశ్యత—వర్ణవిభాగము:—

దేశనాయకులచే నత్యున్నతస్థాన మొసఁగబడి ప్రజాహృదయములయం దాందోళనము గావించుచున్న హరిజన దేవాలయ ప్రవేశసమస్యను గూర్చి ప్రసంగింపక వీరు మువ్వురు మూకీభావమువహించుట విచిత్రముగ నున్నది. గాంధిమహాత్మునంతటి నాయకుఁడు అవునన్నది కాదనుటకు కాని బహుజనాభిప్రాయ విరుద్ధమగు శాస్త్రనిషిద్ధకార్యమును సమర్థించుటకు కాని మనసొప్పక వీరు మిన్నకున్నచో ప్రశంసాపాత్రలే. అధ్యక్షురాలు అంటరానితనమును గూర్చియు వర్ణభేదముల గూర్చియు నేమియు చెప్పలేదు. మతసంబంధము లగునట్టి మహావిషయము లిట్టి సభలలో చర్చించి నిర్ధారింపరానివని తెలిసియే యామె మిన్నకుండిరేమో! మిస్. వి. పీటర్ గారును శ్రీరత్నమ్మగారును అంటరానితనమును వర్ణభేదమును అంతరింపవలెనని సూచించిరి. పంచముల ఆర్థిక నైతిక విద్యాపరిస్థితు లభివృద్ధినందినచో అంటరానితనము దానంతట అదియే అదృశ్యము కాగలదు. ముఖ్యముగా వారి ఆర్థికపరిస్థితి చక్కబడుట కందరును తగిన కృషి చేయవలెను. వ్యవసాయ కార్యములందును, కట్టెలుకొట్టుట మొదలగు కాయకష్టపు పనులయందును అగ్రవర్ణములవారు పంచములను చిరకాలము నుండి వినియోగించుకొనుచు కొంతవరకు వారి కార్థిక సహాయ మొనర్చుచు నేయున్నారు. అంటరానితనము పోవలెనని మనస్ఫూర్తిగ గోరు నారీమణులు తమ యిండ్లలో పంచములను సేవకులుగను సేవకురాండ్రుగను చేర్చుకొని వారిచే బజారుపనులు, చెంబులు, గిన్నెలు తోముట, పాచిపని మొదలగుపనులు చేయించుకొని, వాండ్రకు జీతములిచ్చి పోషించుచు, వారి పురాతనపు కులకట్టుబాట్లు పునరుద్ధరించి, త్రాగుడు, జూదము మొదలగు దుర్వ్యసనములు పోగొట్టి వారిని నీతిమంతులుగను, పరిశుద్ధులుగను చేయుటకు లెస్సగా యత్నింపవలెను. అస్పృశ్యత విషయమై సర్వమును సహజముగ అగు సంస్కారణము నొనర్ప నుత్సహించు స్త్రీపురుషులు ఈమాత్రము చేయగలిగినచో తప్పక కృతకృత్యులగుదురు.

కులపద్ధతులపై యుద్యమములు సంస్థలు నిర్వహించెడు వారిని శ్రీరత్నమ్మగారు నిరసించిరి. అట్లు నిరసించుట హిందూసంప్రదాయ సమ్మతముకాదని నాతలంపు. మానవులు సేవ చేసి తరించుటకు 1 కుటుంబము 2 కులము 3 మతము 4 దేశము

5 లోకము—ఇవి సోపానముల వంటివనుట నిశ్చయము. కుటుంబపోషణమే చేసికొనజాలని వారు లోకకల్యాణము చేకూర్ప నెంతమాత్రము సమర్థులు కాజాలరు. అందుచేత ధనసంపాదన మొనర్చి స్వకుటుంబనిర్వహణ మొనర్చుకొనుటయు ప్రయోజకత్వమే. నిజకుటుంబపోషణముకన్న స్వకులోద్ధరణము మహాకార్యము. అట్లే మిగిలిన స్వమతోద్ధరణము, స్వదేశోద్ధరణము, లోకసేవ తరతమాంతరయుక్తములైనను సోపానములై భగవత్ప్రీతికరములగుచున్నవి. అందుచే తమకులవృత్తులు కులవిద్యలు పెంపొందించుకొనుటకును, స్వీయకులమందలి దురాచారములను పోగొట్టుకొనుటకును, తమ కులస్థులను స్వమతోద్ధరణమునకును దేశాభ్యుదయమునకును ప్రోత్సహించుటకును వివిధకులములవారు ప్రత్యేక విద్యాలయములు ప్రత్యేకసభలు నెలకొల్పుట ప్రశంసార్హమగు మహత్కార్యమే కాని నిందనీయము కాదని నా మనవి. అయితే స్వమతవికాసమే మనస్సునందుంచుకొని వివిధకులములవారును, స్వదేశాభ్యుదయమే గమ్యస్థానముగా నుంచుకొని వివిధమతములవారును తమతమ నియమములు నిర్వర్తించుకొనుచు పరస్పరమైత్రితో నుండుట యత్యంతావశ్యకము. భిన్నత్వములోనుండి యేకత్వము జూపుటే భారతీయ సంప్రదాయము.

కొమ్మలు, రెమ్మలు, పలవలు, చిలువలు గలిగి ఫలభరితమై శోభిల్లు తియ్యమామిడిచెట్టు పథిఙనికీవలె వివిధవర్ణకుల సంప్రదాయములచే నలరారి భక్తిజ్ఞాన వైరాగ్యప్రదమగు సనాతనమతము మనకు శాంతి సౌఖ్యములు చేకూర్ప జాలియున్నది. ఇందుచే కులధర్మములు యథావిధిగా ప్రవర్తిల్లుటకే మనము తోడ్పడవలెను కాని వానిని రూపుమాప యత్నింపరాదు. వివిధకులములందు మధ్యగా చేరిన దురాచారములు దురభ్యాసములు పోగొట్టుటే నిజమగు సంఘసంస్కరణమగును కాని ఇదివరకు చేరియున్న దురాచారములకు తోడు మఱికొన్నిటిని కూడ చేర్చుట సంఘసంస్కారమెన్నటికి కానేరదు.

## మన కర్తవ్యము

నేటి విదుషీమణులలో పెక్కుమందికి మన సంప్రదాయములును కులధర్మములును పూర్తిగా తెలియవు. స్వమతధర్మములు గుర్తెఱుంగక పరమతస్థుల ననుకరింప గోరువారు సంఘమును సంస్కరింప నర్హులు గారు. పరమతగ్రంథములు చదువుటకును పరమతాచారముల నెఱుంగుటకును ముందు మన నారీమణులు పంచమవేద మనదగు భారతమునైన చదివియుండవలెను. వేదములు చదువజాలని వారికొఱకే సంస్కృతభారతము వేదవ్యాసునిచే రచింపబడినది. సంస్కృత మభ్యసించి భారత భాగవత గ్రంథములు చదివినవారికి మనహిందూ మతోత్కృష్టత పూర్తిగా తెలియును. సంస్కృతభారతము చదువగల భాగ్య మింతటిలో మన తరమునవున్న మహిళామణుల కబ్బుట దుర్లభము. ప్రస్తుతము మనము ఆంధ్రమహాభారతమునైన తప్పక చదువగడంగవలెను. మన బాలికలకు ఆంగ్లేయభాష నేర్పుటకు ముందు విధిగా ఆంధ్రమున భారత భాగవత రామాయణములు చదివి అర్థము చేసికొనుశక్తి కలిగించవలెను. ఆగ్రంథములలోని కథపట్టులు కొన్నియైన బాలికలచే అర్థసహితముగ చదివించి ముఖ్యమైన పద్యములను కంఠస్థము చేయించవలెను.

భారతము సంపూర్ణముగ చదివినవారికి ధర్మాధర్మవివేకము కలుగును. భాగవత పఠనముచేత భక్తిబీజములు మన హృదయములందు నాటుకొని పాపచింతలు తొలగును. రామాయణము చదువుటచే ఆదర్శస్త్రీపురుషులుగ నవతరించిన శ్రీ సీతారాముల ధర్మ్యకథాశ్రవణమున సత్కార్యానురక్తి మనమనముల నంకురించును. మన బాలికలు పవిత్రగ్రంథములు మూడును తెల్లగా పఠించిన పిమ్మట మఱి పరభాషా, పరమతగ్రంథములు చదివినను వారు పెడమార్గమున బడక సంఘమున సత్యసంస్కరణములు జరుపగలవారగుదురు. అప్పుడు సనాతన, సంస్కరణపక్షభేద మంతరించి భారతమహిళా సంఘమంతయు నేకీభావమున దృఢసంకల్పముతో కలిసి పనిచేసి దేశసౌభాగ్యమునకు తోడ్పడగలదు. కావున పురాణములు ప్రశంసించుటతోనే తృప్తివహింపక తమ బాలికలచే ఈమూడు పవిత్రగ్రంథములు తప్పక

చరిమించి విదుషీమణులు మహిళా జనాభ్యుదయమునకు మార్గదర్శకులగున ట్లనుగ్రహింపవలెనని భగవంతుని మనసార ప్రార్థించుచు మనమీ విమర్శనమును విరమింతము.

* * *

## మలబారు వనితలు

మిస్. ఆర్. సి. సారాబాయి, యమ్.ఏ. గారు ఒకపత్రికలో నిట్లు వ్రాయుచున్నారు.

"మలబారు స్త్రీలు సౌందర్యమునకు ప్రసిద్ధికెక్కినవారేయైనను తెల్లని సాదాచీరలు కట్టుకొని సామాన్యముగా కనిపింతురుకాని విలువగల వస్త్రాభరణములు పూవులు మాలలు వేసుకొని విఱ్ఱవీగబోరు. వారి స్త్రీలకు పెండ్లయినను, కాకున్నను, వైధవ్యము కలిగినను, యేమైననుసరే, పిత్రార్జితములో సమానములగు వంతులున్నవి. అత్తగార్లమీద, మామగార్లమీద, పెనిమిటులు బావలు మరుదులు వదినగార్లమీద నాధారపడ నక్కరలేదు. అక్కడ అత్తగారితనము కోడంటికము బాధయే లేదు. ఒక్క నంబూద్రీలలోతప్ప తక్కినవారందరిలోను స్త్రీలవారసత్వమే. నాయరు గృహము కుటుంబయజమానురాలగు నాయరుపడుచు, ఆమె తల్లి,ఆమె అన్నదమ్ము లక్కచెల్లెండ్రు, ఆమె మేనమామలు, మేనత్తలు మొదలగువారితో కలకలలాడుచుండును. ఆమె అత్తింటికి వెళ్లి కాపురముచేయదు. అయినను తన పురుషుని కెట్టి కొరతయు నామెవలనఁ గలుగక ఇరువురును మంచి దాంపత్యసుఖ మనుభవించుచుందురు. పురుషులు వచ్చి స్త్రీలతో అత్తవారింటనే జీవించుచున్నను ఇవతల వారిభార్యాబిడ్డలయెడ నెంత యనురాగమును చూపుచుందురో అవతల తమ తల్లిదండ్రు లన్నదమ్ములయెడలఁ గూడ నంతయనురాగమును బరపుచుందురు. ఆర్థిక దుస్థితులు ప్రబలినప్పటినుండియు పురుషునికి రెండు కుటుంబములయెడల నభిమానమును నెరపగల సామర్థ్యము తగ్గినది. పురుషుడు క్రమముగ స్త్రీలో ఆమెయొద్ద నివసించి శ్రద్ధయంతయు ఆమె కుటుంబము వైపునకే బరచి తల్లి దండ్రులకు దూరముగనుండు స్థితిని విడచి తన తల్లిదండ్రులకు చేరువగుచుండుటయు జరుగుచున్నది. అయినను స్త్రీలవారసత్వప్రవాహములలో మాత్రమేమియు భేదమురాకున్నది.

* * *

తిరువాన్కూరు సంస్థానములో 15000 పట్టభద్రలు (బి. ఏ.లు) ఉన్నారు. ఈ సంస్థానహిందువులలో నాయరు స్త్రీ లెక్కువ చదువుకున్నవారు. నూటికి 60 మంది అక్షరాస్యలు. స్త్రీ పురుషులు కలిసి చదువుకొను కళాశాలలు 7ను, స్త్రీలే చదువుకొను కళాశాల ఒకటియు ఉన్నవి. ఇచ్చటి స్త్రీలకు చదువు చాలదన్న విచారములేదు కాని నిరుద్యోగసమస్యమాత్రము చాలామట్టుకు వీరిని పీడించుచున్నది. ప్రభుత్వశాఖలన్నిటిలోను పోలీసుశాఖలోను కూడ తమకే ఉద్యోగములన్నియు నిప్పించవలెనని స్త్రీజనోద్యమ నాయకులందరు నత్యంతాందోళనము చేయుచున్నారు. శుచిశుభ్రతలలో, విద్యావిశేషములలో, ఉద్యోగసామర్థ్యములలో పాశ్చాత్య దేశీయ యువతు లెవ్వరుగాని వారితో పోలికకు రానేరరు.

* * *

పదేండ్లక్రిందట తురుష్కపడుచు తన తండ్రి, సోదరులు, స్త్రీలు యెదుటతప్ప తక్కిన అందరియెదుటను ముసుగులేనిది కనిపించకూడదు. 15 లేక 16 వ యేట ఆమె వివాహము జరిగెడిది. అవరు నామె యెన్నడును చూచియుండరు. ఆమెను విడచి పెట్టుకునని కోటులలో పురుషుడు చెప్పిన చాలును, కోర్టువారా వివాహమును రద్దుపరచువారు. ఇప్పుడో అంతయు మారినది. బహుభార్యాత్వము, మేలిముసుగుపోయి స్త్రీలకు స్వయంవరము, విచ్ఛేదనాధికారము వచ్చినవి. స్త్రీ పురుష భేదములేకుండా నేడు వారు వీధులలో, క్లబ్బులలో, హోటళ్లలో, సమూహాలలో, నాటకశాలలలో కలసి మెలసి తిరుగుచుందురు.

# శారదలేఖ

సౌభాగ్యవతియగు కల్పలతకు,

నెచ్చెలీ, కడచిన జూలై నెలలో నగల విషయమై నేను వ్రాసిన జాబువలన నగలను విక్రయించు యత్నము విరమించితినని వ్రాసితివి. మఱియు నా లేఖనుగూడ మిక్కిలి ప్రశంసించితివి. మిత్రురాలియందు నీకుగల గౌరవమునకు ప్రేమకు మిగుల సంతసించుచున్నాను. కాని నీవలె యెల్లరును నా నగలసమర్థనము విషయమై సదభిప్రాయము గలిగిలేరు. గృహలక్ష్మి పత్రికారత్నము ద్వారా నేను నీకంపిన జాబుచూచి యనేకులు మెచ్చి ప్రశంసాలేఖలనుగూడ పంపిరి. కాని కొందఱు తీవ్రముగా విమర్శించిరి. ప్రశంసల కేమిగాని విమర్శనముగల లేఖలలో నొకటి రెండు కనుము.

శ్రీమతి శారదాదేవిగారికి దే........ రా... .....మ్మ వ్రాయునది ఏమనగా జూలై నెల గృహలక్ష్మి పత్రికద్వారా మీరు మీ మిత్రురాలగు కల్పలతకు వ్రాసిన జాబునుపట్టి చూడగా వర్తమానయుగ పరిస్థితులను దెలిసికొనెడి వివేకము మీకు బొత్తిగాలేనట్లు తోచుచున్నది. ఏవిధముగానైన ప్రాతకాలపు పద్ధతులను సమర్థించుటే మీ ముఖ్యాశయముగా నున్నటులున్నది. లేకున్న తరుగుదల, యరుగుదల, యపహరణము, హత్యలు మున్నగు అనర్థములతో గూడిన నగలను మీరంతగా సమర్థింతురా? ధనము దాచుకొనుటకు దగిన బ్యాంకులు, జీవిత భీమాకంపెనీలు లేనినాటి మాటలు మీవి. వడ్డీలతో లాభములతో సహా ధనము దాచిపెట్టి భద్రముగా నొసంగగల సంస్థ లెన్నియో దేశమునందు నేడు విరివిగా వ్యాప్తియుండంగ అసలుకే మోసము దెచ్చెడి యాభరణములు ధరించు పద్ధతి మీ కెట్లు మంచిదిగా దోచుచున్నదో తెలియదు. ఇకనైన మీ రిట్టి యనుచితపు సలహాల నీయకుందురని నమ్ముచున్నాను.

కల్పలతా! ఈమెగారి జాబునం దెంత పారుష్యమైన నుండనిమ్ము. దానికి నేను కోపింపను కాని అనుభవజ్ఞానము లేమికి విచారమగుచున్నది. నగలనగా వివాహపు కక్కురితికి పెట్టుదురు. అది తప్పని సరి. మఱియు నెంత పిసినిగొట్టు పెనిమిటైనను నగయైనచో ఒకప్పుడు గాకున్న నొకప్పుడైన నొప్పుకొనునేమోగాని, "నాపేర ప్రతి నెల యింతసొమ్ము బ్యాంకిలోవేయుండీ, నా జీవితము భీమాచేయించి వాయిదా వాయిదాకు రొక్కము కట్టండీ యనిన యెందఱి

మగవా రిందుకు సమ్మతింతురో! ఎంతమంది స్త్రీలముద్దు చెల్లునో ఈమెగారికి తెలియదు. ధనసంపాదనా స్వాతంత్ర్యముగాని వారసత్వాధికారములుగాని లేని స్త్రీలు బ్యాంకులలో భీమాకంపెనీలలో ధనము దాచుకొనుట యెట్లు సంభవించునో నే నూహింపలేకున్నాను. ఇంతకును నీమె మాటలకు విలువలేదు. యేమందువా? ఈమెగారు తాను నగలుపెట్టుకొనకుండనుండి మనకు చెప్పుటలేదు. ఈమెగారి చెవికమ్మలు రెండువేల ఖరీదుగలవి. ముక్కున బెట్టుకొను బేసరి యైదువందలు. మెడలో నెక్లెస్ అయిదువేలు. ఇక బంగారుసొమ్ముల విలువ యేనాలుగైదువేలకో యుండును. శ్రీమంతురాలు గనుక బ్యాంకీలోగూడా కొంత రొక్కము నిలువచేసికొని యుండవచ్చును. కనుకనే "కోడిగ్రుడ్డంత బంగారము లేనివారున్నారా?" అనుచున్నది. తిన్నమ్మ మగని యాకలెఱుగదని సామ్యము గదా. దీని నిట్లుంచుము. మఱియొక సోదరుడుగూడ ఈవిషయమై దీర్ఘమైన లేఖ వ్రాసినాడు. దానిని గూడ చదువుము.

శ్రీమతి శారదాదేవిగారికి నమస్కరించి తమ ప్రియసోదరుడు వ్రాయుమనవి. అక్కగారు! తాము తమ నెచ్చెలి కల్పలతమ్మగారికి నగలవిషయమై వ్రాసిన లేఖ తిలకించితిని. మీలేఖ స్త్రీలకు నగలవలన గలుగు ప్రయోజనములను సమస్తవిధముల నిరూపించుచున్నదనుటకు సందియము లేదు. మఱియు బంగారమంతయు భారతదేశమునుండి కొనిపోబడు చుండుటవలని యనర్థకమును తెలియబఱచుటచే మీలేఖ మఱింత ప్రశస్తమై కనుపట్టుచున్నది. భారతాంగనలు తమయొడలిబంగారమంతయు వెఱ్ఱెత్తిన ట్లమ్ముకొనుచున్న యీ యదనునందు మీలేఖ కొంతమంది వెఱ్ఱికైన నౌషధమై పనిచేసినచో మేలే యనుకొందును, కాని నాకు మాత్రము కొన్ని సందియములు బాధించుచున్నవి. వానిని తమకు తెలియబఱచి సందేహనివారణ గావించుకొనవలయునను తలంపుతో తమ కీ విజ్ఞప్తిపూర్వకముగ జాబు వ్రాయుచున్నాను. ఇట్లు వ్రాయుట తమరిని విమర్శించు నుద్దేశ్యముతో గాదనియు విషయమును దెలిసికొనవలయు ననెడి యభిలాషతో మాత్రమేననియు నా తొలిమనవి. లోకమునందలి సమస్త వ్యవహారములు గుణదోషయుక్తములై యున్నవి. అటులనే నగలయందును గుణదోషములు గలవు. కాని మీరు కేవలము గుణములను మాత్రమే పేర్కొని దోషములను ప్రస్తావింపక విడిచితిరి. ఇది న్యాయముగా నాకు దోచుటలేదు. నగలవలన సార్థక మెంత గలదో, అనర్థకముగూడ అంతగలదు. మన దేశమునందు సొమ్ములవలన గలుగుచున్నంత డబ్బుదండుగ మఱి దేనివలనను గలుగుట లేదు. ఆలోచించి చూడుడు. బంగారమును కొని కంసాలి కిచ్చినదే మొదలు దాని నాశనమునకు–కరగుటలోఁ గొంత, కాల్చుటలోఁ గొంత, చేతలోఁ గొంత, కోతలోఁ గొంత, మెఱుగుపెట్టుటలోఁ గొంత, ఈవిధముగా నెంతయో నష్టము. ఆపైన కంసాలికి సేతకూలి. సరి, నగయేదోవిధముగా తయారై

యింటికి వచ్చునే యనుకొందము. అంతతో మైనదా? వానిలో విరిగిపోవున వెన్ని! అఱిగిపోవున వెన్ని! అసలుపోవున వెన్ని! వీటికి మరమ్మతులు మరల చేయించుట, ఇంతలో కంసాలి మరల యేదైనా క్రొత్త నమూనా చూపించెనా, మరల దానిని చేయించుకోవలయునని బులుపు. అందుకొఱకు మంచిదిగానున్న దానినిగూడ మరల చెడగొట్టుట. ఇక శ్రీమంతులమాట చెప్పనే యక్కఱలేదు, వారి కెప్పుడు నగలు చేయించుకొనుటే పని. కాని యందువలన నెవరికిని బాధలేదు. పేదతనముచే నల్లాడు స్వర్ణకారుల కుటుంబములు కొన్ని వీరివలన సతము పోషింపబడుచుండును. ఇదియు నొకమేలే. కాని సామాన్యులనుగూర్చి తాము యోచింపవలయును. సామాన్య కుటుంబములనగా అన్నవస్త్రములకు మాత్రము పుటాపుటిగా సరిపోవు నాదాయముగల కుటుంబములన్నమాట. ఇట్టి కుటుంబములకు జెందిన స్త్రీలు నగలు కావలయునన్నచో నెక్కడినుండివచ్చును? హిందూస్త్రీలకు తాహతెఱుగనిసొమ్ముల పిచ్చి. ఎంతయెక్కువగా నగలుపెట్టుకొనిన నంత గొప్పవారుగా భావింపబడుదుమని వారి భ్రాంతి. ఇందువలన నగలకొఱకు వారు విశేషముగా శ్రమపడుదురు. భర్తల పీడింతురు. అలుగుదురు. జగడములాడుదురు. ఏడ్తురు. పస్తులుందురు. అపహరింతురు. అక్రమంబులు చేతురు. కావున నాడువారికీసొమ్ముల భ్రాంతియే లేకున్నచో నెంతయో మేలుగదా. స్త్రీలు నగలుపెట్టుకొనుట నాకు యిష్టములేకపోలేదు. కలిగినవారు పెట్టుకొనవచ్చును. లేనివారు మానవచ్చును. కాని నగలలోనే గొప్పతనమంతయు గలదనియు నవిగలవారే గొప్పవారు, గౌరవార్హులు అను భ్రాంతి స్త్రీలకు తొలగవలయునని నా యభిప్రాయము

రెండవది చోరభయము. సొమ్ము పాపిష్ఠిది. పచ్చని బంగారము స్త్రీల యొడలిపై చూడగనే దొంగల కన్నులు కుట్టును. మన దేశములో నూటికి తొంబదితొమ్మిదిమంది దొంగలను స్త్రీల యాభరణములే పోషించుచున్నవి. ప్రతి దేశమునందలి స్త్రీలును స్వేచ్ఛగా దిరిగి తమతమ కార్యములను చక్కబెట్టుకొనుచుండగా నలంకారములనెడు సువర్ణశృంఖలలచే నిబద్ధలై భారత మహిళలు ఒంటరిగా వాకిలిలోనికి బోవుటకు గూడ నశక్తలై యల్లాడుచున్నారు.

ఇక మూడవవిషయము స్త్రీలు తాము ఆభరణములను ధరించి యపాయము పాలపుటయేగాక తమ బిడ్డలకు గూడ నగలు పెట్టుట. ఆలోచించి చూచినచో నియ్యది స్త్రీలు తాము నగలు ధరించుటకంటె గూడ ప్రమాదకరమైనది. స్త్రీలు పెద్దవారుగనుక స్వసంరక్షణ సామర్థ్యమునుకొంత గాకున్న కొంతయైన గలిగియున్నారు. వారి యొద్దనున్న నగల నపహరించుటకు దొంగలకు గూడ భయమే. కాని బిడ్డల విషయములో వారికి నిర్భయము. నోరులేని పసిబిడ్డలు గాన వారిని కడుసులభముగా వంచించి యెటకో గొనిపోయి వారిని బాధించి నగలను కాజేయుదురు. మఱియు నందు

కొఱకై యాబిడ్డలను హత్యజేయుదురు. ఇంత అపాయకరమగు పరిస్థితిని తమకన్న బిడ్డలకు తెచ్చిపెట్టు తల్లులు వారికి శత్రులా! మిత్రులా! బిడ్డలు నగలు కోరరు. పెట్టుకొనిన సంతోషములేదు. పెట్టుకొనకున్న విచారములేదు. కేవలము తల్లులు తమ నేత్రానందముకొఱకు తమ ముద్దుబిడ్డల నిట్టి యాపత్సముద్రమున ద్రోయుటయు యుక్తమేనా? అపత్కారమైన యీ నూనందము స్త్రీలకు నగలపై ల వ్యామోహమువలన నేర్పడినదేఁదా. సోదరీ! తాము దీని నెట్లు సమర్థింతురు? బిడ్డల నగల నపహరించుటకై తస్కరులుచేయుచున్న భయంకరాత్యాచారములెన్నియో ప్రతిదినము మీస్త్రీల చెవుల కెక్కుచునేయుండును. అయితేవానిని వినియు విననట్లులుండి బిడ్డలకు నగలను పెట్టుటకు మురువుజెందుచునే యుందురు. ఇదియెంత పైశాచి కానందము! గమనింపుడు. నగలవలన యిన్ని యనర్థకములు గలవు కాన నగలవలని యనర్థకము ప్రయోజనముకంటె కొలదిగాదు.

సోదరీ! నాకు గల సందియములను తమకు వ్రాసితిని. నాపేరుతోగాని నావిలాసముతో గాని నిమిత్తము లేదు. నేను వ్రాసిన విషయమునందలి మంచిచెడ్డలను తాము సాదర బుద్ధితో గ్రహించి తమ సోదరీ రత్నములకు వెల్లడించిన చాలును.

— ఇట్లు,
తమ యనుంగు తమ్ముడు.

కల్పలతా! ఈ సోదరు డెవఁడోగాని నిజముగా స్త్రీజనమునకు సోదరుడే. ఈ సోదరుని విమర్శన మెంత నిశితముగా నున్నదో యతనిరచన మంతసరసముగను మర్యాదకరముగను నున్నది. భగినీ హితైషియగు నీసోదరున కనంతశుభము లొదవుగాక! మనము మంచిని తెలిసికొనినంత సులభముగా చెడుగును తెలిసికొన జాలమనుట కీసోదరుని లేఖయే సాక్షి, నాచేతిలోని పుశకను దీసికొని నాకన్నునే పొడిచినట్లు లున్న దీలేఖ. ఈలేఖయం దాసోదరునిచే చూపఁబడిన మూఁడు లోపములు మనస్త్రీల యందున్న మాట వాస్తవము. వీని నేవిధముగను కప్పిపుచ్చుటగాని సమర్థించుటగాని పనికిమాలినపని. ఈసోదరుఁడు నావాదము నేమాత్రము ఖండింపలేదు. అనుచిత మనలేను. వానితో బాటు యీలోపములు గూడ గలవు పరిశీలించుకొనుడనెను. మంచిది. ప్రతిదిగుణదోషయుక్తమని యీ సోదరుడు తొలుతనే వ్రాసెనుగదా. గుణదోషములు లేనివస్తువు జగముననే లేదని నపుడు దేనిని గూడ వాడు కొనకుండ నెట్లుండ గలము? నిప్పున్నది. అది చాల అపాయకరమైన వస్తువే. అజాగ్రత్తగా నుండిన చేయి కాలును, గుడ్డ కాలును, కొంపయే యంటుకొనును; యదిలేక యొక్కపూట యైనను గడవదు. మఱిదానిని విసర్జించు టెట్లు? అధిక గుణయుతమైన దానిని స్వల్ప దుర్గుణము

లున్నను వినియోగింపక తప్పదు. కాన సోదరుడు చెప్పిన యాక్షేపణలకు గురికాకుండా స్త్రీలు నగలను వినియోగింపదగును. నగలుండుట మంచిదనగా నగలు లేనివారి నగౌరవింపమనిగాని, నగలకొఱకు భర్తలను పీడింపమనిగాని, నగలను బెట్టి తమ బిడ్డలను నపాయమున ద్రోయమనిగాని యర్థమా? ఎన్నటికిని గాదు. అన్నిటి మాటల కేమిగాని తమ పసిబిడ్డలకు నగలను బెట్టి యానందించు తల్లుల యానందము నిజముగా పైశాచికానందమే. మొన్న నేగదా బెజవాడ యందొక బాల నగలకొఱకై హత్య చేయబడినట్లు వింటిమి. సోదరీ! ఇట్టి యత్యాచారములు జరుగుచున్నను స్త్రీలవివేకముగా వర్తించుచో పరుల యాక్షేపణలకు గురియగు టాశ్చర్యమా!

భావపురి
1934 జనవరి

ఇట్లు: మిత్రురాలు,
శారద.

---

# జ్ఞానమహాసభ

జ్ఞానమహాసభ పిఠాపురమున ఉమర్ అలీషా కవిగారి అహ్వానమున 10–3–34 తేదీని జరుగనున్నది. ఈమహాసభకు బహుదేశములనుండి యోగసాధకులు, ఆధ్యాత్మవిదులు, జ్ఞానయోగులు, రానున్నారు. వీరందరు తమతమ విద్యానుభవములను మానసిక తత్వమును తెలుపు పద్ధతులు తెలుపనున్నారు. ఇందు పూర్వ ఋషుల సంప్రదాయములు, పకీర్ల జ్ఞానమార్గములు బోధకాగలవని తోఁచుచున్నవి. ఈలాటి సభలు మన కిప్పుడు చాలా అవసరము. ఏమందురా, మానవుని అసలు తత్వము జ్ఞానము. అది నానాటికి క్షీణించిపోయినది. తిరిగి సక్రమపద్ధతులపైఁ దానిని ఉమర్ అలీషాగారు తమ శిష్యులకు నేర్పుచున్నారు. వీరి శిష్యు లిప్పటికి ఆంధ్రదేశమున పదివేలున్నారు. వారిలో అనేకులకు ఈశ్వరభావాలు తెలుసును. వారందరు ఈ సభకు రానున్నారు. ఇందు ప్రాచీనములైన యోగమార్గములకు వన్నె తెచ్చు పెక్కు పద్ధతులు గలవు. వీరిచే ఆత్మను ఆత్మగా తెలుసుకొను త్రోవలు కనిపెట్టబడినవి. వక్రమార్గములలోఁ బడిపోవువారందరువచ్చి తమ భావములను మార్చుకొందురని మనవి చేయుచున్నాను.

అంతరవేదిపాలెం
12–12–33

ఇట్లు: జ్ఞానమహాసభసభ్యురాలు,
అల్లూరు సత్తెయ్యమ్మ.

## మాలికా ప్రభావము

డాక్టర్ యస్. రాజారాంరావుగారు, ఏ. ఎం. ఏ. సి.,

భారతదేశమందు ఋషిపరంపరగా వచ్చినట్టి మాలికా ప్రభావములను చక్కగా తెలుసుకొనక, రోగనిర్మూలనమునకు ఇతర దేశములనుండి దిగుమతి యగు మాలికలపై చాలమంది ఆధారపడియుండుట కడుంగడు శోచనీయము. ఈ దేశమందు మన దేహతత్వములకు అనుకూలముగా మనచెంట ఉద్భవించిన మాలికలయొక్క గుణాగుణముల చక్కగా తెలుసుకొన్నయెడల సాధారణముగా వచ్చు వ్యాధులను నిర్మూలము చేయవచ్చును. అంకురావస్థయందే వ్యాధి నిర్మూలమైన రోగాభివృద్ధికి అవకాశముండదు. కాబట్టి ఎల్లరకు చక్కగా తెలియునట్లు వాటి ఫలితము లనుభవించుటకుగాను, శాస్త్రసమ్మతమగునట్టివియును, సాధారణముగా మన అందుబాటులో నుండునట్టివియును మా అనుభవములో రోగజాలములను శమింపజేయునట్టివియునగు మాలికల ప్రభావములను దేశోపకారార్థమై ఈ "గృహలక్ష్మి" మాసపత్రికగుండా వెల్లడిచేయదలచినారము. సోదరసోదరీమణులు సమయమువచ్చినపుడు, మేము ఇందు వ్రాసినట్లు ఆయా రోగములకు వాడి సఫలమనోరథులగుదురుగాక.

### —నేలఉసిరిక—

| | |
|---|---|
| సంస్కృతములో | భూమ్యామలకి |
| తెనుగులో | నేలఉసిరిక |
| అరవములో | కీజ్హానెల్లి |
| కనడములో | కీరెనెల్లి |
| హిందీలో | జరాంవ్లా |

అని పేర్లు.

ప్రభావం:—ఇది భూమికి జానెడుపొడుగుకన్న కొంచెం ఎత్తుగా పెరుగును. ఆకులు చింతాకులవలె నుండును. ఆకులక్రింద ఆవాలవలె సన్నసన్న గుండ్రముగల కాయలు అతికియుండును. సాధారణముగా ఇండ్లదొడ్లలోను, గడ్డిగల ప్రదేశములలోను, మట్టియింటి మిద్దెయందును, అవలీలగా దొరకు వస్తువు. ముదిరిన చెట్లకన్న లేత చెట్లయొక్క సన్న ఆకులు మిక్కిలి శ్రేష్ఠం. కాలుతులం లేత ఆకులు, దీనికి అర్ధభాగం మిరియాలు, మిరియాలకు అర్ధభాగం నీరుల్లిపాయ లేక వెల్లుల్లిపాయ వీటిని మెత్తగా మర్దనచేసి చిన్నగచ్చకాయంత ముద్దలు చేసి ప్రతిదినం పరగడుపున తెల్లవారి మూడుదినములు సేవించిన చలిజ్వరం, వసజ్వరం, పురాణజ్వరం నిస్సందేహముగా నిర్మూలముచేయును. పిల్లవాండ్రకు వయస్సునుబట్టి బటానిగింజ పరిమాణము మొదలు బుద్ధికుశలతతో వాడనగును.

దీనియొక్క ముదిరినవేరు గ్రహించి (ఒక తులం పరిమాణము ఉండవలెను) మెత్తగానూరి కొంచెం ఆవుపాలలోవేసి మెత్తగాపిసికి ఆ పాలను వడియగట్టి ఒక ఔన్సు పరిమాణముగల పాలను తెల్లవారి, సాయంత్రం పుచ్చుకొనుచుండిన శరీరము తెల్లబోయి రక్తహీనమైయుండునట్టి పాండురోగము కుదురును. దీని ఆకులు ఆవుమజ్జిగలో నూరిపూసిన బిడ్డలచిడుము, గజ్జి, చర్మరోగములు పోవును. బిడ్డలకు నోటియందు పోసినను భయములేదు.

దీని ఆకులలో కొంచెం ఉప్పువేసినూరి ఆ ముద్దను దుష్టవ్రణములపైన వేసి కట్టిన అవి మానును. దీని

ఆకులు అరతులం, మెంతులు కాలుతులం కలిపి నూరి గచ్చకాయంత ముద్దను రెండు తులముల ఆవుమజ్జిగలో సేవించిన పురాణరక్త గ్రహణి (ఆమవిరేచనములు) కట్టును. తెల్లవారి సాయంత్రం రెండుపూటలు మూడు లేక ఏడు దినములు ఆవుమజ్జిగ సైంధలవణముతో ఆహారం భుజించుచుండవలెను. దీని వేరును నిర్మలమైన కడుగు నీరుతో నూరి గచ్చకాయంత మూడు నాలుగు పూటలు గ్రహించిన మూలరక్తప్రదరము తప్పక కట్టును. ఆహారం ఆవుమజ్జిగ, సైంధవలవణం. పురాతనముగానుండు వ్యాధికి రమారమి వారముదినములు సేవించుచుండవలెను. దీని ఆకులు 1 తులం, చీనా కలకండపొడి ½ తులం మెత్తగా నూరి గచ్చకాయంత ముద్దను 4 పూటలు భుజించిన, మూత్రములోని మంట, స్రావాదులను నిల్పును. ఈ చెట్టు సమూలముగా లేతవిగా గ్రహించి ముద్దగానూరి, గచ్చకాయంత ముద్దను తెల్లవారి పరగడుపునను రాత్రి పరుండుసమయమునను 4 పూటలు గ్రహించిన పచ్చకామెరలు, జ్వరం నిస్సందేహముగా కుదురును. మధురాహారం, ఆవుమజ్జిగ, సైంధవం, అన్నం, ఆహారం. సాధారణముగా ఈ మూలికా సేవనయందు పథ్యనియమము లేదుగాని అజీర్ణకరపదార్థములు, సాధ్యమైనంతవరకు విడుచుట చాలామంచిది. పూర్తిగా విడిచివేసినను చాలా శ్రేష్ఠం.

—అడ్డసరం—

| | |
|---|---|
| సంస్కృతంలో | వాస |
| తెనుగులో | అడ్డసరం |
| అరవములో | ఆడతోడ |
| కనడములో | అడుసోగె |
| హిందీలో | అంసా. |

ప్రభావం:—ఈచెట్టు భూమికి 20 అడుగులు పెరుగును. ఆకులు జామాకులవలె కొంచెం పొడుగుగానుండును. దీనికి తెల్లటిపూలు పుట్టును. అయ్యవి మిక్కిలి వాసనకలవిగానుండును. ఈ చెట్టు సాధారణముగా అన్నిచోట్లను దొరుకును. ఇది తిరుపతి ప్రాంతములలో చాలావిరివిగా పెరిగియున్నది. దీని వేరు, ఆకులు, పట్ట అన్నియూ మందులో ఉపయోగింతురు. దీని ఆకులను నాలుగు గ్రహించి మెత్తగానూరి ఆముద్దను మత్తిఆకులో పెట్టి పైన మరియొక మత్తిఆకునువేసి బాగాచుట్టి కొంచెం ఎఱ్ఱమన్ను పూచిన గుడ్డను దానిపైనవేసి చుట్టకుమ్ములోపెట్టి కొంచం ఉడికినతరువాత పైన ఉండు వస్తువులను తీసివేసి లోపలనుండు ముద్దను గ్రహించి ఒక చెంచాడు (one tea-spoonful) ద్రవంపిండి దానిలో కొంచెం తేనెకలిపి పుచ్చుకొన్న అమోఘముగ శ్వాసకాసలు, కఫము తొలగించి మిక్కిలి సుఖమునిచ్చును. నోటినుండి గాని, పుప్పుసములో (Lungs)నుండి గాని రక్తము పడుచున్నను తక్షణం నిలుపును. దీని రెండుఆకులు సన్నగా కత్తిరించి, చుట్టగాచుట్టి, ఆ చుట్టను పీల్చుచుండిన ఉబ్బసమందునుండు ఆయాసము తగ్గును. కండ్లు కలకబారి, ఎఱ్ఱగా నొప్పిగానుండిన ఈ చెట్టుయొక్క పూలు కంటిమీదవేసి రాత్రిళ్లు గుడ్డ కట్టుకొని పరుండిన పై ఉపద్రవములు తగ్గును. 4 లేక 5 మార్లు ఇట్లుచేసిన చాలును. దీని ఆకులను పట్టలను గ్రహించి నీళ్లలోవేసి బాగా కషాయం కాచి వేడివేడి కషాయంలో గుడ్డలవద్ది కీళ్లువాపులలో కాపడం (fomentation) చేయుచుండిన నొప్పి, వాపు తగ్గును.

జ్వరం, కఫం అధికముగా నున్నప్పుడు పై వ్రాసినప్రకారం ఆకులముద్ద స్వరసం గ్రహించి, ఆనందభైరవరసం, సీతాంశురసం లేక సన్నిపాతభైరవరసం వాడిన చాలా గుణమియ్యగలదు. సన్నిపాతములు అణచును. ఈ మూలికతోనే వాసారిష్టం, వాసావలేహ్యం ఔషధములు, శ్వాస, కాస, జ్వరం, రక్తపిత్తములకు చేయబడుచున్నవి.

(సశేషం)

(N.B.) దీనిలో ఏమైనను పాఠకులకు సందేహం కలిగిన, విషయం చక్కగా బోధపడకపోయిన ఒకటింకాల్ అణా స్టాంపుతో మాకువ్రాసిన సందేహములు నివర్తింపజేతుము.




## కొబ్బరికాయ పచ్చడితో చేయు గారెలు

విస్తారము ముదిరినదియు విస్తారము లేతదియు కాని ఒక కొబ్బరికాయను దెచ్చి చిన్నముక్కలుగా జేసి రాతిపైనవేసి కొంచెము చింతపండుగుజ్జు చిటికెడు పసుపును నానబెట్టి నేతిలో వెర్రగా వేయించి 5 తులముల పెసరపప్పును, 5 తులముల శనగపప్పును వేసి చక్కగా నూరుకొని, 2 నిమ్మపండ్ల రసము గాని, దబ్బపండ్ల రసము గాని కలిపి ఒకచో నుంచుకొన వలయును. పిమ్మట యొక బాణలిని పొయిమీద వేసి, 5 తు|| మిరపకాయలును, 3 తు|| అల్లపుముక్కలును, అరతులము జీలకర్రయు, అరతులము ధనియాలు, పావుతులము దాల్చినచెక్క, 4 తులముల మంచి నేతిలో వేయించికొని పైని చెప్పబడిన ముద్దలో వేసి కలియనూరి యొకచో నుంచుకొనవలయును. పిమ్మట పావుశేరు నానబెట్టిన శెనగపప్పు రాతిమీదబోసి దానిలో కొబ్బరికాయనీళ్లు కొంచెము కొంచెముగా బోయుచు నూరుకొని పలుచగా చేయవలయును. దానిలో పైముద్ద వేసి చక్కగా కలిపి చిన్న చిన్న బిళ్లలుగా జేసికొని యొక బాణలిలో 5, 6 తులముల నూనెబోసి సన్నని మంటబెట్టి నూనె మరగినతర్వాత ఈ బిళ్లలను దానిలో వేసి యెర్రగా వేగినతర్వాత పైకితీసి దేవవలెను. ఇవి తినుటకు రుచికరముగానుండును. ఈ బిళ్లలను పుల్లని పెరుగొక పావుశేరు తెచ్చి దానిలో కొంచెము పసుపును, సరిపడినంత ఉప్పును వేసి కలుపుకొని, 3 తులముల మిరపకాయలు, అరతులము ఆవాలు, మెంతులు కొంచెము కరివేపాకు నూనెలో వేసి తిరుగ బోతపెట్టుకొని దానిలో పైనచెప్పబడిన బిళ్లలను బాణలినుండి తీసినవెంటనే వేయుచు రావలెను. ఇష్టమయినయెడల 2 తు|| చక్కెరపొడి చేర్పవలెను. అన్నముతో ఆబిళ్లను భక్షించుటకును ఆ పెరుగు అన్నములో కలుపుకొనుటకును ఉపయోగించును. శీతాకాలమందు ఈపదార్థము భుజించిన ఆరోగ్యముగనుండును.

## చక్కెరపానకము, తేనె పీటితో చేయు ఖిచిడీ

ఒక శేరు ప్రశస్తమగు తెల్లని సన్నబియ్యమును కడిగి సిద్ధముగానుంచుకొనవలయును. పిమ్మట ప్రశస్తమగు చక్కెర అరవీశ తెచ్చి, 1½ శేరు పరిశుభ్రమగు నీళ్లలో బోసి కలిపి పూర్తిగా కరిగిన పిమ్మట వడియగట్టుకొని, ఒక కళాయివేసిన పాత్రలో బోసి పొయిమీదనుంచి మూతబెట్టి సన్నపు మంటపైని మరగనియ్యవలయును. కొంచెము ఆవిరి వచ్చునప్పుడు కడిగియుంచుకొనిన బియ్యముపోసి మూతబెట్టవలయును. అట్లది ఉడుకుచుండగా, 1 తులము యాలకలు, అరతులము జాపత్రి, అరతులము జాజికాయ, 1 తులము మిరియాలు, 5 తులములు వేయించిన గసగసాలు, వీటి పొడియును 10 తులముల కిస్మిసుపండ్లును, ఆయుడుకుచున్న దానిలో వేసి కలియబెట్టవలయును. ఇట్లు కలియబెట్టిన మరికొన్ని నిముషములకు ప్రశస్తమగు తేనె పావుశేరుపోసి కలిపి దించుకొనవలయును. దించిన కొంతసేపటివరకు మూతబెట్టియుంచి పిమ్మట భుజింపవలయును. వారము దినములవరకు నిలవయుంచవచ్చును.

శీలా అప్పలకొండ.

## — బాదాంఖీర్ —

ఒక కుటుంబానికి, 8 పలముల బాదంపప్పు నీటిలో ½ ఘంట వూరపెట్టి తర్వాత తొక్కవలిచి ముద్దనూరి, ఆ ముద్దను నీటిలో కొంచెం అనుకుగా కలిపివుంచి, 1 పడి పాలు చిక్కగాకాచి అందులో కొంచెం కేసరి, పచ్చకర్పూరం, పన్నీరు, ఏలకపొడి వేసి, కలిపివుంచిన బాదంజావ అందులోపోసి బాగ పాలఘాటుగంటెలో కలిపి దించి, ఆరనిచ్చి భుజించిన స్వర్గానికి బెత్తెడుయెడం.

— తిరగబోత అటుకులు —

అటుకులతో ఎన్నివిధములైనా చేయవచ్చును. అటుకులు బాగ వడ్లగింజలులేకుండా ఏరి ¼ పడి అటుకులు తీసివుంచుకుని ¼ పడి నీళ్లు ప్రొయ్యిమీద బాగ మఱగనిచ్చి యీ అటుకులు అందులోపోసి వార్చేసివుంచి, బాణలిలో కొంచెం ఉద్దిపప్పు, ఆవాలు, మూడు మిరపకాయలు, కొంచెం పచ్చి కరివేపాకు వేసి, 4, 5 మిల్లీల నెయ్యివేసి బాగా పళపళ వేగనిచ్చి, ఈ అటుకులు అందులోపోసి, దానికి తగుమైన ఉప్పు పొడిచేసివేసి కుదిపి దించి భుజించిన బాగుండును. ఇది పథ్యకారి. పూరక భుజించుటకు ఇందులోనే ముంతమామిడిపప్పు, శనగ పప్పు పోపులోవేసి, నిమ్మకాయరసం పిండి, ఒక చిటిక పసుప్పొడి వేయవచ్చును.

— అటుకుల చక్కెరపొంగలి —

ఒక అళాకు అటుకులు, ఒక అళాకు పెసలపప్పు తీసుకుని 3½ అళాకు నీళ్లు మరగనిచ్చి, ఈ పప్పు అటుకులు అందులోపోసి బాగవుడకనిచ్చి, బాదం పప్పులు 10, జీడిమామిడి 1 పలం, ద్రాక్ష ½ పలం, బాగ నెయ్యివేసి వేచి, ఉడికిన అటుకుల్లోపోసి, 6 పలాల చక్కెరపోసి, కొద్దిగ ఏలకపొడి, కొద్దిగ కేసరి, పచ్చకర్పూరంవేసి, కొంచెం పాలుకలిపి దించి, కొద్దిగా ఓగిరంబారగించిన స్వర్గముదగ్గరకు వెళ్లుటకు ఎంతో ప్రయాసలేదు.

— మిరియాలవడలు —

1 అళాకు శనగపప్పు, 1 అళాకు బియ్యము, 1 అళాకు మినపపప్పు, వేరు వేరుగా పాత్రలలో నీళ్లుపోసి యూరబెట్టి, 3 ఘంటలైన తర్వాతబియ్యం, శనగపప్పు, కొంచెం బరకగారుబ్బేది. మినపపప్పు మెత్తగా రుబ్బేది. ½ పలం మిరియాలు నక్కముక్కగా పొడిచేసి, తగుమైన ఉప్పు పొడిచేసి, మిరియాలపొడి, పిండ్లముద్దలు, అంతయు కదంబము చేసి ఉంచుకునేది. చెప్పడంతోటి సరిపోతున్నదే, కాల్చడమెప్పుడా అని అక్కయ్యలు ఆతురపడ వచ్చును. అన్నీ తయారుచేసుకుంటే పొయ్యి మంట వేసి కాల్చడ మెంతసేపు గ్రహించండి. ప్రొయ్యి మంటచేసి ¼ సీశ నెయ్యి బాగమరగనిచ్చి ఈముద్ద తడిగుడ్డమీద పలాచగా వడలుతట్టి కాల్చి భుజించిన బహురుచి. ఇది వారంరోజు లుంటవి.

—ఇనుదుర్తి శకుంతల

— సగ్గుబియ్యం పకోడీలు —

మైదాపిండి అళాకు, గోదుమరవ అళాకు, సగ్గు బియ్యం అళాకు, పచ్చిపిండి అళాకు, పచ్చి మిరప కాయలు తరిగి తగిన ఉప్పువేసి పెరుగులోకలిపి ఒక గంటసేపు ఉంచవలయును. ఆవాలు, కరివేపాకు పోపుచేసి, పైనచెప్పిన పిండిలోకలిపి, పొయ్యిపై బాణలిలో నేతినిపోసి కాగినపిదప, దానిలో కలిపిన ముద్దను ఉసిరికాయవలెచేసి, నేతిలో దోరగ వేయించి తీయవలయును. ఇవి వేడిగాతినిన చాల రుచికరముగానుండును.

—శింగీతం ఇందిరాదేవి

— కారపు వంకాయకూర —

వొంకాయలు లేతవి నాలుగుపక్షములుగా తరిగి, వేయించిన కారముగాక, పచ్చిమిర్చి, అల్లం, కొద్దిగా రెండుమిరపకాయలుచేర్చి, మెత్తగాదంపి, ఆ వొంకాయలకు బట్టించి, మెత్తగా వుడికించిన కూర చాలా రుచిగావుండును. ఈకారములోనే కొత్తిమీర చేర్చిన బాగుగానేయుండును.

— తమలపాకుల పూరీ —

చాలా మెత్తని పావుశేరు శనగపిండిలో తగు మాత్రము ఉప్పు. స్వల్పముగా కారముచేర్చి, పిండి నీళ్లతో చాలాపలుచనగా కలిపి, శుభ్రమైన తమల పాకులు యీ పిండిలో లోపలను వెలుపలను బట్టించి నేతిలో దోరగావేయించి తినిన చాలా రుచిగాయుండును.

—దా. లక్ష్మీనరసమ్మ




నీ షోకేడ

శ్రీమతి ఎ. కోమలమ్మగారు

(గేయము)

తెలుగువాణ్ణంటూను
తెగనిడిసిపడతావు
తెలుగుమాటాళ్లేక
తెలతెలాబోతావు. ౧.

అనుకరణాలొద్దంటు
అందరికీ చెబుతావు
పెరవారి వేషాల్తో
పరుగులేస్తూంటావు. ౨.

స్వాతంత్ర్యమంటావు
సంస్కరణలంటావు
నాయింటివిషయాన
నవి చెల్లవంటావు. ౩.

దేశసేవనుగూర్చి
వ్యాసాలువ్రాస్తావు
ముందంజవెయమంటె
మొగమొట్టి చూస్తావు. ౪.

దీనరక్షణమీద
దిట్టాలుచేస్తావు
బీద లింటికి వస్తె
గదిమి పంపేస్తావు. ౫.

డంబాలువద్దంటు
డబ్బీలు కొడుతావు
మురువైన వేషాల
నూరేగుతూంటావు. ౬.

మంచిపలుకుల, నెదుట
పంచాయతీల్ తీర్చి
తలుపోరగా వేసి
తంటాలుచేస్తావు. ౭.

మాతృపూజ

భమిడిపాటి చినయజ్ఞనారాయణశర్మగారు (కవితాసమితి)

జంకేలా! శంకేలా!!
జయధ్వానముల, జనని రమ్మనగ॥ జం॥
పావన మదస్రుప్రవాహమున నా
తల్లి పాదములు తడుపుదునా?
జీవిత సుమముల మాలల గూరిచి
తల్లి యఱుత నే నుంచుదునా? జం॥

# బాలవిజ్ఞానశాఖ

[ఈక్రింది రెండుపాటలును ఉత్సాహముగా నుండునప్పుడు పెద్దలు తాము చెప్పుచు చిన్నపిల్లలచే పాడించుటకు ఇంపుగ నుండును. ఇవి అనుశ్రుతముగ పాడబడుచుండు పాటలేగాని పుస్తకములలో నచ్చుపడి యుండునవిగావు.]

**పాటలు**

శ్రీమతి యల్. సుబ్బలక్ష్మిగారు

౧. చందమామ చీరాగట్టి,
సన్నబియ్యము వళ్ళోబోసి,
అమ్మా! అమ్మా! చిన్నాదాన్ని:
అల్లుడొస్తే పంపావద్దు.

౨. చందమామ!చందమామ!ఓచందమామ!
చందమామ కూతురు నీలగిరికన్య—
నీలగిరికన్యకు నిత్యమల్లెతోట—
నిత్యమల్లెతోటలోను రాజకూతురుకోట—
రాజకూతురు కోటలోను రత్నాలపీట—
రత్నాలపీటక్రింద ముత్యాలమూట—
ఆమూట నాకిస్తె మాదొడ్డమూట.

[కొందరు పిల్లలు గుండ్రముగ నిలుచబడిగాని కూర్చునియుండిగాని ఆడుకొను నొకయాట:—పిల్లలం దొకరు ఒక్కొక్కపిల్లను చూపుచు ఒక్కపదము నుచ్చరింపవలెను. ఇట్లు చెప్పుచురాగా కడపటిదగు (15 వ. పదము) గ్లప్ ఎవరిని చూపునపుడు వచ్చునో ఆపిల్ల పండినది (గెలిచినది.) కనుక ఆపిల్ల గుంపులో నుండి బయటకు పోవచ్చును. మిగిలిన వారిలో కూడ ఇదేవిధముగ చెప్పుచు, మొత్తము పదము ఏపిల్లయొద్ద ఆఖరగునో ఆపిల్ల పండుచురాగా చివరకు మిగిలిపోవుపిల్ల దొంగయగును. ఎందరు పిల్లలతోనైనను ఈయాట నాడవచ్చును.]

3. అవ్వరి డవ్వరి డక్కరి డన్,
ఆఫిన్ కాఫిన్ విస్కీ డన్;
టువ్విల్ టువ్విల్ ట్వంటీ వన్,
ఆ ఈ గ్లప్.

౪. ఉయ్యాలకంబాల

శ్రీమతి అంబటిపూడి సుభద్రమ్మగారు

ఉయ్యాలకంబాల వూరిపేరేమి
అచ్చబల్లలమీద రాజుపేరేమి
చింతచెట్లకింద చిలుబొమ్మలిల్లు
వాటిక్కి-వాకిళ్ళు బోలతలుపూలు
పలకిందవున్నాది పొన్నయినమేడ
మేడల్లోవున్నాయి జోడుహంసల్లు
హంసంసపేరేమి అడిగి రావయ్యా
రాచిలుకరామప్ప రంభపెద్దప్ప
విను తేమి......వదినమఅదళ్లు
టెంకాయచిప్పలు తేనెమామిళ్ళు
దేవేంద్రపూలతోట నేపుట్టినిల్లు
అడుగడుగు దబ్బల్లు ఆకునిమ్మల్లు
అడుగడుగో...పురం అత్తవారిల్లు.

### మల్లెపందిరి కట్టువిధము

శ్రీమతి బచ్చు బేబి సీతమ్మగారు

ఒక చదరమైన చిన్నబల్లకు నాలుగు ప్రక్కల నాలుగు, మధ్య నొకటి, గోడుకు పుల్లలు పెట్టించి మీదకు వెదురుబద్దలతో పందిరివలె కట్టవలెను. ఆపందిరకు ఆకుపచ్చని పూలుకట్టిన మల్లెతీగవలె నుండును.

సన్నని ఇత్తడితీగె 5 అణాలది తెప్పించి జానెడంత ముక్కలుగా కత్తిరించవలెను. పెద్దసూదికి ఒక్కొక్క ముక్క చొప్పున చుట్టవలెను. అది వంకులుగా మారును. రెండు కొనలు కలిపి గుండ్రముగా వంచవలెను. ఆకుపచ్చనిపూలు 8 అణాలది కొని 4 పోగులుగా చీరి వుండచుట్టుకొని ఒక్కొక్కవంపు తీగెకు చుట్టిన మల్లెఆకువలె కనుపించును.

ఈమాదిరిగా 130 ఆకులు చేయవలెను. తెల్లని పటికపూసలు 4 అణాలవి తెచ్చుకొని 8 దేసి పూసలు…చొ॥ జానెడేసి తీగెముక్కలకు చేర్చిన మల్లెపువ్వు రెక్కవలెనుండును. ఆవిధముగా నాలుగేసి రెక్కలు కలపిన మల్లెపువ్వువలె కనుపించును.

ఈమోస్తరుగా 20 పువ్వులు చేసుకొని రెండేసి ఆకులమధ్య నొకపువ్వువేసి పందిరంతయు పూలుతోగాని తీగెతోగాని కట్టవలెను. కట్టిన, మల్లెపందిరవలె కనుపించును. బల్లమీదగాని బొమ్మల కొలువునందుగాని పెట్టుకొనిన మిగుల అందముగా నుండును.

## పిట్టకథలు

### యథారాజా తథాప్రజా

గోపరాజు రాజన్నగారు

ఒకఊళ్లో ఒకరాజుకలడు. ఆరాజుకి మీసంపొడుగు. ఒకనల్లి కుడిమీసములో చేరి రాజుగారిని కుట్టినది. రాజు కుడివైపు మీసం తీయించివేసెను. సభలో మంత్రి ఇదిచూచి తనఎడమవైపు మీసం తీయించివేసెను. "ఏమి మంత్రీ, సగంమీసం తీయించితివి?" అని రాజుగారడిగిరి. "యథారాజా తథాప్రజా" అని మంత్రి సెలవిచ్చెను.

---

### చంద్రుడిలో కుందేలు

కాంచనపల్లి వేంకటరంగారావుగారు

మన తాతముత్తాతల కాలమునుండి, తరతరములుగా బాల్యావస్థలో యేదో యొక కథ ముసలమ్మలు చెప్పడం, మనం వినడం మామూలైంది. కాని అవి యెంతవరకు యథార్థములో చెప్పినఆముసలమ్మలకు యెంత తెలుసో, మనకూఅంతే. ఇటువంటి వాటినే యింగ్లీషులో Fabels అంటారు. అటువంటిదే యిప్పు డొకటి వ్రాయబోతున్నాను. చెప్పతేం చాలా విపరీతంగా ఉంటుందిలెండి కథ.

సృష్టిప్రారంభదశలో ఇంతమంది జనసంఖ్య, ఇన్ని వృక్షాలు, ఇన్ని జంతువులు, ఇన్ని పక్షులు లేవు. అంటే యీభూభాగము అప్పటిలో యింత అభివృద్ధిలో లేదన్నమాట. అటువంటి రోజుల్లో ఒక కుందేలు, ఒక కోతితో స్నేహము చేసుకుని, యిరువురు మైత్రితో ఉండేవారు. కుందేలు వీలైనంత వరకు శుద్ధశ్రోత్రియముగా ఉండి ఆచార వ్యవహారములకు లోబడి పూజాపురస్కారాలు, ఉపవాసాలు

జరుపుతూ, నిష్ఠానియమాలతో జీవితం వెళ్లిస్తూవుండేది. కాని కోతిమట్టుకు చాలా ప్రపంచకజ్ఞానము కలదై, యివేమీ చేయకుండా కడుపు నింపుకోడం అనే ప్రయత్నంలో దినమంతా గడిపేది.

ఒకనాడు కుందేలు కోతినిచూచి "మిత్రమా! ఇది కార్తీకమాసము గనుక మనం ఉపవాసం వుండాలి. అలాచేస్తే మనకు పుణ్యంవస్తుంది. తద్వారా అతిసులువుగా స్వర్గానికివెళ్ళొచ్చు. గనుక తప్పకుండా వుపవాసంచేద్దాం" అంది. కోతికూడా తనకు మనస్సులో నిజానికి యిష్టంలేకపోయినా, స్నేహితుడు యేమనుకుంటాడో అని 'సరేలే' అంది.

ఉపవాసం ప్రారంభించినది మొదలు, యిదైన తర్వాత యేమి తినడమా అనే బెంగతో కనపడ్డ కాయలు, పండ్లు జాగ్రత్తపెడుతూ భగవంతుని మనఃస్ఫూర్తిగా యొకమారైనా తలిచిందిగాదు. కుందేలుమట్టుకు బహునియమముతో భగవంతుని లీలల స్తోత్రముచేస్తూ అన్యచింతన లేకుండా కాలక్షేపం చేసింది. కుందేలుయొక్క భక్తి యెంత దృఢమైనదో గాని, ఇంద్రుని సింహాసనము సహితము గజగజలాడింది. అంత ఇంద్రుడు యిది కనిపెట్టి, తన నిమిత్తము యెవరో భక్తులు ప్రార్థించుచున్నారని గ్రహించి, భూలోకముపైపు యొక్కమారు బుర్రవంచి చూచాడు. చూసేటప్పటికి భక్తురాలు యొక కుందేలని తెలిసింది. సరే దీని తపస్సు భగ్నంచేసి పరీక్ష చేద్దామనుకొని యొక ముసలిబ్రాహ్మణ వేషంతో వచ్చాడు.

మొట్టమొదట కోతివద్దకు వెళ్లి ముష్టిఅడిగాడు. కోతి తన నిమిత్తము జాగ్రత్తచేసుకున్న కొబ్బరి కాయముక్కలు, జామపండ్లు కొన్ని యిచ్చింది. "సరే నేను నీస్నేహితుడగు కుందేలువద్దకు కూడా వెళ్ళివస్తాను. అందాకా యివియెవరూ తినకుండా చూస్తూ యిక్కడే వుండు" అని ఇంద్రుడు కుందేలు వద్దకు వెళ్లాడు. అక్కడ కూడా మామూలు ప్రకారమే అడిగాడు. అప్పుడే కుందేలు తన ధ్యానాన్ని పూర్తిచేసుకొని, వుపవాసానంతరము ఒక బ్రాహ్మడికివిందు చేయాలనివిప్రునినిమిత్తంయెదురుచూస్తోంది. నిజంగా అప్పటికి జాగ్రత్తపెట్టి యేదీ ఉంచలేదు. భగవంతుడే ప్రసాదిస్తాడని ఊరుకుంది.: తాను మట్టుకు గడ్డితిని పూరుకోగలదు. మరి బ్రాహ్మడికో? తనలేమినంతా బ్రాహ్మణవేషంతోఉన్న ఇంద్రునికి నివేదించుకుంది. భోజనము నిమిత్తము వచ్చిన బ్రాహ్మణుని వుపవాసముతో పంపుట మంచిదిగాదని ఇంద్రునివైపు చూచి "నీవు నిప్పుచెయ్యి నేను అందులోపడి కాలిపోతాను. తర్వాత నీవు నన్ను యిష్టమువచ్చినట్లు ఆహారముగా చేసుకొని, నా ఆత్మకు శాంతిని, ముక్తిని, యిమ్ము"అని కోరింది.

* * *

నక్క ఇంద్రుడు వెళ్ళిపోవుటచూచి, మరి వచ్చేదేమిటని అతని నిమిత్తము వుంచిన జామపండ్లు, కొబ్బరి ముక్కలుతినేసి కోతి కనబడకుండా ఒక పెద్దగాబురు వృక్షంలో దాక్కుంది. స్వతహాగా పుట్టక, యొకరి మూలముననో పురిగొల్పబడిచేసిన యేపనైనా యిలాగే యుంటుంది.

కుందేలు కోరినట్లే ఆమాట యెంతవరకు నిజమో గ్రహిద్దామని బ్రాహ్మణుడు నిప్పుచేసి "సరే, ఇందులో పడు"అన్నాడు. కుందేలు మరో తలంపు లేకుండా అందులో కురికింది. కాని వెంటనే నిప్పంతా నీరైపోయింది. అందులో ఇంద్రుడు తన నిజస్వరూపంతో కుందేలుకు ప్రత్యక్షమయ్యాడు. "నీభక్తికి, త్యాగముకు మెచ్చితిని. నీశరీరమును నాకై యర్పణగావించుకొంటివి గనుక నీచరిత్ర మరుపురానిదై యీప్రపంచము వున్నంతవరకూ అందరూ తలుస్తూ ఉండేటట్లు చేస్తాను" అని చెప్పి చంద్రుడిలో యీబొమ్మవ్రాసి"నీపేరు శాశ్వతముగా యుంటుంది. నీకు ముక్తిని యిచ్చాను పో"మ్మని అంతర్ధానమయ్యాడు.

(గృహలక్ష్మికి ప్రత్యేకం.)

# చిత్రప్రశ్నలకు సమాధానములు

నవంబరుమాసములో మేము ప్రకటించిన శ్రీమతి పాకనాటి లక్ష్మీకామేశ్వరిగారి ప్రశ్నకు శ్రీమతులు అ॥ వెంకటరమణమాంబ, కలపాక వెంకటరామాయమ్మ, వారణాసి వరలక్ష్మి, పి. కనకరత్నమ్మ పులుగుర్తి కనకమ్మ అయ్యగారి ప్రభావతీదేవిగార్లును శ్రీయుతులు ఊ॥వెం॥శ్రేష్ఠి, బి. నరసింహమూర్తి, అయ్యగారి సూర్యనారాయణమూర్తిగార్లును సమాధానములను వ్రాసిరి. కందకం, కణిక, చేదచే, కంటకం, తాపితా, చేటచే, ముఖ్యము, మడమ, అను సమాధానములను వ్రాసిరి. శ్రీమతి వరలక్ష్మమ్మగారు కణికకు బదులు తనుత యని వ్రాసినారు. ఈ సమాధానములనే శ్రీమతి అయ్యగారి ప్రభావతీ దేవిగారు ఈ దిగువ సీసపద్యములో నిమిడించి వ్రాసినారు.

సీ॥ కాపాడుకోటకు కందకంబీవల
స్వల్పమంచనుట కర్థంబు కణిక
తిర్థంబుచేదచే దీతురు జనులెల్ల
కంటకంబన ముల్లు కమరునాఖ్య
పట్టువస్త్రముదెల్పు పదమానుతాపితా
చేటచే బియ్యంబు చెరుగనగును
అత్యవసరము ముఖ్యమనుట కొప్పును
అరిపాదమనునంగమగును మడమ.
తే॥ అరయనెన్మిదికిని మూడైయక్కరములు
ఈవలావలజూచిన నేకవిధము
గాననుత్సాహముం గల్గువనితలెల్ల
దెలియుదురు గాక దయచేసి తేటపడగ.



చిత్రప్రశ్న

తాయి రత్నమాల

సీ॥ నక్షత్రవీథికి నాయకుఁడెవ్వండు? రంగగు గుడిలోన లింగమెద్ది?
వాహనంబులమీఁది వన్నెకుమొదలెద్ది? దేవతా ఋషులకుఁ దిండియెద్ది?
నరకాసురునిఁగన్న నాతినామంబెద్ది? పొలతి చక్కఁదనానఁ బోల్పనెద్ది?
తల్లికిఁ గడగొట్టుతనయునిపైనెద్ది? కమలాప్తు బింబంబు గవ్వనెద్ది?
తే॥ అన్నిఁటికిఁజూడ రెండేసియక్కరములు
ఆదులుడుపంగఁ దుదలెల్ల నాదులగును
సరిగజెప్పిన నేనెంతొ సంతసింతు
చెప్పలేకున్న నవ్వెద చిన్నినవ్వు.

## యుక్తి లెక్క

ఒక ముత్యాలహారములో కొన్ని ముత్యములు గలవు. వానిని ఇద్దరుమిత్రులు సమానముగ పంచుకొనిరి. కాని ఒకముత్యము మిగిలినది. ముగ్గురుపంచుకొనిరి. మరల మిగిలినది. ఇట్లు ఆర్గురు పంచుకొనినను ఒక ముత్యమే మిగులుచుండినది. తుదకు ఏడుగురు పంచుకొనగా సరిగాపోయినవి. ఆ హారమందలి ముత్యములెన్ని?

# పుష్పచయము

## ఏలూరులోని మూడు ధర్మసంస్థలు

1. హిందూ యువజనసంఘము. (Y.M.H.A.) స్థాపితము. 1904
2. అన్నవస్త్ర వైద్య విద్యాదాన సమాజము స్థాపితము. 1913
3. గోసంరక్షణ సమితి స్థాపితము. 1918

హిందూ యువజనసంఘ గ్రంథాలయము:— ఈ సంఘము 30 సంవత్సరముల క్రింద స్థాపింపఁబడెను. 1918 సం॥ సంఘము రిజిస్టరు చేయఁబడినది. 1928 సం॥ రావుబహదుర్ శ్రీ మోతే గంగరాజు జమీన్దారు గారు రు. 50,000 లు ద్రవ్యము వెచ్చించి దివ్యభవనమును గట్టించి ధర్మమునొసంగిరి. దిన, వార, పక్ష, మాస, పత్రికలు ఆంధ్ర, ఆంగ్ల భాష మున్నగువానిలో సుమారు 60 వచ్చుచున్నవి. ఆంధ్ర, ఆంగ్ల, సంస్కృత గ్రంథములు 12,000 గలవు. మూడుభాషలయందును అచ్చు క్యాటలాగులు గలవు. ఇంగ్లీషు బ్రీఫ్ రిపోర్టు కూడ కలదు. 1932 సం॥ పదవ సంవత్సరోత్సవము జరుపఁబడి ప్రింటెడ్ రిపోర్ట్సు వున్నవి. ఈసంఘమునకు శాశ్వత ధర్మకర్తలు 500 లిచ్చినవారు 33 దానశీలురుగలరు. ప్రతి సంవత్సరము ఆదాయమునకు మించిన వ్యయము రు 1000 ల వఱకు అగుచున్నది. ఇంకను గ్రంథములు, పత్రికలు తెప్పింపవలసినవి చాల గలవు. ఎలక్ట్రిసిటీ, రేడియో అవసరము, మ్యాజిక్ లాంతర్ల ఉపన్యాసములు అవసరమై యున్నవి. ప్రతి సంవత్సరము వ్యాసరచన పోటీ పరీక్షలు జరిపి బహుమతుల నిచ్చుచున్నారు. గొప్ప గొప్ప ఉపన్యాసకులచే ఉపన్యాసము లిప్పించుచున్నారు. ప్రతిదినము సుమారు 200 మందిగా పాఠకులు వచ్చుచుందురు. ఇందు జాతి మత వివక్షత లేక సర్వజనులు మెంబర్లుగ చేరవచ్చును. ఇండ్లకు గూడ పుస్తకము లీయఁబడుచున్నవి. బజారులో బ్రాంచి లైబ్రరీకూడ పెట్టఁబడినది. స్త్రీలు చాల మంది సభ్యులుగా నున్నారు.

ధర్మకర్త సభాధ్యక్షులు రావుబహదూర్ శ్రీ మోతే గంగరాజు జమీందారుగారు. ధర్మకర్త సభా గౌరవకార్యదర్శి శ్రీయుత మద్దుల వెంకటచిన్నరాజు శ్రేష్ఠిగారు. సంఘాధ్యక్షులు దివాన్ బహదూర్ శ్రీయుత మోచర్ల రామచంద్రరావు పంతులుగారు. ఉపాధ్యక్షులు శ్రీయుత మోతే నారాయణరావు జమీందార్ గారు.

సంఘాభివృద్ధికి ఎల్లరు తోడ్పడఁగోరుచున్నాము. అమెరికాలో కార్నిజీ అను కోటీశ్వరుడు గ్రంథాలయముల యుపయోగము గ్రహించి 20 కోట్ల రూపాయలు ధర్మము నొసంగియున్నారు. కావున నిట్టి విద్యాసంస్థకు ఎల్లరు శక్తికొలఁది ధనసహాయము చేసి దేశమునందు విజ్ఞానమును పెంపొందింప గోరుచున్నాము.

## ఏలూరు అన్నవస్త్ర వైద్య విద్యాదాన సమాజము.

ఈ సమాజము 20 సంవత్సరముల క్రిందట స్థాపింపఁబడినది. 1916 లో గవర్నమెంటువారు స్థలమును ధర్మముగ నొసంగిరి. 1920 లో కీ॥ శే॥ బొమ్మారత్నం శ్రేష్ఠిగారు సదరు స్థలముపైన భవనము కట్టించి ధర్మము నొసంగిరి.

ఇందు ప్రతిరోజు బీదలకు అన్నదానము జరుగుచున్నది. ప్రతి సం॥రం డిసెంబరు 15-వ తేది సుమారు 1500 మంది బీదలకు వస్త్రదానము జరుగు

చున్నది. సాయంకాలము ప్రతిరోజు బీదలకు వైద్య దానము జరుగుచున్నది. విద్యాదానమునకు స్కూల్లు విద్యార్థులు మున్నగువారికి గ్రంథముల నిమిత్తమును, జీతముల నిమిత్తమును సహాయము చేయుచున్నారు. వేసవికాలమందు మంచి చలివేంద్రలు సమాజము పేరిట పెట్టఁబడుచున్నవి. రాత్రి మధూకరము సంవత్సరములో నెలరోజులు జరుగుచున్నది. ఇందు 500 రూప్యములిచ్చిన 48 శాశ్వత ధర్మకర్తలు గలరు. శాశ్వత నిధి ధర్మమునకు రు 10 లు లగాయితు రు 500 ల వఱకు ధర్మము లిచ్చిన వారివారి పేర్లతో ధర్మము జరుపుచుందురు. ఇతరవిషయములు సంవత్సర రిపోర్టులకు, రూల్సు బుక్కులకు మున్నగువానికి వైస్ ప్రెసిడెంటు ట్రస్టీయునగు శ్రీయుత మద్దుల వెంకట చిన్నరాజు శ్రేష్ఠిగారికి వ్రాసిన తెలుప గలరు. శక్తికొలఁది అందఱు తోడ్పడ గోరుచున్నాము.

## ఏలూరు గోసంరక్షణ సమితి

ఈ సమితి 16 సం॥ క్రిందట స్థాపింపఁబడినది:- ఇందు అనాథగోవులు విశేషముగ రక్షింపఁబడినవి. ఇంకను రక్షింపబడనున్నవి. పాలున్న రొండలచంటి బిడ్డలకు, బీదలకు, దైవపూజకు సప్లయి చేయబడును. బీడుభూమి కావలసియున్నది. స్వంతభవనము ఏర్పడవలసి యున్నది. పరిగడ్డి, తవుడు, తెలగపిండి, నెల చందాలు, సంవత్సర చందాలుకూడ పుచ్చుకొనుచున్నారు. ఇందుకు, ఈసమితి తరఫున గోమాత, గోవు, గోమహిమ, గోప్రభావము, కామధేనువు, మూఁగతల్లి, అను ఆరు గ్రంథములు అచ్చువేయించఁ బడి ఉచితముగ పంచిపెట్టబడినవి.

ట్రస్టీయు ప్రెసిడెంటు శ్రీ రావుబహదూర్ మోతే గంగరాజు జమీందార్. వైస్ ప్రెసిడెంటును ట్రస్టీ శ్రీయుత మద్దుల వెంకట చినరాజు శ్రేష్ఠిగారు. ట్రస్టీయును సెక్రటరీ శ్రీయుత పోలిశెట్టి గోపాలస్వామిగారు. వీరితోపాటు రు 500-లిచ్చిన శాశ్వత ధర్మకర్తలు 39 మంది గలరు.

(వాసవి)

1931 సం॥రం లెక్కలప్రకారము ఆంధ్రదేశపు స్త్రీలలో నూలు వడకునట్టియు బట్టలు నేయునట్టియు వృత్తులవల్ల జీవించువారి సంఖ్య జిల్లాలవారిగా యీ దిగువ నీయబడినది.

| జిల్లా | నూలువడకుట నేయుట వృత్తివల్ల జీవనం | వారిమీద ఆధారపడిన వారు | మరొకసహాయవృత్తి |
|---|---|---|---|
| గంజాంఏజన్సీ | 506 | 121 | 204 |
| డిటో మామూలు | 3914 | 1336 | 275 |
| విశాఖపట్నం ఏ | 816 | 358 | 139 |
| డిటో మామూలు | 6259 | 3528 | 177 |
| తూ॥గో॥ ఏజన్సీ | 13 | 5 | — |
| డిటో మామూలు | 3540 | 1145 | 95 |
| ప॥గోదావరి | 1399 | 461 | 98 |
| కృష్ణా | 2238 | 499 | 504 |
| గుంటూరు | 3886 | 1469 | 614 |
| నెల్లూరు | 1980 | 2205 | 332 |
| కడప | 1716 | 882 | 61 |
| కర్నూలు | 1829 | 487 | 472 |
| బళ్లారి | 3629 | 481 | 185 |
| అనంతపురం | 2054 | 585 | 154 |
| చిత్తూరు | 2943 | 694 | 101 |
| బంగినపల్లిఎస్టేటు | 148 | 17 | 12 |
| మొత్తము | 40870 | 14262 | 3422 |

నూలువడకు వృత్తి ముఖ్యంగా స్త్రీలలోనే వ్యాపింపవలసియుండెను. ఈవృత్తి బాగా నశించినటుల పైఅంకెలవల్ల తేలుచున్నది.

శనివారపు సుబ్బారావు.

◆ ◆ ◆

## స్త్రీ విద్యాసంస్థలు

### ఆంధ్రయువతీసంస్కృతకళాశాల, రాజమండ్రి

గత నవంబరు మాసమునందీ కళాశాలను దర్శింప గల్గు భాగ్యము లభించినది. ఆంధ్రదేశమునందంతటను విఖ్యాతినొందిన మరియొక సంస్థ యిట్టిదే, శ్రీమదున్నవదంపతులచేఁ బ్రతిష్ఠితమైనది, గుం

టూరులోనున్నదియని వినుచున్నాముకాని దానిం జూచు భాగ్య మింకను లభించనందుకు విచారించుచున్నాము. "రాజులు తలఁచిన గాజుకంబములకుఁ గఱవా?" యనునట్లు రాణ్మహేంద్రపురమునఁగల యీ యాంధ్రయువతీ సంస్కృతకళాశాలను జేపట్టియున్నవారు వైశ్యరాజులు. దీనింబట్టియే యీ విద్యాసంస్థకు మొదట వైశ్యసేవాసదన మను పేరుండెను; కాని యది, యేలూరి విదుషీమణియగు శ్రీమతి చుండూరు రత్నమాంబగారి హితోపదేశానుసారముగా "ఆంధ్రయువతీ సంస్కృతకళాశాల" యని మార్పఁబడెను. అంతటినుండియు నీ కళాశాలయందుఁ గేవల వైశ్యబాలికలేకాక తదితర వర్ణముల వారును జేరి విద్యాలాభము నొందుచున్నారు. "పాకేవ్యవహారే లజ్జానకారే" యను సూక్తిను సరించి మోమోటములేక ఉన్నదియున్నట్లు చెప్పి కార్యముఁ జొప్పుపడఁజేసిన యీ సోదరీరత్నమునకు మా ధన్యవాదములు. అదియటులుండ నింక నీ సంస్థను గన్నతల్లి విద్యావతియగు శ్రీ బత్తుల కామాక్షమ్మగారు. ఈయమను జూడఁగనే మద్రాసులోనున్న లోకవిఖ్యాత, సిస్టర్ సుబ్బలక్ష్మి అమ్మాళ్, బి.యే.,యల్.టి.గారు, వెంటనే నా మనమునఁ బొడరిరి. "తమ కార్యంబుఁ బరిత్యజించియుఁ బరార్థప్రాపకు"రాండ్రగు నిట్టి సోదరీమణుల ఋణమెట్లు తీర్చుకొనఁగలమా యనిపించును. పెండియు నీ విద్యాలయమునకు ఇతర వైశ్యసోదరులిచ్చినది యటుండగా,—తా మొక్కరే రమారమి రూ. 200000 లనిచ్చి దీని కా చంద్రతారార్కముస్థిరతఁ గూర్చిన శ్రీ మన్నాశం రామలింగయ్య శ్రేష్ఠిగారి సేమని కొనియాడుట!!

ఇట్టి మాతాపితరులుగల యీ విద్యాలయము పావనగౌతమీతీరవిరాజితము, నాంధ్ర యూనివర్సిటీవారు స్వీకరించుటయు నొక విశేషము.

కళాశాలయందుఁగల వసతులు మిక్కిలి యనుకూలములై యున్నవి. స్థితిగతులననుసరించి విద్యార్థిని యుచితముగనో లేక యేదో కొంత నియమితధనము నిచ్చియో యిందు హాయిగాఁ జదువుకొనవచ్చును. మన సోదరీరత్నమగు కామాక్షమ్మగారికిని మఱి కొందఱుపాధ్యాయినులకును శాకశాలయే యిల్లును, విద్యార్థినులే బిడ్డలునై యుండుట మహానందకరమగు విషయము. వర్ణభేదము పాటింపఁబడుచున్నను, అది యంత యవమానకరముగను, బాధాకరముగను లేనేలేదనుట వాస్తవము. ఇది యొకమాదిరి సమష్టి కుటుంబమువలె నెంతో యింపుగాఁ దోచును. చదువువేళలయందు జదువుటయుఁ దదితర సమయములయందు మరేదైన నొకపనికివచ్చెడి పని సేయుటయే యీ సంస్థయందలి సాధారణవిధులు. విధివశమున దుఃఖితలై యున్నవారేయైనను, ఈ సంస్థయందుఁజేరి సర్వదుఃఖములను మరచి, సర్వదా సంతోషచిత్తలై సరస్వతీపాద సామీప్యమును పొందుచున్నారు. చెప్పఁదగిన పుస్తకభాండాగారము, వీణ మొదలగు సంగీతాయుధములును, దదితరములైన వేరు వేరు పనిముట్లును కొదవలేక యొప్పుచున్నవి.

సాహిత్యము, సంగీతము, కుట్టుపని, జర్తార్ పంకీ బుటేదారీ పని మొదలగు విషయము లిందు జక్కఁగా నేర్పఁబడుచున్నవి. హిందీభాషాధ్యయనమున కీ సంస్థయం దెక్కువ యాప్యాయత జూపట్టుచున్నది. ఏతావతా బ్ర॥ శ్రీ॥ గొర్తి సూర్యనారాయణశాస్త్రిగారివంటి వయోవిజ్ఞానవృద్ధులగు "ప్రాతకాలపుఁ బండితు" లింక మరియిద్దరు ముగ్గురుండినయెడల నింకను బాగుండునేమోయని నా యాలోచన. 'ఏమైనఁగానీ' యని బరువుమోయఁ బూనుకొన్న వదాన్యచక్రవర్తులు, తెన్నగ నాలోచింపఁదగిన విషయమేకాని యిది యేదో "కాన్ ఖుషీ దిల్ ఖుషీ" ప్రసంగమని యెంచఁబడకుండుఁ గాక! మదరాసు సేవాసదనము, శారదాహోము మొదలగువాటితో నిది తులఁదూగి యాంధ్రదేశ యువతులకు నిశ్చయముగా నుపయోగకారియై యుండవలయునన్న యెడ వయస్సుచేతను జ్ఞానాను

ధనములచేతను బండినవారే యిట్టియెడ నాచార్య పీఠములం దుండవలెనని మరియొకతూరి మనవి చేయుట పిష్టపేషణముకాదు. అది యటులుండ నిండు. సంస్థయందు నా జూచినంతవరకుఁ బ్రతి తరగతియందును బిడ్డలు పరమోత్సాహముతోఁ జదువుకొనుచున్నారు. ఉపదేష్టలును, ఫష్టులేది కొరకై యెదురు చూచువారు గాక, బద్ధాంజలులై పని సేయుచున్నారు.

శ్రీ కామాక్షమ్మగారికిఁ గుడియెడమ భుజముల వలెనున్న కార్యదర్శులు యథార్థముగఁ భాగ్యదర్శులే. ఇట్టి దేశహితైషులగువారు పట్టిన పట్టువల్లనే యీ సంస్థ యారంభించి పది పండ్రెండేండ్లు గాక మునుపే నిట్టి మంచిస్థితికి వచ్చినదనుట యథార్థము. దైవానుగ్రహమువలన నిది యీతీరుననే వర్ధిల్లుచుండుఁ గాక!!

## శ్రీమదన్నపూర్ణా జాతీయ బాలికాపాఠశాల

### ఏలూరు.

శ్రీయుత మాగంటి బాపినీడుగారి ప్రథమ కళత్రమగు నన్నపూర్ణాదేవిగారి స్మారకముగా నీ పాఠశాల నెలకొల్పఁబడినది. దీనిని నిర్వహించుచున్న యిల్లాలు శ్రీమతి కలగర పిచ్చమ్మగారు. ఈయమ యొక్కతయేకాక యీమె భర్తయగు శ్రీయుత రామస్వామి చౌదరిగారును మరికొంతమంది స్త్రీపురుషులును, అభిమానవేతనులై యీ పాఠశాల కొఱకుఁ దమ రక్తము నీరుసేసికొనుచున్నారు; ఈ పేదముత్తైదువను దర్శించి "ధన్యోస్మి" యనుకొంటిని. ఈ యిల్లాలు తనువొందిన భారత జాతీయతాభావమనుట యతిశయోక్తి కాదు. ఈ పవిత్రహృదయ, పెద్దపెద్ద చదువులేవియుఁ జదువలేదు. అట్టులే పెద్ద పెద్ద మాటలుగూడ నాడనేరదు. కార్యదీక్షయందు మాత్రము "భల్లూకపుఁబట్టు" గలది.

గ్రామగ్రామమునకును బల్లెపల్లెకును బగలనక రాత్రియనక నిద్రలేక యాహారముగొనక సంచారములు సేసి ద్రవ్యమును సముపార్జించి యీ చిన్నిపాఠశాలను నడపుచున్నది. కాయకష్టమువల్లనే జీవయాత్ర సేయువారి బాలికలెందరో యీ విద్యాసంస్థయందు జదివికొనుచున్నారు. ఇల్లు కట్టుటకుఁ గావలసినంత స్థలమున్నదికాని ద్రవ్యములేదు. "నెలకొక నాలుగణాల చొప్పుననైనా ఇప్పించండయ్యా" యంటే "బైస్కోపుకి భంగం కలిగించుకోమంటారా?" యనుచున్నది సామాన్యలోకము. ఇంక శ్రీమంతులో పేరు ప్రతిష్ఠలకై పెద్ద పెద్ద ఖర్చులు బెట్టువారేకాని యీ పేద "పార్వతి" మాటలఁ జెవిఁబెట్టరు. తథాపి పాఠశాలమాత్రము నడచుచునే యున్నదికాని స్వస్తి చెప్పఁబడుటలేదు. శ్రీమతి పిచ్చమ్మగారి యాత్మబల మెట్టిదో దీనివలన దెలియనగును గదా!

చదువును, సంగీతమును, గోలాటమును, చేతిపనులలో ముఖ్యముగా నూలుతీయుటకును సామాన్యముగ చిత్రలేఖనము మొదలగునవియు నిందలి బిడ్డలకు నేర్పఁబడు విషయములు. అన్నిజాతుల బాలికలును సమానాదరములు గలిగియున్నారుగాని భేద మేమాత్రమును లేదు.

ఏలూరునగరవాస్తవ్యులగు పిన్నపెద్ద లీ సంస్థయం దభిమానమువహించి శ్రీమత్కలగర దంపతుల యాశయములు ఫలింపఁజేయుదురుగాక!

◆ ◆ ◆ [పు॥ కృ॥ మూర్తి.]

## వంటింటి పారిశుభ్రత

ఆడవాళ్లకు చదువులెక్కువయ్యె, ఉద్యోగములు మరిగి, క్లబ్బులలో ఆటపాటలు ప్రారంభిస్తే యింట్లో వంటా పెంటా మూలఁబడి హోటలు పెద్దమ్మల ప్రసాదమే సంసారాలకు ప్రాప్తిస్తుందని ఒక క్రొత్తఘోష కొన్ని మూలలలో నిప్పుడిప్పుడు వినిపిస్తున్నది. కాని ఒక సంగతి నిజము. ప్రస్తుతము మనదేశములో నున్నమాదిరి వంటయిండ్లలోను, ప్రొయ్యిలమీదను విద్యావిహీనలై మరో వ్యాపారం లేని మొద్దుముగ్ధలనుతప్ప నాజూకైన పడతులను వండుమంటే వారికి యెంత అసహ్యముగా ఉం

టుందో ఎవరూ ఆలోచించరు. నెలకు మూడు రోజులైనా అట్టి ముగ్ధల భర్తలు వంటఛార్జీలు పుచ్చుకున్నారంటే ఆకష్టము తెలిసివస్తుంది. పిడకల పొగంతా కంట్లోకి, కళ్లలమంటంతా ముఖముమీదికి వ్యాపించి ఊపిరిఆడక మలమల మాడిపోయి ఇంత ప్రసాద ముడకపెట్టి విస్తరంటలో వడ్డిస్తే అన్న మడుగంటిందనీ, పులుసు ఒకమలుగు తక్కువయిందనీ, కూరపోపుమాడిందనీ ఉన్వత్తులేచి కేకలువేయడం మగవారికి తెలుసును. స్త్రీజన్మ అంటే ఈ అనర్థాలన్నీ అనుభవించడానికే అని ఈ మహాశయుల ఉద్దేశ్యము కాబోలు.

చదువుకున్నంతమాత్రాన, ఉద్యోగముచేస్తున్నంత మాత్రాన, వడతులకు సంసారాలమీద అభిమానములు చచ్చి, వంటా పెంటా వూనుతలపెట్టక కుటుంబాలను పూటకూళ్లపాలు చేస్తారనుకోకూడదు. ఆడవాళ్లకైనా మగవాళ్లకైనా వంటింటిలోకి వెళితే వండుదామా అన్నట్లు శుద్ధముగా, వెలుగుగా, చల్లగా వుంటే ఎట్టి విద్యావతియైనాసరే వండడ మొక చిత్రకళగా భావించి పూటకూటింటి తిండి తెప్పించుతానన్నా వద్దని పట్టుపట్టదా? పాశ్చాత్యదేశాలలో శ్రీమంతుల వంటిల్లుచూస్తే ముచ్చటవేస్తుంది. అక్కడ విద్యుచ్ఛక్తిమీదే వంట! మన దేశములో నింతవేగ మదిసాధ్యముకాకున్నా అక్కడ సామాన్యకుటుంబముల వంటిళ్లలాగైనా మన వంటిళ్లుంచుకోరాదూ? వారి వంటింటికి తక్కిన గదులకువలె మంచి కిటికీలు; గోడల కెక్కడా మసి అన్నమాటయుండదు; తలుపులు, అల్మైరాలు అద్దాలలాగుంటాయి. అసలు ప్రొయ్యియొక్క నిర్మాణమే చిత్రముగా వుంటుంది. మంటపైకి కనపడకుండా పొయ్యికి తలుపులు వుండడంచేత పొగయైనా పయికితగలదు. పొగ తిన్నగా చిమ్నీలోంచి యింటికప్పుమీదనుంచిదూకి అంతరిక్షమార్గానపోవలసిందేకాని వంటింటిలో యెక్కడా కనపడదు. పాకములు తయారైనవో లేవో చూచుకోవడంతప్ప మధ్యతరగతి యిల్లాలికి మన ఆడవాళ్లు పడేపాట్లేమీ వుండవు. దీనికి ఖర్చేమీ యెక్కువ గాదు. బుద్ధిసూక్ష్మత, శ్రద్ధపెట్టి అట్టిది స్వయంగానే కట్టుకోవచ్చును. అయితే మన హిందూసంఘం ఒకవిషయంలో ఏమిటి, ప్రతివిషయంలోను తాతలూ అవ్వలూ పెట్టిన వరవడిమీద కళ్లుమూసుకొని గ్రుడ్డిగాపోతూవుండడమేకాని స్వబుద్ధి నట్టే కష్టపెట్టుకోదు. కాని యే పుణ్యాత్ముడైనామాదిరికొక్క వంటిల్లు అట్టిది కట్టించాడంటే అది చూచి తక్కిన కుటుంబాల ఆడవాళ్లుకూడా అట్లాంటివి కట్టించేదాకా పురుషులను ప్రతిమలాడి, చిరకాలము నుండివచ్చుచున్న తమ కష్టములను తరించి, పరిశుద్ధముగా ఇట్టే వంటచేసిపెట్టి, తక్కిన కాలము నెల్లా చదువులోనో, ఉద్యోగములోనో, క్లబ్బులోనో, ప్రజాసేవలోనో వెళ్లబుచ్చుకుంటే యేమి అపరాధం వచ్చిపడుతుంది! వంటిల్లు చూసుకుంటావా ఊరి పనులు చక్కపెడతావా అంటే రెండూ చేయగలమని మన ఆడవాళ్లు ధీమాగా జబాబుచెప్పరూ?

♦ ♦ ♦

## స్త్రీసమాజము రాజమండ్రి

శ్రీమతి పెద్దాడ సుబ్బమ్మగారు, చల్లపల్లి సీతమ్మగారు మొదలగు పెద్దలు చేరి పనిచేయుచున్న యీ సమాజము కూడ నొకవిద్యాలయమే యనవచ్చును. ఇంటియొద్ద పనిపాట్లు ముగించుకొని భర్తలు కార్యాలయముల కేగినవెనుకఁ గొందరు యువతులిందు విద్యాభ్యాసము చేయుచున్నారు. ఒకరిద్దరాచార్యుల వారీసమాజమున నుపాధ్యాయులైయున్నారు. ఈ సంస్థయొక్క యార్థికవిషయములఁగూర్చి గతమాసమున నిందుఁ దెలుపఁబడి యున్నది. దేశాభ్యున్నతికి జీవగఱ్ఱలనఁదగునట్టి సంస్థలను బోషించుట దేశీయులకుఁ బరమార్థమని పలుమారు చెప్పవలసిన యగత్యము లేదుగదా! మరియు నూరికి దూరముగనున్న యిన్నిసుపేటకీసంస్థ యుండుట యత్యవసరముగాఁ దోచుచున్నది.

ఇట్లు
పు॥కృ॥మూర్తి.

# గ్రంథవిమర్శనము

## కొండవీఁటి విజయము

చెన్నపురి విశ్వవిద్యాలయమువారు నిర్ణయించిన విద్వత్పరీక్షా పఠనీయ గ్రంథములలోఁ గొండవీఁటి విజయ మొకటి. ఇది క్రౌనుసైజున నలువది పుటల పరిమితిగల ఖండకావ్యము. సుప్రసిద్ధులు కావ్యతీర్థ బంకుపల్లి మల్లయ్యశాస్త్రిగారు దీనిని రచించియున్నారు. రసప్రధానములగు ఖండకావ్యములు తెలుఁగున అరుదనియు, అందుచితమగు చారిత్రక కథాపేశనము కలవి చాల తక్కువనియు నెంచి శాస్త్రిగారీ గ్రంథమును రచింపఁబూనిరని తెలియుచున్నది. "ఇట్టివి గ్రంథములుగూడ నాంధ్ర భాషాసతూటికి అలంకారములు కాఁగలవని నా నమ్మకము" అను శాస్త్రిగారి "రెండు మాటలే" ఇందులకు నిదర్శనము.

దీనికి పరిచయమును వ్రాసిన శ్రీ గిడుగు వెంకట సీతాపతి పంతులుగారు గ్రంథప్రాశస్త్యమును బాగుగ వెల్లడించిరి. ఇందలి భాష, కథ, కావ్యమునకు మిక్కిలి యనుకూలములనియు, దీనిలో ప్రాచీన ప్రబంధముల పోకడలు, నవీనకవిత్వపు పోకడలు, రెండును రమ్యముగా నమరియున్నవనియు సకల శాస్త్రవిశారదులగు శాస్త్రిగారు తమ శాస్త్రపరిజ్ఞానమును రసపోషణమున కనుకూలముగఁ బెక్కుచోట్ల సూచించిరనియు, కర్ణములకుఁ గటువుగాని "ఇవ్వవు" మొదలగు వ్యావహారిక పదములను బ్రయోగించుటచే శాస్త్రిగారు వ్యాకరణమునకుఁ బూర్తిగ లొంగిపోలేదనియు ఈ చిన్నకావ్య మున్నతశ్రేణిలో నుంచు విద్యార్థులకుఁ బాఠ్యగ్రంథముగా నియమింప తగినదనియుఁ దగు ప్రోత్సాహమున్నచో శాస్త్రిగారిట్టి గ్రంథముల నింకను బెక్కింటిని రచించి భాషా సేవ చేయఁగలవారనియు పంతులుగా రొనరించిన పరిచయము.

విచారించి చూచినచో పరిచయమునందు సూచింపఁబడినంత నవ్యత, ఉత్తమశ్రేణికిఁ బాఠ్యమగు నర్హత యుండెక్కువగఁ గనుపించకున్నవి. ఇట్లు చెప్పుట సాహసమని కొందఱు తలంపవచ్చును. కాని శ్రీ శాస్త్రులుగారు పాండిత్యమునందును, దేశీయరీతులతో పురాణము చెప్పుటయందును ప్రసిద్ధులైనట్లు కవిత్వమునఁ బ్రసిద్ధులైయుండలేదు. కావున శ్రీ శాస్త్రిగారి గౌరవమున కీ చిన్నవిమర్శనమువలన నెట్టి కళంకమును కలుగఁజాలదని మా యూహ. ఇందలి తత్త్వమును వివరించుటకే మా ప్రయత్నము. ఈ గ్రంథమునకు "కొండవీఁటి విజయము" అని శ్రీ శాస్త్రిగారు పెట్టిన పేరు, "కొండవీఁటి ముట్టడి" అని మార్చిన బాగుండు నేమో! ఏమందురో! ఇందుఁ గొండవీఁటి రాజుతోఁ గృష్ణరాయలు యుద్ధము జరిగించినట్లు వర్ణింపఁబడియుండ లేదు. యుద్ధము జరిగినపుడే విజయమనుట అన్వర్థమగునని మే మనుకొనుచున్నాము.

ఇందు కథాభాగము రమణీయముగనున్నదని చెప్ప వీలుపడకున్నది. కృష్ణరాయలు, మంత్రి తిమ్మరుసుతో నాలోచించి, కొండవీఁటిని జయింప నేఁగుటయు, కొంత సైన్యముచే దుర్గమును ముట్టడించి దుర్గాధ్యక్షునికి సాయము చేయవచ్చు ప్రతాపరుద్ర గజపతిని కొంత సైన్యముతో నోడించుటయు, కొన్ని నెలలట్లుండినపిదప దుర్గాధిపతి రాయలను శరణు జొచ్చుటయు నిందలి కథాభాగము. సాయంకాలమగుట, శిబిరములకేగుట, సూర్యోదయమగుట యిట్టి విషయములు, తద్వర్ణనము లెంచెక్కువగఁగలవు.

ఇందు వీరము ప్రధానరసము. కాని నడుమ నడుమ అప్రస్తుతముగ యుద్ధాలోచనయందున్న రాయలవిషయమున శృంగారము వర్ణింపఁబడి యున్నది. ఇది ప్రస్తుత రసవిరుద్ధము. ఇట్టి వర్ణన

ములు ప్రాచీన ప్రబంధములలోనున్నను ప్రకృత రస విరుద్ధముగ లేవు; ఒకవేళ యున్నవనుకొందము. అట్లయినను ప్రాచీన ప్రబంధముల రీతిగాక యిందు నవ్యత నిముడ్చవలసియున్నది. కావున మీఁది విషయ మనుచితము.

ఇందచ్చటచ్చట శాస్త్రీయవిషయము లిమిడి యున్నను, అవి సామాన్యుల కర్థమగు స్థితిలో లేవు. కొన్ని యర్థమగుచున్నను, కవిత్వ నవ్యతకు కంటకములు. భావము, రసము ప్రధానముగాగల కావ్యములలో నిట్టి కఠినవిషయము లుండుటచేతనే యిప్పటివారికిఁ బ్రాచీన ప్రబంధములనినఁ దలనొప్పి కదా!

ఇకఁ గవిత్వమును విమర్శింతము.

"శ్రీవరునిన్ సదాశివువిరించులఁ దానుసృజించి వారికిన్
త్రోవగసంహరింప జగముల్ సృజియింపగ శక్తులిచ్చి కా
శీ వరలక్ష్మి శారదలలీలధరించి........"

ఇందు బ్రహ్మ విష్ణు మహేశ్వరుల క్రమము వ్యత్యస్తమైనది. సృష్టి మొదటిది. రక్షించుట రెండవది. సంహరించుట చివరిదికదా. పోనీ, యా క్రమమైన చివరివఱకు నడుపలేదు. లక్ష్మి, కాళి, శారద లని క్రమముగఁ జెప్పవలసియున్నది కదా? ఇచట క్రమ భంగమను దోషము దుర్నివారము.

పద్యము 6.

"కవులెవమంద్రు జాతికొక కావ్యమునొక్కెడనల్ల"

ఇందు మన మెఱింగిన అష్టదిగ్గజములు కృష్ణరాయని యాస్థానముననుండిరా, లేదా? అను వాదవివాదము లింక నుండ నేయున్నవి. "ఉండెడివారు" అను పక్షమువారుకూడ రామరాజభూషణుఁడు, రామకృష్ణుఁడు కృష్ణదేవరాయల కాలమున గ్రంథములను రచింపలేదని వాదింతురు. కావున శ్రీ శాస్త్రిగారిమాట యెంతవఱకు నిజమో విచారింప వలసియున్నది. మఱియు 5-వ పద్యమునఁగల "కృష్ణరాయ లప్పాజీని యవమానపఱచుట" యొక్క కాలవిషయమై సందేహమే కలదు.

ఇందలి పదునెనిమిదవ పద్యము "పెట్టనికోటలై గిరులుపేర్చినఖాట్లు మహోన్నంబుగా" అని ప్రారంభింపఁబడినది. పెట్టనిగోడలైయని చెప్పుట సరియగును. కోటలే కవ్యభిప్రేతమైనచో "కట్టనికోట" యని యుండవలసియున్నది. 22 పద్యము మూఁడవపాదమున "ఖానుఁ డుద్దండుడై తన్నుఁ గొలుచుచుండ" అని యున్నది. యతిపోయినది.

30 పద్యము.

"నావినిపల్కె రాయలు భువంబగు సంగరకౌతు కంబునన్
నీవసహాయశూరుఁడవు నిక్కము నాకర కౌశలంబు యు
ద్ధావనిసెన్నఁడే నెచటనైనను జూపకయున్న, నన్ను నే
నీ వహివాఁడనో జగమదెట్లు తెలుంగును రాజులందునన్"

ఇందుఁ గృష్ణరాయఁ డిట్లు చెప్పు టెంతవఱకుచితము? కొండవీఁటి యుద్ధమునకుఁ బూర్వము యుద్ధము లేమియు జరిగియుండలేదా? వానియందు శ్రీ కృష్ణదేవరాయల ప్రతాపము ప్రకటితము కాలేదా?

98 పద్యము.

"దురమునగెల్పొయుంకువని, తోయనిధుల్వరులంచు, తెంప్లికూ
తురు నదికృష్ణయందు; వినితూర్ణమతామువరింప దక్షిణో
త్తరజలరాసు లేఁగెడువిధంబు గనంబడె రెండు సేనలు
ద్ధురతను రెండుదిక్కుల నెదుర్కొనఁబోయెడు జాడఁజూడఁగా.

ఇచటఁ దోయనిధులు వరుఁడనుట యనుచితము, తోయనిధివరుఁ డనవలెను. మఱియు నిచటి బహువచనమువలన సముద్రము లన్నింటికిని వరత్వము కలుఁగుచుండుటచే దక్షిణోత్తరతోయనిధులుకూడ వానియందుఁ జేరియున్నవి కదా? అప్పుడు వానికి యుద్ధమునకు వెడలు అవకాశ మెట్లు కలుగును?

ఇందు 148 మొదలు 152 పఙ్క్తును వేదాంతోప న్యాసము చేయఁబడినది. అది శాంతరసానుగుణము గాని ప్రకృతరసానుగుణము గాదు. గ్రంథ పరిసమాప్తి చేయుటకుఁ బూర్వము దీనిని బంధించుట బాగులేదని తోఁచుచున్నది.

మఱియు (పద్యము 28) "చని" అనునది "వచ్చి" అను నర్థమునను (ప. 134) "ద్రవ్యము" అనునది "పదార్థము అనగా వస్తువు" అను నర్థములోను వాడఁబడినది.

కొండవీడునన్ (కొండవీటన్ అనుటకు)

నేత్రురున్ (నేత్రురు అనుటకు) నవలలతోడ (స్త్రీలనుటకు) నవలాశబ్దము అకారాంతముగనుండ వలసియున్నది.

ఈ మొదలగు అప్రయోగములు కలవు. శైలి యందు కఠినపదములు లేకున్నను క్లిష్టాన్వయ మెక్కువగఁగలదు.

ఉత్తమతరగతులకు నిర్ణయింపఁబడు పఠనీయ గ్రంథములలో నిట్టిది నియమింపఁబడుట సరికాదేమో యని తోఁచుచున్నది.

చక్కా పద్మావతి, సంకా బాపాయమ్మ.

బాలక్రిష్ణశతకము:—

క్రౌనుసైజున 36 పుటలు. గ్రంథకర్త శ్రీయుత భమిటిపాటి పట్టాభిరామయ్యగారు యమ్. ఎ. ఎల్. టి. విద్యావిభూషణ, సాహిత్య సరస్వతీగారు, రాజమహేంద్రవరం గవర్నమెంటు ట్రెయినింగు కళాశాలలో ఉపాధ్యాయులు. శ్రీకృష్ణచర్యలెల్లయు సంగ్రహముగ 100 గీతపద్యములలో నిమిడ్చబడినవి. భక్తులకు పారాయణచేసుకొనుటకు బాగుండును.

సిద్ధివినాయకచరిత్ర:—

క్రౌనుసైజున 46 పుటలు. ఇదియు పైగ్రంథకర్త గారివల్లనే రచింపబడిన చిన్న హరికథ. సిద్ధివినాయకుని జననము, ప్రజ్ఞలు, చంద్రశాపము, సత్రాజితీ జాంబవతీ పరిణయములు సంగ్రహముగ గలవు. వినాయకచవితినాడు కాలక్షేపమునకు బాగుండును.

సంస్కారి:—

నెలకు రెండుసార్లు, 5, 20, తేదీలను ప్రకటింపబడు 8 పుటల పత్రిక. క్రిష్ణాజిల్లా ఎలమర్రు గ్రామమునుండి టి. శ్రీరాములుగారు ప్రకటించుచుందురు. సాంఘిక ఆర్థికవిషయములను చర్చించుచుండును. ఏజంట్లుగా సుందరగోరువారు ప్రతికాధిపతితో సంప్రతించవలెను.

వేదకాలపుస్త్రీలు:—

క్రౌనుసైజున 188 పుటలు. వెల రు. 0-10-0 గ్రంథకర్త కొవ్వూరునందలి ఆంధ్రగీర్వాణ పీఠాధ్యక్షుడు జటావల్లభుల పురుషోత్తముగారు బి. ఎ. వేదకాలమునాటి స్త్రీపురుషుల గౌరవస్థానములు ఆచారవ్యవహారములు తెలియక పనాతనులును సంస్కారులను గూడ మిగుల విపరీతవాదములు చేయుచుందురు. నిత్యము గృహకృత్యములయందును గార్హస్థధర్మమునందును నిమగ్నయై యుక్తమగు సమయములయందు స్త్రీసభలయందును పురుషులసభలయందును గూడ రాణించుచు, వైదిక స్త్రీ సుగుణముల యందును ప్రతిభయందును నెట్లను పమానయై రాణిల్లెనో గ్రంథకర్తగారు బహుగ్రంథపరిశోధనముచేసి సోదాహరణముగ తేటతెలుగు గద్యములో నాంధ్రులకు తెలియఁజేసినారు.

చిత్రగుప్త (హరిజనసంచిక):—

మహాత్ముడు ఆంధ్రదేశమునకును మదరాసు నగరమునకును వచ్చుటముందు ఆంధ్రులహస్తపద్మముల కర్పించుట కతిప్రయత్నమున సంపాదకు శ్రీ ప్రత్యేక సంచికను ప్రకటించినారు. పత్రికయందలి వ్యాసములు పద్యములు, గేయములు, చిత్రములు మొదలగు నవియెల్లయు మహాత్ముని మహిమలను హరిజనుల నుద్ధరించు ఉపాయములను సూచించుచుండుటచే సంచికయెల్లయు మిగుల రసవంతముగ నున్నది. సంచికను పఠించినవారికి హరిజనుల కష్టములయెడ సానుభూతి ఉదయింపకమానదు. విడిప్రతి రు0-1-6 లుమాత్రమే.

# హరిజనాభ్యుదయము

డిసెంబరు 10వ తేదికి మహాత్ముడు ఢిల్లీ చేరెను. హరిజనులు వసించు ప్రదేశములను దర్శించెను. బిర్లామిల్లు పనివారు రు 2000 లు సమర్పించిరి. మద్యపానమును చుట్టలను మానిఆవిధముగావచ్చు ధనము నిమ్మని మహాత్ముడువారినికోరెను. సాయంకాలముజమాఆమిలియా విద్యార్థులు రు 101 లును, వారు పెంచిన కూరలను, ఖద్దరును హరిజనులకుపంచిపెట్టిరి. క్వీన్సుగార్డెన్సులో జరిగిన సభకు లక్షలకొలది జనులు వచ్చిరి. జపాను ప్రతినిధులు, అసెంబ్లీ సభ్యులు, ఢిల్లీ నాయకులు విచ్చేసిరి. లక్ష్మీనారాయణ గడోడియాగారు రు 5100 లును, జపాను ప్రతినిధులు రు 101 లును, యిచ్చిరి. ఢిల్లీలో మొత్తమువసూలు రు 10000 లు అని గడోడియాగారు చెప్పుచున్నారు. ప్రాత ఢిల్లీలో హరిజనులు వసింతురు. క్రొత్తఢిల్లీలో ప్రభుత్వోద్యోగస్థులు మొదలగు శ్రీమంతులువసింతురు. ప్రాతఢిల్లీకి క్రొత్తఢిల్లీకిని గలంత భేద మింకేనగరమునను లేదని మహాత్ముడు నుడివెను. మధ్యపరగణాలలో రు 75000 లును, ఢిల్లీలో రు 20000 లును హరిజననిధి వసూలయినట్లు తెలియుచున్నది.

16 వ తేది ఉదయమునకు ఆంధ్రదేశమునందలి బెజవాడ పట్టణము గాంధిమహాత్ముడు విచ్చేసెను. దుర్గావిలాసమున విడిదిచేసెను. శివాలయమునకును, ఈడుపుగల్లు, మొంగల్ రాజపురం పడమటిలంక మొదలగు గ్రామములకును వెళ్లిరి. బెజవాడలో కొందఱు గృహస్థులును కొన్ని సంస్థలును కలిసి రు 2000 లును తక్కిన గ్రామములవారు రు 800 ను కానుకలిచ్చిరి. గ్రామములలో వేనవేలుజనులు మహాత్ముని దర్శనమునకు వచ్చుటచే మహాత్మునకు మోటారుకారు దిగుటకే వీలులేక బండిలోనుండియే యుపన్యసించిరి. వివిధసంఘముల వారిచ్చిన కట్నముల కలిసినచో 16 వ తేదిని బెజవాడ ప్రాంతముల వసూళ్లు రు 4200 నగదు, రు 1000 లు ఖరీదుగల నగలు అని తెలియుచున్నది. 17 వ తేదిని ముదునూరు గ్రామములో 2 దేవాలయములను తెరచెను. 500రూపాయీలు వసూలయ్యెను. అనేక గ్రామములవారు మహాత్ముని రాకకై రోడ్డుమీద వేచియుండి కారులో మహాత్ముడు నిద్రించుచుండుటచే రొట్టి భంగమును కలుగకేయక చల్లగా కట్నములనిచ్చి కారును పోనిచ్చిరి. 17 వ తేది సాయంకాలము 5 గంటలకు మచిలీపట్టణము వెళ్ళిరి. 6 గంటలకు జరిగిన బహిరంగ సభలో రు 800 లను సమ్మానసంఘమువారొసంగిరి. పమిడిపాడు అంగలూరు చల్లపల్లి గ్రామములకుకూడ వెళ్లెను. 18 వ తేది ఆఖరుకు వసూళ్లు రు 10700 లు నగదు, సుమారు రు 1000 లు నగలు. 5 దేవాలయములు హరిజనులకు తెరవబడెను. మహాత్మ డెక్కడ దొరకిన ఫలముల నక్కడి హరిజన బాలుర కిచ్చుచున్నాడు. నూలును చర్కాసంఘములకిచ్చి బట్టలు చేసి హరిజనుల కిచ్చివేయుమని చెప్పుచున్నాడు. సిద్ధాంతములో అడుసుమిల్లి గోపాలకృష్ణయ్యగారి ధర్మకర్తృత్వమునున్న శ్రీ సంతాన గోపాలస్వామి వారియొక్కయు, శ్రీదుర్గా నాగేశ్వరస్వామివారి యొక్కయు దేవాలయములను మహాత్ముడు హరిజనులకై తెరచెను.

20 వ తేదికి మదరాసునవచ్చి కార్పొరేషను అడ్రెసు పుచ్చుకొని, ప్రదర్శనము తెరచి, మాతాసంఘమువారి కానుకలంది సాయంకాలము తిలకుఘాటువద్ద ఉపన్యసించెను. 21 వ తేదిని అఖిలభారత స్త్రీసంఘము, పెరంబూరు కార్మికసంఘము, విద్యార్థిసంఘముల కానుకలనంది అనేక కుప్పములను దర్శించెను. 22వ తేదిని ఆంధ్రమహాసభలో శ్రీయుత దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వర రావుపంతులుగారి ఛాయాచిత్రమును బహిరంగపరచిరి.



# సంపాదకీయములు

**మహాత్ముని సనాతనవాణి:—**

మహాత్ముడు ప్రాచీన ఋషిగణంబులో చేరవలసిన మాన్యుడు. మహర్షుల మతములలోకూడ భేదములేకపోలేదు కాని అంతమాత్రమున నెవ్వరి మతమునకుగాని సనాతనత్వలోపము రాదు. అందుచేత మహాత్ముడు తాను సనాతనుడని చెప్పుకొన్నచో ప్రస్తుత సనాతనులకు కొందరకు కటువుగ వినబడుచున్నను అతని తలంపులో నపసవ్య మెట్టిదియు లేదు. వర్ణాశ్రమములు హిందూమతముయొక్క ప్రాణములని సనాతనులందఱితోబాటు అతనును అంగీకరించుచున్నాడు. వర్ణము వృత్తిని నిర్ణయించుచున్నది. కనుక ప్రస్తుతము ప్రపంచమునెల్ల పీడించుచున్న నిరుద్యోగసమస్యకు వర్ణమొక భీమావంటిది. ఒకవర్ణమువా రితర వర్ణములోనికి పోకూడదను నియమము పెట్టుకున్నందువలన ఏవృత్తిగాని నశించక, అత్యధిక సంఖ్యాకులచే నిబిడీకృతమై నష్టకరము గాక, సకల వృత్తులును, వర్ణములును వర్ధిల్లుచు ఐహికజీవనముకొఱ కెక్కువచింతనము పెట్టుకొనకుండ పరచింతనమున తరించుటకు మంచి సౌకర్య మేర్పడుచున్నదని యతడు వివరించియున్నాడు. ఆశ్రమధర్మములు ప్రతివర్ణములోని వ్యక్తులును అనుసరింపతగినవే. బ్రహ్మచర్యమున జీవనమునకు సిద్ధమగుట, గార్హస్థ్యమున ఉత్తమజీవనమును నెఱపుట, వానప్రస్థమున జీవనసంరంభమునుండి తొలగుట నభ్యసించుట, సన్యాసమున జీవన్ముక్తిబడయుట ఆశ్రమ ధర్మముయొక్క రహస్యము.

ఈ వర్ణాశ్రమము మానవజీవనమునకు సహజమైన ధర్మమైనను, హిందూమతము వలె దీనియొక్క ప్రాశస్త్యమును నొక్కి చెప్పి, పురాణాదులమూలమున ప్రజలకు గఱపి, ఆచారవ్యవహారములవలన వారి కభ్యాసముచేసి దీనికి మఱియే యితర జాతియు ఘంటాపథము నేర్పరచలేదు. జనుల యజ్ఞానమువలన నేమి స్వభావదౌర్బల్యమువల్లనేమి యీ ఆచారము లిప్పుడు కొంచెము తారుమారై విసుగును విరోధమును కలిగించుచున్నను దానిలోనికి దూరిన లోపములను తొలగించి నిలబెట్టుటలోనే హిందూమతముయొక్క నిలకడయున్నది కాని లేనిచో అది అన్యజాతీయతలలోను ఆచారములలోను సంకరమై రూపుమాయునని విశ్వసించువారిలో మహాత్ముడొక్కడు.

అయితే ప్రస్తుతపు టాచారములు హరిజనులకు వర్ణమువియ్యకుండ నిరాకరించు

చున్నవి. తక్కిన అన్ని సంఘములును నేదో వర్ణమునకో ఉపవర్ణమునకో చెందుచున్నవి కాని పాపము వారికి వర్ణములేదట. ఇది అన్యాయము. గౌరవనీయమగు వృత్తి నవలంబించి శాంతముగ ప్రవర్తించు సంఘమునకు వర్ణము లేకుండుటెట్లు? ఎప్పుడో ఏకారణముననో తక్కిన సంఘములన్నియు వారికి వర్ణమునీయక నిరాకరించియుండెనట. ఆకారణముచేత నేడుకూడ వారి నవర్ణులుగా పరిగణింపవలెనట. వర్ణముయొక్క ప్రధాన లక్షణములగు సదుద్యోగము శాంతజీవనము వారవలంబించుచున్నంతవరకు వారికి వర్ణములేదనుట యథార్థమున కపచారమగును. వారు హిందువులైన కాకపోవలెను, వృత్తియైన లేకపోవలెను, లేనియెడల వర్ణము లేకుండుటెట్లు? వారు హిందువులు కాదను విపరీతవాదము నిదివరకే హైందవుడును చేయలేదు. వారికి వృత్తికలదనుట ప్రత్యక్షముగ కనిపించుచున్నది. ఇక వర్ణములేదనుట కర్థములేదు గనుక సకల వర్ణములవారు నెట్టి గౌరవాదుల కర్హులై యున్నారో వారును నట్టి గౌరవాదుల కర్హులై యున్నారు. సమస్త వర్ణములకును తెరచియున్న బావులు, చెఱువులు, బడులు, సభలు, కొలువులు, గుడులు వారికి తెఱవము అనుట బలాధికార నిరంకుశ దుర్వినియోగముగాక వేఱేమి? మహాత్ముడు వారికి హిందూసంఘమిచ్చిన కృత్రిమమగు అవర్ణత్వమును తొలగించుడనియే ప్రబోధించుచున్నాడు. అవర్ణత్వమునకే మాఱుపేరు అస్పృశ్యత. కృత్రిమమగు అవర్ణత్వభావమును మనము తొలగించుకొనుటయే మహాత్ముడు చెప్పుచున్నట్లు సవర్ణులు చేయించుకొనవలసిన ప్రాయశ్చిత్తకాండ. వారిని హిందువులుగ మన మంగీకరించినచో, వారి వృత్తి మానవశ్రేయస్కరమైనదనియు శాంతియుతమనియు మన మొప్పుకొన్నచో, వారిని సవర్ణులుగ మన మంగీకరించనియెడల మనము ఆత్మద్రోహము చేసుకొనుచున్నామనుట కాటంకమున్నదా?

మహాత్ము డెక్కడెక్కడకు వెళ్లినను ఈ సనాతన దివ్యవాణినే దిక్కులు పిక్కటిల్లునట్లు మ్రోయించుచున్నాడు. ఆంధ్రదేశములో కృష్ణామండల సంచారమును మదరాసునగర సంచారమును ముగిసినవి. అతనెక్కడెక్కడ విడిసినను, యేయేత్రోవ వెంబడి నతని కారుపోవుచున్నను అందందెల్ల లక్షలకొలది జనులు శ్యామలనీరదంబు ననుసరించి జను ప్రవృష్టి యట్లు పరువులెత్తుచుండుటయు, అతనుమాయమైన మఱుచటి క్షణమున నవి యెండపెట్టిన యాకసంబువలె వెలవెలబోవుటయు. ఏపండుగనా డెట్టి పర్వమునాడు ఈ నగరములు కాని పల్లెలు కాని రోడ్డులుకాని యిట్టి యుత్సవములు, ఉత్సాహములు, దానములు, ఉపన్యాసములు మొదలగువానిని తిలకించినవి! ఇదియంతయు హరిజనగాంధి ప్రభావము గదా! గాంధీమహోదయము ముందర అస్పృశ్యతామేఘములు పటాపంచలైనవి. సనాతనశిష్టులుకూడ ఈ భాస్కరునకు అవశముగ గౌరవరూపమైన అర్ఘ్యము నిచ్చు

టను తప్పించుకొనలేకున్నారు. ఈశ్వరసంకల్పమున కెదురెద్ది? అవర్ణత్వరూపముననున్న ఈ అస్పృశ్యతాపిశాచము నవనాగరికతాప్రభావమున నేమి, మానవప్రకృతిపై నుదయించిన గౌరవభావమువలననేమి, ఋషితుల్యుడైన మహాత్ముడు చేయుచున్న త్యాగము ఆత్మసమర్పణమువల్లనైతేనేమి, హరిజనులపైనుండి తొలగిపోవుచున్నది. దీనిని తిరిగి వారిలోనికి త్రోసిపెట్టగల మంత్ర తంత్రము లెట్టి కృత్రిమసనాతనుల వద్దను లేవు. మహాత్ముని దక్షిణదేశ ప్రయాణారంభమునుండియు శ్రీయుత దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారు వారికి తోడు నీడయై తిరుగుచు, బెజవాడలోను మదరాసులోనుగూడ తన దివ్యసుందరమందిరములను బసయిచ్చి వారి యారోగ్యసౌకర్యమున కెట్టి లోపమును కలుగకుండ వివిధోపచారములను చేయుచు ధన్యులగుచున్నారు. మహాత్ముడు చెప్పినట్లు వర్ణాశ్రమప్రధానమగు హిందూమతములో ఏజాతియైనను అవర్ణముగాగాని అస్పృశ్యముగాగానియున్నచో హిందూమతము నశించినదనవలెను; లేదా హిందూమతధర్మము నాలుగుపాదములపై నడుచుచున్నదన్న అవర్ణత్వము నశించవలెను. మహాత్మాగాంధి యుపదేష్టత్వమున దేశోద్ధారకునివంటి రాష్ట్రనాయకులు యజించుచున్న ఈ మహాధ్వరము సక్రమముగ నడచి అస్పృశ్యతాభావమును అవర్ణత్వపిశాచమును ప్రేల్చబడి హిందూసంఘమెల్ల నిష్కళంకముగుగాక!

మాతృభాషాసేవ :—

మాతృభాషాసేవ చేయవలయునని కంఠోక్తిగ బలుకువా రనేకులు గలరు గాని, చేయగలవారలుగాని చేసి చూపించువారలుగాని మిక్కిలి యరుదుగానున్నారు. చేసి చూపింతమను కోరికగలవారుకూడ పెక్కురున్నను, దుర్భేద్యమయిన ప్రస్తుతార్థికదుస్థితి వారి యుత్సాహమునెల్ల చల్లార్చును. కష్టపడి వ్రాసిన పుస్తకములను పెట్టెలోనున్న ధనము ఖర్చుపెట్టుకొని అచ్చొత్తించి, గ్రంథములు చెల్లక పేదవారై దిగులుపడి కృశించుచున్న కవులు గ్రంథకర్తలు ప్రాత సంపాదకులు మొదలగువారు ఆంధ్రదేశమునసెల్ల తల్లడిల్లుచున్నారు. ఇట్టి పరిస్థితులలో దిగులుపడి క్రుంగిపోక శ్రీయుత చాగంటి శేషయ్యపంతులుగారు తూర్పుగోదావరిజిల్లా కపిలేశ్వరపురములో హిందూధర్మశాస్త్ర గ్రంథనిలయమును స్థాపించి రేఖాగణితము, సహకారసంఘములచట్టము, లోకలుబోర్డు చట్టము, నిబంధనలు మొదలగు గ్రంథములను లోకలుబోర్డు అను మాసపత్రికను ప్రకటించుచుండుట ఎట్టి సాహసికునకుగాని ఆచ్చెరువు కలిగింపక మానదు. ఈ గ్రంథనిలయమున ప్రకటింపబడునవి శాశ్వతోపయుక్తములగు శాస్త్రీయగ్రంథములు కాని చవుకగా చెల్లి లాభములనుగూర్చు తమాషాగ్రంథములు, నాటకములు పరిశోధకనవలలు మొదలగు సామాన్యగ్రంథములు కావు. పైనఁజెప్పిన ఉత్తమగ్రంథములకు తోడు ఇప్పుడు శ్రీ శేషయ్యగారు హిందూలా (సమిష్టికుటుం

బము) అను నొక 413 పుటల యుద్గ్రంథమును ప్రకటించి రు. 3 లు మాత్రమునకే యిచ్చుచున్నారు. వీరి గ్రంథముల నన్నిటిని మే మప్పుడప్పుడు విమర్శించుచునేయున్న సంగతి పాఠకులకు విదితమైయేయున్నది. ఈ క్రొత్తగ్రంథము స్మృతి శ్లోకములు వ్యాఖ్యానములు వాని తాత్పర్యములు ఇంగ్లీషులోనున్న హిందూలా గ్రంథములలోని సెక్షనులు, వానిపైని వ్యాఖ్యలు, విమర్శనలు, హైకోర్టుల తీర్పులు మొదలగు విషయములతో అసందిగ్ధముగ వ్రాయఁబడినది. సులభమగు శైలి. అక్షరాస్యులైన ఆంధ్రులెల్లరును దీని నా మూలాగ్రము పఠించి హైకోర్టు వకీళ్లకు మించిన విజ్ఞానముతో నలరారగలరు. వ్యవహారజ్ఞానము కావలసిన వారి కెల్లరికి నిది పారిజాతమువంటిది. మహా క్లిష్టసమస్యలను విశదీకరించు సందర్భమున గూడ ఇది నవలవలె చదువనొప్పునన్న దీని శయ్యామనోహరత నేమని కొనియాడగలము. శ్రీ శేషయ్యగారి యీ సదుద్యమునకు ఆంధ్రవ్యవహర్త లందఱును వారి గ్రంథములను కొనుక్కొనుట మూలముగా మహాదరణము నిచ్చి ఆంధ్రభాషాభివృద్ధికి తోడ్పడుదురుగాక!

మదరాసునగర హరిజనసేవాసంఘము:—

మహాత్ముని ప్రథమోపవాసదీక్ష ఆసేతుశీతాచలపర్యంతముగల సకల దేశసేవకుల దృష్టిని హరిజనాభ్యుదయముపై కేంద్రీకరించి, అనేక సంఘోపసంఘములను దేశమందంతట నెలకొల్పెను. మదరాసు సంఘమట్టివానిలో నొకటి. ఇది 1932 సెప్టెంబరులో స్థాపింపఁబడి, డిశంబరులో మదరాసు రాష్ట్రీయ సంఘమునకు శాఖగా చేర్చుకొనఁబడెను. ఆరుగురు ప్రచారకులతో నిది ప్రారంభమై రు. 7000లకు పైగా ద్రవ్యమును పోగుచేసి రు. 6758లను ఇంతవరకు హరిజనాభ్యుదయమునకై ఖర్చుపెట్టెను. మదరాసులో జరిగిన ఉత్సవములలోనెల్ల అనేక కరపత్రములు పంచిపెట్టఁబడెను. భజనలు సల్పఁబడెను. ఉపన్యాసము లీయఁబడెను. ఆరోగ్యోపన్యాసములు, సినీమా మేజికులాంతరు ప్రదర్శనములు కూడ సలుపఁబడెను. అరుంధతీయపురములో నొక విద్యార్థి వసతిగృహము, స్త్రీసమాజము స్థాపించుటయేగాక, పఠనమందిరమునకు విరివియగు సహాయము చేయఁబడెను. వయోజనులకు చదువు, వ్రాతలెక్కలు నేర్పఁబడెను. నేవలుహాస్పిటలు రోడ్డులో హరిజనులకు శరీరవ్యాయామము, ప్రాతస్స్నానము, విద్యాభిరుచి మొదలగు సదభ్యాసములు నేర్పఁబడెను. నుంగంబాకములో స్త్రీసమాజము నెలకొల్పఁబడెను. అందు స్త్రీలకు వివిధవిషయములు సంభాషణారూపమున సవర్ణస్త్రీలవలన గఱపఁబడును. 26గురు బాలికలకు విద్యార్థివేతనములును అనేకమంది బాలబాలికలకు పుస్తకములు మొదలగునవియు నీయఁబడెను. సవర్ణప్రచారకులు తెపతేపకు హరిజనుల కుప్పములకేగి యిష్టాగోష్ఠి సంభాషణలు సలిపి, వారి వారి యవసరములను గుర్తించి తగిన సహాయమును చేయుచుండుటను వీరు ప్రధానాశయముగ పెట్టుకొనిరి. ఇట్టి

యుత్తమకార్యక్రమమును నెరవేర్చిన ఏతత్సంఘాధ్యక్ష కార్యదర్శికోశాధికారులెంతయు అభినందనీయులు. నగరవాసులితోధిక ద్రవ్యసహాయము నీ యుపసంఘమునకు సలిపి హరిజనుల సర్వతోముఖాభివృద్ధికి తోడ్పడుదురుగాక.

కీ॥ శే॥ సరోజినీ దేవిగారు:—

22.11.1933 తేదిని తటస్థించిన శ్రీమతి మాడపాటి సరోజినిదేవిగారి యకాలమరణమువలన ఆంధ్ర నాటకరంగమునకే గాక కన్నడరంగభూమికిని దక్షిణహిందూస్థానపు రంగభూమికిని తీరనినష్టము వాటిల్లినది. ఈమె మరణమువలన నందనవనమునుండి పారిజాత మపహరింపఁబడినదని చెప్పి శ్రీయుత టి. రాఘవాచారిగారు వాపోవుచున్నారు. పురుషులతోపాటు రంగస్థలమున పాత్రధారణగావించిన స్త్రీలలో నీమె ప్రప్రథమురాలు. రాఘవాచారిగారి పాశ్చాత్యఖండపర్యటనానంతరమున నీమె వారికి కుడిబుజమై నిలచిన సాహసికురాలు. నటనాకౌసల్య మీమెకు స్వతస్సిద్ధముగ వచ్చినదే తప్ప అభ్యాసమువలన లభించినది కాదని రాఘవాచారిగారి యభిప్రాయము. ఈమె మదరాసులో తొలుదొల్త లీలావతి పాత్రను ధరించినప్పుడే సభికులెల్లరు నభినందనములు కురిపించిరట. ఆమె మంజులగానముచే శ్రోతలు కఱగెడివట. అట్టి యువతి అనతికాలములో నెంతటి ఘనవంతురాలైన నయ్యెడిదే కాని జ్ఞానోపార్జనమే కాని ధనోపార్జనము తన యాశయము కాదని ఆమె చెప్పుచుండెడిదట. ఆమెనుగూర్చి శ్రీ రాఘవాచారిగారు చెప్పిన యీ దిగువ వాక్యములు పఠించిన యామె గుణగణములును ప్రజ్ఞయు నెల్లఱకు తెల్లము కాగలవు.

“స్వాతిశయమనునది మచ్చుకైనను లేక నిర్మలమును అవ్యాజమునగు కళాపరత్వముగల మరొక అట్టివ్యక్తిని సహకారిణిగా నే బడయజాలుదునని చెప్పగలనా? ఆమెపై నేను కొండంత ఆస పెట్టుకొంటిని. ఆమె నాయండనుండిన భారతనాటకరంగమునకు ఘనమగు సేవలను చేయజాలుదునుగదా యని యువ్విళ్లూరితిని. తెలుగునాటబుట్టి, తెలుగునేర్చి, తెలుగుననే నాటకములాడుచుండినను అచిరకాలములో కన్నడభాషయం దుచితప్రావీణ్య మలవఱచుకొని శ్రీ పి. వెంకటరామయ్య (బెంగుళూరు) గారిచే రచింపబడిన నాటకమునందు “మండోదరి” పాత్రను ధరించెను. ఆమె “మండోదరి” పాత్ర నాశ్చర్యసంభ్రమముల కలుగజేసెను. ఆమె పరిమాణ మల్పమైనను, ఆయమ అభినయమత్యున్నతము. ఆమె గానము నిసర్గమనోహరము. ఆమెతో రంగమున పాత్రధారణ వహించుటకు నాకదియే కడతూరి. ఇంత త్వరలో నిట్టి ఎడబాటు కలుగగలదని కలనైన యూహింపనైతిని. ఆయమ స్మృతియే నాకు బాసటయై నా భావిప్రయత్నములకు విజయమును చేకూర్చునని విశ్వసించుచున్నాను.”

పరమేశ్వరు డీమె యాత్మకు శాశ్వతానందమును గూర్చుగాక!

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.

# గృహలక్ష్మి ఏజెంట్లు

తెనాలి: కొమ్మూరి కాశీవిశ్వనాథంగారు, సోల్ రిప్రజంటేటివ్ ఆఫ్ న్యూస్.
మచిలీపట్టణము: పి. సత్యనారాయణగారు, C/o తాడేపల్లి సుబ్బారావు బ్రదర్సు.
హైదరాబాదు: ఎన్. లక్ష్మీబాయిగారు, 566 రెసిడెన్సి పెద్దగడియారం, చౌరస్త మార్కెటురోడ్డు, (మన ప్రాంతపు 1 రూ॥ఉస్మానియా రూ 1-3-0అగును)
నిడదవోలు: తాటిమేటి కుటుంబశాస్త్రిగారు.
తాడేపల్లిగూడెం: కాశీరాజు శ్రీరాములుగారు.
జెమ్ షెడ్ పూర్: టి.వి. రమణయ్యగారు, C/o ది ఇండియన్ హ్యూమ్ పైప్ కంపెనీ, [లిమిటెడ్.
బరంపురం: నిష్టల కృష్ణమూర్తిగారు, న్యూస్ పేపరు ఏజంటు.
గుంటూరు: వెల్ కం అండు కంపెని.
అనకాపల్లి: గ్రంధి కన్నయ్యపంతులుగారు, గాంధిమార్కెటు.
సామర్లకోట: ఆరాధ్యుల మూటయ్యగారు మర్చంటు.
పిఠాపురం: న్యూస్ ఏజెన్సి ఎం. సూకరాజు, ఆంధ్ర
రాజమంద్రి, విశాఖపట్టణం: ఎ. కృష్ణమూర్తి బ్రదర్సు.
మదరాసు: వై. నారాయణగారు, 364 ఎస్ప్లనేడు. ఆకుండి వేంకటశాస్త్రిగారు.
నెల్లూరు: భట్టారం లక్ష్మీనారాయణ శర్మగారు, గాంధిచౌకు.
తణుకు: వడింపల్లి సూర్యనారాయణగారు, న్యూసుఏజంటు.
బెజవాడ: ఆంధ్రా ఇన్ డస్ట్రియల్ స్టోర్సు, బకింగుహామ్ పేట.
పాలకొల్లు: లొల్లా వెంకటరావుగారు.
నరసాపురము: కటికల సూర్యారావుగారు, కుమ్మరివీధి.
భీమవరము: అమిరపు శేషాచలశర్మగారు.
ఒంగోలు: తాతా బాలయ్యశెట్టిగారు, వర్తకులు.
రంగూను: వి. భగవతిశాస్త్రిగారు, న్యూసుఏజెంటు 244 ఫేర్ వీధి.
కర్నూలు: చెట్టి రోశయ్య చెట్టిగారు, వర్తకులు.
చిత్తూరు: వాటంబాటి. వెంకటరామయ్యగారు 163 బజారురోడ్డు.
ఖరగ్ పూర్: ఆదిభట్ల తరిణయ్యసిద్ధాంతిగారు, 63 B 1 Unit 10, న్యూస్ పెటిల్మెంటు.
సెకంద్రాబాదు: కె. సుందరరావుగారు Cloth Mills Agent. పాగాకుబజారు.

హిగిన్ బాతమ్ స్టాలులవద్ద దొరకును.

ఇతరచోట్లకు ఏజెంట్లుకావలెను. వివరములకు దరఖాస్తు పంపుకొనుడు